చ. "ఘనుఁ డిదియేమొ యిప్పటికిఁ గాంతుని రాకనుపోయెనంచు నె
మ్మనమునఁ జింతవూని యొకమానిని ముగ్ధ కురంగలోలలో
చన ప్రియుదారిసూచు సతిసాంద్రనిగూఢమనోనురాగయై."

—గంధవహము.

# శ్రావణసంకీర్తనము

హరి రాధాకృష్ణమూర్తిగారు

అనువగురూపసంపద యొయ్యారమునం ద్విగుణంబుగాఁగ నే
ర్చినజలపూరముల్ మదము రెక్కొన స్వాగతమీయ నల్లమ
బ్బునవలిపంబుదాల్చి మెఱుపుంబలె యల్లనఁ జేరవచ్చు ని
న్గని జగమెంతయున్ సుఖముగాంచునుగాదె నభోవిలాసినీ!

శ్రావణశుక్రవారమని శ్రావణమంగళవారమంచు తా
మేవిధి నేమముల్ జొనిపి యిండ్లనువీడి చరించు పుణ్యకాం
తావళిగాంచిసన్ మనసునం బ్రభవించునుగాదె నేటినుం
డేవనితామహోన్నతి వినిశ్చితమై దనరారునట్లుగాన్.

లాతివిగావు నీవు సకలంబు జగంబు ముదంబునొంద నా
శాతటముల్ జయధ్వనులుసల్పగ యాదవవంశమందు వి
ఖ్యాతుఁడు కృష్ణదేవుఁడు బ్రయత్నముతో తగ జన్మమెత్తగా
నైతివి! దీననెంతటి మహామహిమంబో నుతింపనేర్తుమే.

ఉపనయనమను కర్మతానొదవనైన
బ్రాహ్మణత్వంబు పూర్తికారానిదికద
మాసమా! నీయెడను దివ్యమంత్రి పూత
ముగను మౌంజీవిముక్తిచే నెగడకున్న.

బయటికిరాని యట్టులను బాడియు, నెన్నఁడుజూచినన్ మహా
భయమును గూర్చువర్షములు బాగొకయింతయులేకయున్న నీ
ప్రియమగురాక పుణ్యలగుస్త్రీలను బ్రీతిఁదనర్చుఁగాన నో
ప్రియతమ! మాకుగూడను జపింపగనైతివి సర్వవేళలన్.




# లోధియనునివేదిక: స్త్రీలు

లోధియనునివేదిక స్త్రీలకుగల ఓటింగుహక్కు పెంపొందించువిషయమున విశాలాశయములను చూపినది. కాని మాసమకాలికపత్రికయగు 'స్త్రీధర్మ' స్త్రీలవిషయమున లోధియనునివేదిక చాలసంకుచితముగ నున్నదని వ్రాసినది. ఈఅభిప్రాయముతో మేమేకీభవింపజాలము. నివేదికయందు స్త్రీల ఓటింగుహక్కులు, వానికి సంబంధించిన విషయములుగల ప్రకరణములను చదివినవారెల్లరును లోధియను కమిటీసభ్యులందఱును స్త్రీయుద్యమాభివృద్ధియందు చక్కనిసానుభూతి నగుపఱచిన విషయము కనుగొనగలరు. ఇపుడున్న పద్ధతిప్రకారము మగఓటరుల సంఖ్యలో ఇరువదియవవంతుమాత్రమే స్త్రీఓటరులు గలరు. జనసంఖ్యనుబట్టి చూచినచో మగఓటరులే మిక్కిలితక్కువ. ఆతక్కువ సంఖ్యగల మగఓటరులలో ఇరువదియవవంతుమాత్రమే స్త్రీలకు ఓటింగుహక్కుగల దనుటచే ఈపద్ధతిని భారతదేశమున కంతకును ఓటింగుహక్కుగల స్త్రీలు కొన్నిలక్షలుమాత్రము ఉందురు. ఈపద్ధతిలో ఓటింగుహక్కు ఆస్తిపై ఆధారపడిఉన్నది. సొంతముగ ఆస్తిగల భారతస్త్రీలు ఎందరుందురు? లోధియనుకమిటీవారిసిఫారుసువలన సొంతఆస్తివలననేగాక చదువనువ్రాయను నేర్చియుండుటచేతను, ఓటుగలవాని భార్యయైయుండుటచేతనుగూడ స్త్రీకి ఓటింగుహక్కు గలుగుచున్నది. ఇందుచే ఓటుగల స్త్రీలసంఖ్య మిక్కిలి హెచ్చగలదు. ఇపుడున్న సంఖ్యకు ఇరువదియొక్కసార్లు హెచ్చగలదని లోధియనుకమిటీవారు అంచనావేసి చెప్పుచున్నారు. మేజరైన ప్రతిపురుషునకును, ప్రతిస్త్రీయు ఓటింగుహక్కు కలిగియుండవలయునను ప్రజాస్వామికవాదము వాంఛనీయమే. కాని దేశమున్నస్థితిలో—కులకక్షలు కోళ్లవలెకూయుచున్నప్పుడు—విద్య వ్రేళ్ళపై లెక్కింపగలయంతమందిమాత్రమే నోచుకొనుచున్నప్పుడు—ఆవాముద వరణీయము కాదనుకొందుము. తొందరపడి గొనివచ్చుచో దానివలని లాభములకంటె నష్టములే హెచ్చుఅగుననుట నిశ్చయము. కావున అనుభవముతో అభ్యాసముచేయుటకు

లోధియనునివేదికలోని పద్ధతిఎంతయు అనుచితమైయున్నది. ఇపుడున్న పద్ధతిని మగఓటరుల సంఖ్యలో స్త్రీ ఓటరులసంఖ్య ఇరువదియవవంతు అని చెప్పియుంటిమిగదా! ఈనివేదికలో సూచింపబడిన ప్రద్ధతిని మగఓటరుల సంఖ్యలో స్త్రీఓటరులసంఖ్య అయిదవవంతు ఉండ గలదు. ఇప్పటికీమాత్రము చాలుననుటచే మేమల్పసంతోషులమనిపించుకొనకుందుము గాక! చదువులేమి, పరదాప్రచారము సల్పు విషయమున స్త్రీకి ఆచారము అనుమతింపమి మొద లగు ప్రతిబంధములు కాలముచే కత్తిరింపబడిన పిమ్మటను మేజరైన ప్రతిస్త్రీయు ఓటర గుట స్త్రీసంఘమునకు, ప్రజాసంఘమునకును, దేశమునకును క్షేమము. లోధియనుకమిటీ సూచనలప్రకారము స్త్రీఓటర్ల సంఖ్య క్రిందిపట్టిక చూపగలదు. ఇందు చదువువచ్చిన హక్కు

| నంబరు | రాష్ట్రము | సొంతఆస్తి హక్కుకలవ | చదువు వచ్చిన హక్కుకలవ | ఆస్తిగలమగని భార్యయై యుండు హక్కుకలవ | స్త్రీఓటరుల మొత్తపు సంఖ్య | మగఓటర్లకు స్త్రీఓటర్ల రేషియో |
|---|---|---|---|---|---|---|
| 1 | మదరాసు | 718,000 | 345,000 | 700,000 | 1,500,000 | 4 : 1 |
| 2 | బొంబాయి | 50,000 | 163,000 | 592,000 | 750,000 | 4 : 1 |
| 3 | బెంగాలు | 500,000 | 377,000 | 800,000 | 1,500,000 | 4 : 1 |
| 4 | సంయుక్తరాష్ట్రము | 414,000 | 128,000 | 1,100,000 | 1,500,000 | 4 : 1 |
| 5 | పంజాబ్ | 101,000 | 85,000 | 378,000 | 450,000 | 5 : 1 |
| 6 | బీహార్ అండ్ ఒరిస్సా | 46,000 | 77,000 | 280,000 | 350,000 | 8 : 1 |
| 7 | మధ్యమాగాణములు | 70,000 | 40,000 | 266,000 | 350,000 | 5 : 1 |
| 8 | అస్సాము | 30,000 | 40,000 | 192,000 | 220,000 | 4 : 1 |

వలన స్త్రీకి ఓటుఇచ్చుటచే స్త్రీలలో విద్యాసక్తిని పెంచును. ఆత్మగౌరవముగల స్త్రీ హక్కువలననే ఓటుసంపాదింప ఇచ్ఛగింతురు. ఇచ్ఛగలవారెల్లరును ఈహక్కును ఉపయో చుకొనవచ్చును. ఏదైన ఒకభాషలో ఉత్తరముల్వ్రాసి చదువగలవారిని చదువెఱింగిన వారిగ లెక్కవేయుట జనాభాలెక్కల సంప్రదాయము. ఆసంప్రదాయమే ఇచటగూడ సంప్ర యోగమగుచున్నది. ప్రభుత్వమువారిలెక్కలలో విద్యావతియనబడు ప్రతిస్త్రీయు మేజ గుటతోడనే ఎన్నికదారుల పట్టాలలోగూడ చేర్చుకొనబడవలసియుండును. ఇతరస్త్రీలు మకు చదువువచ్చినట్లు ఎవరైన గౌరవోద్యోగులచే నిదర్శనపత్రమునంది ఎన్నికదారుల ట్టికలో చేర్చుకొనబడుటకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. ఈపద్ధతిచే పాఠశాలలో విద్య భ్యసించిన వారికేకాక ఇంటివద్దమాత్రమే విద్యనార్జించినస్త్రీలుగూడ ఓటరులు గావచ్చును. అగుట వారిసంఖ్య విద్యాప్రచారాభివృద్ధితోబాటు అభివృద్ధినందును. ఆస్తి కి, అవివాహితగనుండు స్త్రీ విద్యావతియగుటచే ఓటుహక్కును పొందుచున్నది. విద్య ఓటింగుహక్కును ప్రసాదించుచున్నది గావున స్త్రీవిద్యాభివృద్ధివిషయమున ఇప్పటికంటె కముందు హెచ్చుప్రచారము జరుగగలదు. ఇంతకంటె కోరదగినది యేమిగలదు?

# స్వప్నము

శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

పూర్ణిమనాడు సుధాకరుడు తనశీతలకిరణములచే లోకమును మహానందాంబుధిలో నింపుచుండెను. అది గ్రీష్మఋతువగుటకొక్కింతతాపముగానుండినను ఆయమృతమయచంద్రికలో నాచిత్తమమితానందము పొందుచుండెను.

అట్టిసమయములో నీమంచము ఎక్కడవేయమందువు అని మాఅమ్మ నన్ను ప్రశ్నించెను. వాకిట ముందు ఆరుబయలునందు వేయుమంటిని. ఆమెయు ఆఆనందమయజ్యోత్స్నలో నాధవళపర్యంకము నమర్చెను. నేనాతల్పమునందు శయనించిననిమిషముననే గాఢసుషుప్తిలో లీనమయితిని. పరమేశ్వరుడొక్కింతసౌఖ్యమును గనబరచినవెంటనే తన్మయులుగాక ఉండునట్లు నేదేనికష్టమును సంఘటింపజేయునుగదా? అంతలో నొకమేఘము మృగాంకుని కడ్డుగావచ్చి నాలుగు చిటబొటచినుకులను వదలెను.

ఆచినుకులను లక్ష్యముచేయక ఒకదుప్పటిచే శరీరమంతయు కప్పుకొని నిశ్చలముగాపరుంటిని.

పెద్దవర్షమువచ్చిన ఏమోగాని ఈచినుకులకు మాత్రము జంకలేదు. అటులనే మరల నిద్రలో లీనమయితిని. అందు నేనొక స్వప్నముగంటిని.

నేను ఒకరియింటిలో అల్లారుముద్దుగా పెంపబడుచుంటిని. నాతలిదండ్రులు, సోదరీసోదరులు తక్కుంగల బంధుమిత్రులు నన్నెంతయు గౌరవించుచుండెడివారు. నేనును యౌవనవతినైతిని. నాతలిదండ్రులు నన్నొకయువకునకిచ్చి వివాహముగావించిరి. మేమిద్దరము నత్యంతవైభవము ననుభవింపుచు ననుకూలదాంపత్యములో నొప్పుచుంటిమి. మాకు ఎన్నియో దివ్యభవనములుగలవు. ఆభవనములచుట్టును చిన్నిచిన్ని ఉద్యానవనములుగలిగి ఎంతయు రమణీయముగానుండెను. ఆమేడలలోని విద్యుచ్ఛక్తిదీపములు నయనానందము చేకూర్చుచుండెను. ప్రతిగదియందును ఇనుపపెట్టెలుగలవు. ఆఅయఃపేటికలనిండ ధనములప్రోవులే గానవచ్చుచుండెను. నాకున్న చీనిచీనాంబరములలెక్కగాని వాటివిలువగాని చెప్పనాతరముగాదు. ఇట్టిమహోన్నతదశలో తులతూగుచుండు మాకు నిరువురుసంతానము గలిగిరి.

వారల రూపురేఖావిలాసములుచూచిన మానవమాత్రుల కక్కజముగానుండును. వారలు కేవలము మన్మథసదృశులు. ఇంటినిండ కిటకిటలాడుచుండు పరిచారికాజనము నాయాజ్ఞలకొర కెదురుచూచుచుండ స్వర్గీయసౌఖ్యమును జూరగొనుచుంటిని. ఈరోజులలోని నాదినచర్యయుచెప్పినగాని మనస్సుకుదుటబడదు.

ప్రాతఃకాలమునలేచుట, నిత్యకృత్యములదీర్చుకొని వంటమనిషి తయారుచేసిన ఉపహారము, కాఫీ సేవించుట, వార్తాపత్రిక చదువుట, వచ్చుచుపోవుచునుండెడి స్నేహితబృందముతో ఇష్టాగోష్ఠిరామాయణప్రసంగములచేయుట, భోజనముచేయుట, మధ్యాహ్నము కొంతతడవు విశ్రమించుట, టీ ఉపహారముతీసుకొని సర్వాభరణములతో నలంకృతనైవాహ్యాళికై వెడలుట, రాత్రియందు భోజనముచేసి శయనించుట. ఇట్టి చర్యలతోడనే దినములు, వారములు, మాసములు, వత్సరములు గడచినవి. ఒక సాయంసమయమున బిడ్డలను దాదుల కొప్పగించి నాస్నేహితరత్నములును నేనును నదిఒడ్డునకు వాహ్యాళికై యేగితిమి. అచ్చట తెప్పవానినిపిలచి రెండుడబ్బులుయిచ్చి తెప్పలోకూర్చుని నదిమీద కొంచెముదూరము విలాసార్థముగా ఏగితిమి.

పరమేశ్వరుడు ప్రపంచములో సౌఖ్యమును చిరకాలమనుభవింపనీయడు. సౌఖ్యవంతమగు నాజీవితమును పవిత్రప్రేమాతిశయముల కాస్పదమగు భర్తను పుత్రులనుత్యజించవలసివచ్చినది. నానౌక జలమధ్యమున గిరగిరతిరుగుచుండెను. అయ్యో! ఇక్కడ సుడిగుండముకలదాయని ప్రశ్నించితిని. అందరకు భయో

త్పాతముగానుండెను. ఇట్టికష్టపరిస్థితులలో ఈనాకను దరిజేర్చువారెవరు? నామొరాలకించువారెవరు? ఇది తప్పించుకొనజాలినను యీతరాదు. సంసారసాగరమునమునిగి పరమేశ్వరునియందలి భక్తిచే తప్పించుకొనవెరవురుండియు మదోన్మత్తనై అజ్ఞానజనితభావములయందేకాగ్రతనునిచి నాస్తికవాదములతో కాలము గడపిన నాకు ఇప్పుడు పరమేశ్వరా! ఇందుండి రక్షింపుమనుటకు నోరెట్లాడును? భగవంతుడు దయాళుడు, దీనజనావనతత్పరుడు, "నారాయణా"యని కుమారుని చీరివంతనే అజామిళుని రక్షింపలేదా? మూడు ఘడియలలో తనజీవితము పూర్తిగానున్నతరి ఆకాలదిసమయమునసే భగవద్ధ్యానముచేసిన ఖట్వాంగునికి కైవల్యమునొసగలేదా? ఈసమయమున అటులనే భగవద్ధ్యానముచేసిన నన్ను రక్షింపడాయని యనుకొని వెంటనే భగవచ్చింతనముచేయ దలపెట్ట అభ్యాసవశముచే నామనస్సు కాఫీ, ఉప్మాలమీదకే పరుగిడజొచ్చెను, చూస్తూ, చూస్తూ ధనరాసులు సేవకులు భర్త బిడ్డలు బంధుమిత్రులనువదలి వెళ్ళవలసివచ్చినదిగదా యని మనస్సు పరిపరివిధముల కొట్టుకొనజొచ్చెను. కాని "జాతస్యమరణంధ్రువ" మనునటుల మరణమెప్పటికైన తప్పదుగదాయని యనుకొనినను ఇట్టియుత్తమజన్మ మరల వచ్చునాయని సందేహముకలిగినది. పూర్వాకృత పుణ్యకర్మవలననేగదా ఇట్టి మహోన్నతదశనొందగలిగితిని. ఈజన్మమునందుననే సకలకామంబుల ననుభవింపుచు కామదాసురాలనై అజ్ఞానముచే నావరింపబడియుంటిని. నేనొక్కతెనేగాదు నాతోటి సోదరీరత్నములను ఈరకములోనికే దింపినదానను.

సహవాసమెట్టిదైయుండునో తత్ఫలిత మట్టిదైయుండునుగదా? భగవచ్చింతయెరుగని నేను అధఃపతనమునొందుట నిక్కముగదా? అయ్యో! ఏల నుదినములన్నియు వ్యర్థపుచ్చితిని? జవసత్వములుకలిగిన యప్పుడు భగవద్ధ్యానముచేయక జీవితనాకమునుగనున్నతరిచేయబూన అభ్యాసవశముచే భావోన్మాదము చెందుచుండ నేచేయునదేమి? నాజీవితమంతయు బూడిదలోపోసినపన్నీరుభాతి నిష్ప్రయోజనమయినది. ఇహసుఖమే సుఖమనుకొంటినిగాని శాశ్వతసౌఖ్య మదికాదుగదాయని తెలుసుకొనలేకపోయితిని అని నేను విచారపడుచుండగనే జాగ్రదవస్థబొందితిని.

కన్నులు తెరచిచూచి పరమేశ్వరానుగ్రహమువలన బ్రతికియేయుంటిని. కాని అభవనములు బంధుమిత్రాదులు కనబడరేమి? నేననుభవించినదంతయు స్వప్నమా? యని యనుకొనుచుండ నాఅంతర్వాణి కుమారీ! నాస్వప్నమునుగనుచున్నంతదనుక యెటుల సంసారములోనిహోయినిగనుచుంటివో యెటుల బంధుమిత్రాదులు వారనియు అదియే శాశ్వతమనియు తలచితివో అటులనే అజ్ఞానావస్థలోఉన్న ఇప్పుడును బంధుమిత్రాదులు ఈభవనములు నీవనియే భ్రమపడుచుందువు. ఈ నీశరీరమునందుండి నీప్రాణము స్తమించినవెంటనే యిచ్చట నీ వనుభవించినదంతయు మిథ్యగాయుండును. నీవిప్పుడు అజ్ఞానమనబడుకలలో నిమగ్నవైయుంటివి. ఈఅజ్ఞానములో నిమగ్నవుగాక ఐహికవిషయులయం దప్రమత్తవైయుండుము. అహింసాసహితమైన సుకర్మ చేయుచు భగవద్భక్తికలిగి సజ్జనసాంగత్యము సలుపుమాయని ప్రబోధించెను. వెంటనే నేనులేచి నిత్యకృత్యములదీర్చుకొని భగవత్పూజారాధనలనొనర్చి పరమేశ్వరునిమహిమాతిశయముల కీర్తించి యిట్లని ప్రార్థించితిని. హే! దయాసింధూ! పరమేశ్వరా! నీమహిమలనంతములు. నీకృత్యములు వర్ణనాతీతములు. నీలీలలు వర్ణనాతీతములు. సృష్ట్యాదిమొదలు దినములు వారములు మాసములు వత్సరములు యుగములు మహాయుగములు కాలుడు సారెత్రిప్పునట్లు గిరగిరత్రిప్పుచునేయున్నావు. ఈకాలచక్రాంతర్భాగమున నీచే ఎన్నిజీవులు సృజింపబడుచున్నవో? ఎన్నిసమయుచున్నవోగదా? ప్రతిజీవియు పూర్వజన్మాంతరకర్మలవలననే జన్మలెత్తుచు తదనుగుణ్యమైన పుణ్యపాపమిశ్రితమైన సుఖదుఃఖముల ననుభవింపుచునే భౌతికకాయమును విడుచును.

జీవుడు ప్రస్తుతము యీశరీరములోనుండి అహంభావపూరితుడై మమకారము చేత తపించును. ఈ గృహము నాది, వీరలు నావారలు, యీధనకోశములన్నియు నావియేయనెడి అజ్ఞానావస్థలో నిమగ్నుడై తపించుచుండును. ఔరా! ఏమి నీమహిమాద్భుతప్రదర్శనము?

మాయాప్రపంచమెన్ని విలాసముల కాటపట్టుగనున్నదోగదా?

ఈమహామాయావ్యామోహవిలాసముల కాటపట్టగు ఈప్రపంచమున అడవులోని దున్నవలె తన్నుకొనుచుంటిమి. యదార్థముగా మేమిచ్చట దేనినియనుభవింతుము? మాకు స్థిరరూపమున నిలుచునదెద్ది? మోహవిభ్రాంతినిగూర్చుచు అనంతసౌఖ్యము లనుభవింపచేయునట్లు భ్రాంతినిగూర్చు వస్తుజాలము లెవ్వియు సౌఖ్యమునకు కారణముకాజాలవు. సత్యముగా వీనినుండి సౌఖ్యమును బొందునట్లుయుండును గాని అట్టి సౌఖ్యము నిలకడకాజాలదు. ప్రారబ్ధవశమున భౌతికకాయములో జీవుడు అజ్ఞానావస్థయందు కొట్టుకొనుచూ సుఖమునకు మోదంబును, దుఃఖమునకు ఖేదంబునుబొందుచు సర్వకష్టసుఖములు తనవిగానే భావింపుచు గొప్పపదవియందుండునప్పుడు తనయంతవాడు లేడని తలపోయుచు ప్రారబ్ధవశమున తన్నాశ్రయించుకొనియుండు జీవులను అన్యాయార్జితములవల్ల తనుపుచునుండును. కర్మనడలి యీకాయమునుండి జీవుడునిర్గమింపగానే సర్వము మిధ్యగానుండును.

బాంధవులెవ్వరును కానరారు. ధనసంచయము వెంటరాదు. అప్పుడు శరణ్యమేమి? తాచేసినది దుష్కర్మమా? సుకర్మమా? ఆలోచించును. ఖిన్నుడగును. యేదిరైనను తప్పునా? తత్కర్మ ననుభవించును. తన్నవెంబడించునది పుణ్యము, పాపము. నిలుచునది కీర్తి, అపకీర్తి. కాన మేమెన్నివిధముల ధనసంచయములచే కూర్చినను వాటిని సద్ధర్మముల కుపయుక్తమవునట్లు అనుగ్రహించుము. మేము చేయుసకలకార్యములు సకలభూతహితముగానుండునట్లు ఆశీర్వదించుము.

పుత్రదారాప్తబంధూనాంసంగమః పాంధసంగమః
అనుదేహంవ్రజంత్యేతే స్వప్నేనిద్రాగమే యథా.

# హృదయనిర్భేదము

సరహరిసెట్టి శేషగిరిరావుగారు

పపురాకృతదుష్కృత్య విూవిధానఁ
జిచ్చువెట్టెనో త్వత్సుధాజీవనమున,
ముగ్ధమోహనదరహాసపూతమైన
మోముసందంతకాళిమ మేమి? తల్లి!
ఆకరాళాస్యదంష్ట్రిల కపుడెదొరకె
నావె! నీమనోహరవదనమ్ము, నీను
ధామరోమాళులునిచ్చు సంతసనునేఁడు
దగ్ధమైపోయె బాల్యవైధవ్యకీల.
సతతమువవనయే నీవిషాదజీవి
తప్రపంచమ్మునందున, తావకీన

దీనచరితమ్ము విన్న శిలానివహము
కరగి యేఱులై ప్రవహించుఁగాదెబాల,
ఈదినంబాది సౌఖ్యమింతేని లేదు
నీకు, ముచ్చటకునయినసీవు వాడు
పూవునేని నీతలలోన ముడువరాదు,
ఒక్కయాభరణమ్మేని యుంచరాదు.
పసితనమ్మందె వైధవ్యవహ్నిఁ జేతు
లారఁద్రోసిన యాచారప్రహస్వదృష్టి
త్వత్సుఖలవమ్ము కులలవిత్రమ్ము— లేక
బ్రహ్మహత్యనుమించిన పాతకమ్ము.

# శీలము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

శీలము అనుపదమున కర్థమందరకు తెలిసియేయుండును. మంచినడవడి అనునదే దీనికిమూలము. ఇది స్త్రీపురుషుల కిరువురకుం దు మతవిధినిఁ దెల్పును. ఈవ్యాసమునందలి శీలము ప్రస్తుత పురుషజీవితమునే ముఖ్యముగా చర్చించును.

మనము భారతీయులము. మనఖండము కర్మధర్మశీలముల కునికిపట్టగుపవిత్రదేశము. ఖండఖండాంతరముల వన్నె కెక్కిన శీలవతులను, శీలవరులనుగన్న భరతమాత మనతల్లి. వేదశాస్త్రవిధిగా పంచభూతసాక్షిగ వివాహమైన భార్యనుతప్ప తదితరస్త్రీలను మాతృసోదరీతుల్యులుగాభావించి, ధర్మపత్ని అర్థాంగియన్న పదజ్ఞానముతెలిసి, నిజభార్యసహాయమున పుణ్యకర్మల నొనరించుచుండిన శ్రీరామాది ప్రాచీనమహనీయుల జన్మీయులము. ఏకపత్నీవ్రతమే మనవారిమతము. తనచే పరిత్యజించబడిన సీతాదేవి లేనిదేయాగముచేయకూడదనుటచే బంగారుసీతావిగ్రహముసాక్షిగా అశ్వమేధయాగమొనరించిన శ్రీరామచంద్రుని పత్నీప్రేమయెంతటిదో విమర్శనీయము. ఇప్పటి మనపురుషులవలె వివాహబంధము గడ్డిపరకవలెత్యజించి, రోజుకు రెండుపెండ్లిండ్లు ఆచారమేఅప్పుడున్న రాముఁడేల మరొకపెండ్లిచేసికొనలేదు.? "ఆజన్మాంతర మీవివాహబంధముచే మనముకట్టబడితిమి. కానఒకరినొకరు ద్రోహముచేసికొనక, అన్యోన్యప్రేమపాశబద్ధులమై, శీలప్రవర్తులమై, భార్యాభర్తలమగు మనమేకశరీరులమై, సకలకష్టసుఖములం దిరువురుసమానభాగస్థులమై, పుణ్యకర్ములమై స్వర్గసుఖములం దిరువురుసమానముగ సుఖించుదము" అను స్మృతివచనమెరిగి మనుమండెడివారు. కాననే సీతాదికాంతల కరణ్యావాసక్లేశములుకల్గినను ప్రాణకాంతుని పవిత్రప్రేమానురాగస్వాంతులగుటకు, భర్తయుండనుండినఅరణ్యమే గృహవాసము కన్న మిన్నయనిభావించి కష్టములులెక్కగొనక సహించియుండుటకుకారణము. దాంపత్యధర్మమును గుర్తెరిగి మసలినదంపతుల కరణ్యావాసమైనను స్వర్గతుల్యమువలెఁదోచును.

అట్టిమహనీయుల పవిత్రరక్తమునుండి యుద్భవించిన ప్రస్తుతపురుషలోకస్థితి యెట్లున్నదో విమర్శించుఁడు. పాశ్చాత్యనాగరికామోహప్రవాహమునమునిగి వేదశాస్త్రవిధులు విడచిరి. పుణ్యకర్మలు బూడిదపాలైనవి. అచారము లయోగ్యములయ్యెను. మనునిబంధనలు మంటగలిసినవి. పవిత్రత పదటకలిసెను. ఆరోగ్య మంతరించెను. మానము మలినమయ్యెను. ఇతరస్త్రీమాతృభావ మన్యోన్యవిశ్వప్రేమవాహిని ఆయెను. పాపమన్న భయమంతరించెను. దేవుఁడే లేడనునాస్తికత్వమభివృద్ధియాయెను. ముక్తికాంక్షయెుదటికే దూరమయ్యెను. ఇహవాంఛ లధికమాయెను. విషయవృద్ధు లెక్కువాయెను. మానసికశక్తులుక్షీణించెను. మనోదృఢమము సడలెను. భోగమేముఖ్యమనుచింతన బలీయమయ్యెను. చంచలత్వము స్థిరత్వము గాల్చెను. ఏకపత్నీవ్రతమెందునను మందుకైనకానరాదు. అర్థాంగియన్న పేరుకర్థమేలేదు.

ధర్మపత్ని గడ్డిపరకవలె గణనీయము కాకుండెను. పత్నీప్రేమకంటె పరస్త్రీప్రేమయే కాంక్షణీయమయ్యెను. దుష్టబుద్ధు లుత్పన్నములాయెను. సప్తవ్యసనములే సహింపులాయెను. వ్యభిచారమొక దోషముక్రింద చూడబడుటలేదు. అవినీతి అంగీకారమయ్యెను. కష్టనష్టములు, రోగములు పంచుకొనుటకే భార్య అర్థాంగియయ్యెను కాని, పవిత్రభూతములచేతను మంగళాశీర్వాదములచేతను, మంత్రవిధులచేతను, మంగళసూత్రమహిమతో కట్టువడిన ధర్మపత్ని, గృహిణి, అర్థాంగి, యిల్లాలు, మగని ప్రేమామృతసౌఖ్యములు పంచుకొనుటకు మాత్రము నోచలేదు. ఎంగిలిజీవితులై యిహసుఖములకే పాటుబడి, యిల్లాలినేడ్పించువారి కేగతియో శాస్త్రము నిర్ణయించియేయుండినను భగవంతుడిట్టి వారలకనేక దుష్టరోగశిక్షల నీలోకమున ఈజీవితములోనే విధించియున్నను, ఏలకో యీపురుషుల కిది తెలియక అంధులై చరించుచుండు టాశ్చర్యము!

భగవంతుఁడు తనసృష్టిలోని సకలజీవరాసుల నొకేజంటగా (స్త్రీపురుషపరముగ) నేర్పరచియుండుట అవివేకముచేతనా? కాదు. దీనిలో ఆరోగ్యమున కెంతటి అనుకూలమున్నది! అన్యోన్యమున కెంతటి చేరికయున్నది! ప్రజాసృష్టి కెంతటివివేకమున్నది! ప్రేమ నిలుచుటలో నెంతటితావున్నది! ఇట్టిసృష్టిరహస్యములు తృణప్రాయముల క్రింద వర్జించి నూతనసృష్టినియవలంబించు టెంతటి అవివేకము? మనునిబంధనలకే ప్రభుత్వచట్టముపయోగించును? గ్రహింపులేనివారికి ప్రభుత్వశాసనచట్టములే ప్రస్తుతిపురుషుల కుపయోగకరము. ఉంగరపువ్రేలితో మొట్టిననే నొప్పికలుగునుకాని, వట్టివ్రేలితో మొట్టిన నాటదు. ప్రాచీనాచారవిధులునమ్మని మనపాశ్చాత్యనాగరికాముగ్ధులగుపురుషుల కిప్పట్టున ప్రభుత్వశిక్షాచట్టమొకటి యేర్పరచిననేకాని, సద్గృహిణుల సంతాపముచల్లబడదు. భర్తయే దైవమని నమ్మి, సమస్తబాంధవ్రతతినివదలి, పతిప్రేమాకాంక్షినియగు స్త్రీహృదయకుహరమును పగులగొట్టుపురుషుల దుష్ప్రవర్తన కొకశిక్షాచట్ట మావశ్యకమని స్త్రీలోకమామోదమునుఁ గనబర్చగలదని నొక్కిచెప్పగలను. శారదాచట్టమున కాందోళనజరిపి, సఫలీకృతులైన తోడిసోదరలోక మీపురుషశీలగ్రహణమునకై సభలజరిపి, ఆందోళనలసల్పి, "స్త్రీశక్తి మేల్కొనిన, ఎంతటి ఘనకార్యోద్ధరణమైన చేయగలదన్న" ఆర్యవచనముకొనసాగింప నిదేప్రార్థించుచుంటిని. "స్త్రీఅబలకాదు" అన్న శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసముపఠించిన స్త్రీలోకము, తమరుతలఁచిన నెంతటి బలకార్యము లవలీలకొనసాగించుకొనగలరో తెలియుచునేయున్నది. అట్టియెడ పురుషుల శీలము నుద్ధరించుటలో యుల్పత్వముచూపుట సంతాపకరమగును. మూకువంతుల స్త్రీలోకమిట్టి అపవిత్రపతినిరాదరణ విషముగ్రోలుచు, సంఘబలముచే పురుషులనెదిరింపఁజాలక; చింతలచే మానసికశక్తులభివృద్ధినొందఁజాలక, సృష్టివ్యక్తిత్వమున సమానులైయుండియు సగముచచ్చియున్నారు. ఇది తలఁచుకొనిన నారీలోకమున కెంతటి దుఃఖకరము! ఎంపటి దుర్భరము! ఎంతటి అవమాన

కరము! అక్కలారా! ఆలోచించుఁడు. మననెత్తిపై తాండవించు దుష్టపురుషుల నుద్ధరించు సూత్రమాలోచించుఁడు!

ప్రస్తుతలోకమును పాడుచేయుసంఘములుకూడ కొన్ని సవరింపవలెను. అవినీతిని బోధించు గ్రంథములు; నాటకములు; సినిమాలు; పాశ్చాత్య పరస్త్రీచుంబన కరస్పర్శవాహ్యాళికలు మొదలగునవి. భరతవిద్యను వృద్ధిచేయుట కేర్పరుపబడిన కళావంతులగు వేశ్యస్త్రీలు క్రమముగా తముకుద్దేశింపబడినవిద్యను, దుష్టవ్యభిచారవృత్తిలోనికిదింప, గృహిణుల హృదయశల్యములై, సంసారవృక్షముల సమూలముఁగా నాశనమొనరించు వేరుపురుగులై, స్త్రీజాతి కపవిత్రమగు పేరుందెచ్చుట కడుసంతాపకరము.

శ్రీసీతాదేవి పాదదర్శనమే కానిముఖావలోకనమేనెరుగనని ఆమె ఆభరణములానవాలుఁజెప్పు సందర్భమునఁ బల్కినలక్ష్మణుని వాక్యములవలన, మనఆర్యులమనోదృఢిమం దెల్పుచున్నది. పరస్త్రీముఖావలోకనమే పాపహేతువన్న ప్రాచీనుల పాపభయములో మనవారికి పీసమైయున్న యెడల ప్రస్తుతపురుషలోకము బాగుపడుదారి యేర్పడును.

మరియొక ముఖ్యవిషయము. పరదేశ, యంత్రతంత్ర ఔషధప్రకటన లోకఆసరాగా పురుషుల పాడుచేయుచున్నవి. స్త్రీపురుష కలయిక నాటకసంఘములుకూడ శీలభంగకరములే. నేర్పేవిద్య, చూచేచూపు, వినేప్రసంగములు ఇన్నివిధముల దుష్టములగు ఆసరాలచే పురుషుల హృదయము లతిచంచలములై గాలికల్లాడు పత్రమువలె మనోదృఢము లేక, సంపూర్ణజ్ఞానములేక, మిడిమిడి జ్ఞానము గలిగినన్నాళ్లు పురుషశీలము బాగుపడదు.

ఏశీలము స్త్రీలకవసరమని సంఘోద్దేశమో, అట్టిశీలమే పురుషులకుకూడ అవశ్య అనుకరణీయమని విధించవలెను. ఏతప్పు స్త్రీలకుశిక్షాకరమో, ఆతప్పు పురుషులకుకూడ శిక్షాకరమని నిబంధరూపకచట్టమునుపొంది స్త్రీలోకము సఫలీకృతులగుదురుగాకయని ప్రార్థన. ఇందుచే విడాకులచట్టమవసరమని నాతలంపుకాదు. దూష్యప్రవర్తన పురుషునకు కూడ శిక్షవిధించి "వ్యభిచారనిషేధకచట్టమును" స్థాపింప స్త్రీలాందోళనల తప్పకజరుపవలెనని నామనవి.

## శ్రావణమువచ్చె తల్లి!

మునగపాటి చినహనుమయ్యగారు

విలువమించిన మంచివలువమేనధరించి,
  రమణీయమగుఁజట్టిరవికతొడిగి
కురులనుఁదీరుగాఁగూర్చి కీల్జడవేసి
  విరిసరంబుల బరాబరిగఁదురిమి
పసుపునిగ్గులుదేలఁ బాదంబులకుఁబూసి
  కుదురుగా నొసటఁ గుంకుమనుదిద్ది,
పొందుగా సొగసైన భూషణంబులఁదాల్చి
  కరకంఠములకు శ్రీగంధములఁది
భక్తితోడ మంగళశుక్రవారములను
వ్రతమొనర్చి పేరంటంబు వైభవముగఁ
దరుణులనుఁగూడి సలుపఁగాఁదరలవమ్మ!
శ్రావణమువచ్చె తల్లి! హిందూవధూటి!

# కమల

## కొడవటిగంటి కృష్ణమూర్తిగారు

౧

ప్రొద్దున తొమ్మిదిన్నరగంటలయింది. రైలు దిగి ప్రసాదరావు వూళ్ళోకిబండికట్టించాడు. గుఱ్ఱం బండి కావటంచాత చకచకాపోతున్నది. ప్రసాద రావు గారంటే గొప్పధనికుడు. ఒక్కఆడపిల్ల. పేరు కమల. చురుకైనతెలివికలది. మంచిఅందగత్తె. అందగత్తెఅంటే భారత భాగవత రామాయణాదుల్లోని స్త్రీవర్ణన లాఅమ్మాయిదగ్గిరకుదరవు. చూడటానికి ముచ్చటగావుంటుంది. కన్నుముక్కుతీరు బాగుంటుంది. లేడికళ్ళు. పచ్చనిశరీరం. నల్లనివెంట్రుకలు. కమలదగ్గర ఆకర్షణశక్తి అద్భుతంగావుంది. చిన్నప్పుడెవరైనా ఇంటికొచ్చి రెండురోజులుండి కమలకి రెండురూపాయలిచ్చి పోతూండేవారు. పదేళ్ళొచ్చినా తల్లితండ్రీగట్టిగాకౌగిలించుకుని ముద్దుపెట్టుకునేవారు. ఆఅమ్మాయిని ఊరకేచూడబుద్ధవుతుంది.

కమలకు పదకొండోఏట పెళ్ళయింది. భర్తపేరు నరసింహారావు. బి. ఏ. ప్యాసయినాడు. దాదాపు రెండులక్షలఆస్తివుంది. ఆస్తికంతాఒక్కడే. దగ్గిర బంధువులుకూడా ఆట్టేలేరు. పెద్దమేడ. సినిమాల్లో చూపిస్తారుచూడండి—అదేమాస్తరుగా వుంటుంది. చుట్టూపూలమొక్కలూ చెప్పన్నివృక్షాలూవున్నయ్. చూడబహుసొగసుగావుంటుంది.

నరసింహారావుది కొంచెంవెడకట్టైమతం. "ఏమిటోఅని! కాని గర్వంమట్టుకుకాదు. అత్తవారెప్పుడు పిలిచినాపోడు. పోకూడదని ప్రతమూలేదు. మర్యాదలంటే అతనికి మాచెడ్డచిరాకోపం. ఎవరు భోజనానికిపిలిచినా పొయ్యేవాడుకాడు. చుట్టాల్లో భోజనానికిపిలిస్తే, "అరే! ఏంభోజనంరా, నాన్నా! రాకపోతే ఏమనుకోను. నేను భోజనానికి రాకపోయినంతమాత్రాన మీకుచుట్టాన్ని కాకపోలేదు. మీరు భోజనానికిపిలవకపోయినంతమాత్రాన నాకుచుట్టాలుకాకపోలేదు. ఏమనుకోవుకదూ? వస్తేవస్తాను. ఏమిటో! ఆ! ఏమిటోతగనిబద్ధకం. కావాలనిరావడం లేదనిఆనుకోకు"అని చెప్పేవాడు. నరసింహారావు భావంవెలిపుచ్చటానికి తంటాలుపడేవాళ్ళలోఒకడు. ఇవతలవాడికి ధణుతెగిరేటట్టు లెక్చరిస్తేగాని మరి బోధపడదు.

ఆవతలవాడు వీడిసంగతి తెలిసినవాడయినట్టయినా వాడిఅవస్తకు జాలిపడి "సరేలే" అనిపోతాడు. నరసింహారావు స్నేహితుల్లో దాదాపందరూ అతని సంగతి తెలిసినవారే. ఒక్కొక్కప్పుడందరిమీదా కస్సుమనేవాడు. వాళ్ళప్పుడు తగ్గేవాళ్ళు. మర్నాడు మామూలే—ఏరా! అతనికితరులతో కలసిమెలసి తిరగటంచేతకాదు. ఒక్కడేపద్ధతిబాగుంటుందంటాడు. దానికితగినట్టు భగవంతుడుకూడా అట్లాగేచేశాడు.

నరసింహారావుకు పెళ్ళయినాలుగేళ్ళయింది. ఈ నాలుగేళ్ళలో అత్తగారింటికి వెళ్ళనేలేదు. ఏడాది లోపలకామలు పొరపాటున తీసికెళ్ళుతారుచూడండి!—అంతే! పండగాలేదు, పర్వంలేదు. ఆఒక్కసారి తీసికెళ్ళినప్పుడు మామగారూవాళ్ళూ తగని మర్యాదచేశారు. వద్దన్నకొద్దీ బట్టలుపెట్టారు. ఇటువంటివి నరసింహారావుకు తగనిఅసహ్యం. ఈమూణ్ణాళ్ళప్రేమలతనికిష్టంలేదు. ఒకసారి అత్తవారికి అల్లుడిమీద కూతురిద్వారాప్రేమేకాని అసలుప్రేమ వుండదని ఎవరితోనోఅన్నాడు. అది కావలిసినవాళ్ళకి నలుగురికీతెలిసింది. ఆమాటఅన్నందుకు విచారమైనా లేదు నరసింహారావుకు.

అత్తవారెన్నిసార్లుపిలిచినా ఎగ్గొట్టటమే! కావాలని రావటంలేదని అనుకుంటారనన్నా దిగులులేదు. నలుగురూఅనుకునేవాళ్ళు "ఆ! ఇప్పుడుకాదు. పెళ్ళాం వచ్చినతరువాత ఈపోకపోవటాలుతెలుస్తయి. ఆవిడ గారు వస్తేగాని—" అదివిని నరసింహారావు "పోనీలే! అప్పుడుపోతాం. ఏంపోతే? ఇప్పుడు కావాలని పోవటంలేదని ఎందుకనుకుంటావు? మనం మన

పెళ్ళాలకోసం పోతాంగాని ఇంకోదికోసంపోంగా!" అనేవాడు. "అదికాదు. అప్పుడెట్లాగూపోయ్యేవాడి విప్పుడెందుకుపోవు?" అనేవాళ్లు. "అదే తెలివి తక్కువ! అర్థంచేసుకోలేకపోతేసరి!" అని పెంకెగా జవాబిచ్చేవాడు. ఎన్నిసార్లుపోకపోయినా మామగారు పిలవడంమానలేదు. వాళ్ళఓపిక—

౨

గున్నమామిడికిందకూర్చొని నరసింహారావు స్ట్రెప్ జర్నల్ చదువుతున్నాడు. పక్కనరామారావుకూర్చొని నరసింహారావువంక తదేకదృష్టితో చూస్తున్నాడు. అంతకుముందే ఇద్దరికీ కొంచెంవాదన జరిగింది. ఇద్దరూ పదినిమిషాలు కూర్చున్నారు.

"నిన్నుచూస్తేజాలేస్తున్నదిరా నాకు!" అన్నాడు రామారావు ఆకస్మాత్తుగా.

"ఏం?" అన్నాడు నరసింహారావు పేపరుచదువుతూనే.

"ఇట్లాఎంతకాలం ఉంటావు?"

"ఎట్లా?"

"బి. ఏ. ప్యాసయినావ్. ఇరవైయేళ్ళొచ్చినయ్. బ్రతుంభోజనం, మహానిద్రా. కాస్తతలనొప్పిఒస్తే చేసేవాళ్ళు లేరు. నీకు దిగులులేదుట్రా?"

నరసింహారావుకు చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోవటంచేత స్నేహితుల కతన్నిచూస్తేజాలి.

"ఎందుకురా దిగులు?"

"నువ్వుభార్యనెందుకుతెచ్చుకోవు?"

నరసింహారావు మాట్లాడలేదు.

"పెళ్ళాం పెద్దమనిషై ఏడాదయిందికదా, భార్యను తేనుకురావు. అత్తవారింటికెళ్ళవు. మొన్నజ్వరం తేలిగ్గాపోమట్టికాని లేకపోతే ఎంతకష్టమయ్యేది. నీకు పక్కోళ్లోఉన్నట్టింకోచోటుఉండదా?"

నరసింహారావు నిట్టూర్పుపుచ్చాడు.

"ఏమిటోరా. భార్యనుతెచ్చుకోవాలంటే ఎన్ని తక్కులున్నై! మామగారుకార్యంచేసుకోమంటాడు. నాకది ఇష్టంలేదు, ఆయనకీదిష్టంలేదు, ఇట్లాఉంది స్థితి. నేనొక్కణ్ణి"—

నరసింహారావు తదేకదృష్టితో చూడటంప్రారంభించాడు.

ఆకస్మాత్తుగా బయటచప్పుడైంది—పనిమనిషి మాటలతో "దొడ్లోఉన్నారు పో!"

ఇద్దరూఅవైపు చూస్తూకూర్చున్నారు. ఒకభైరాగి వచ్చాడు. సలాంకొట్టి నిలబడ్డాడు.

"ఎవరునీవు?" అన్నాడు నరసింహారావు.

"మాదిదక్షిణాదిఉంది. నేను అరవవాడు! సాధువులుదాచెప్తాను. చెయ్యిచూస్తును. బాగుండే నామీతో చిందిప్పించండిమీ" అన్నాడు.

"ఏంతీసుకుంటావు?" అన్నాడు రామారావు నవ్వుతూ.

"దక్షిణిదా, మీఇష్టం. మాకు కష్టంఉంది."

"సరే, చూడు" అన్నాడు నరసింహారావు. భైరాగి "చూడ్డం" ప్రారంభించాడు. ఏదేదోకూస్తున్నాడు. రామారావు కొంచెమన్నా నిజంఉండకపోతుందాఅని ఊరుకున్నాడు. నరసింహారావు తల తిప్పుతున్నాడు.

"నీవుమంచి అదృష్టవంతుడు!" అన్నాడు భైరాగి.

"ఏం?" అన్నాడు నరసింహారావు.

"చిన్నరోజుల్లో గండంతగులుతుంది! అయితే తప్పిపోవును."

"మావాడిపెళ్ళాం ఎప్పుడు కాపురానికివస్తుందో చెప్పు," అన్నాడు రామారావు.

నరసింహారావు బలహీనంగానవ్వాడు.

"ఓ! అదిదా! కొద్దిరోజుల్లోనే రావలిసిఉంది!" అని ఇంకా ఏదేదో చెప్పిలేచిపోయినాడు భైరాగి.

"టైమెంతయిందిరా?" అన్నాడు నరసింహారావు.

"పదింబావు. పెళ్ళాంవస్తుందికామాను!"

"చాల్లేవోయమ్మ మరి. పద. హోటలుకెళ్ళాలి. ఈజ్యోతిష్కులు చెప్పేమాటలు నిజమైతే ఇండిపెండెన్స్ ఇదివరకేవచ్చేది!"

"మళ్ళీసాయంత్రంవస్తా" నంటూ రామారావు వెళ్ళాడు. నరసింహారావు బయటికి రాగానే వాకిట్లోకి బండివచ్చిఆగింది. మరుక్షణం ప్రసాదరావు దిగాడు.

"ఎప్పుడొచ్చారు?" అన్నాడు నరసింహారావు.

"ఇప్పుడే!" అన్నాడు ప్రసాదరావు బండివాడికి డబ్బులిస్తూ.

"ఏమిటి సంగతు లంతా కులాసా?"

"ఆ! నీవెంట్లో బాగుందా?"

"ఆ!"

"ఎక్కడికి బయలుదేరావు?"

"హోటలుకు."

"అప్పుడే?"

"అప్పుడే ఏముంది. పదయిందా" అన్నాడు? తాళం తీస్తూ నరసింహారావు. ఇద్దరూ మంచంమీద కూర్చున్నారు.

"మళ్ళీ సాయంత్రం వెళ్ళుతాను. నువ్వు నాలుగు రోజులక్కడికి రారాదూ?"

"ఆ! ఏమిటివచ్చేది? దేనికి?"

"ఏమిటేమిటి? ఇక్కడహోటలేగా! రా! మీ అత్త చూడాలనుకుంటున్నది. రొండేళ్ళయిందిట చూసి, ఇప్పుడుశెలవులేగా? నాలుగురోజులుండి పోదువుకాని, నేనిందుకేవచ్చాను. ఇదివరకల్లేకాక ఈత భాకిరా. ఏం?" అని ప్రసాదరావన్నాడు.

"చూడాలనుకుంటే చూడలేకపోతారా? ఏమిటి పెద్దచూసేది?

"కాదులే! నామాటవిను" అని మరిమరిఅడిగాడు.

నరసింహారావు ఈతడవను ఎదురుచెప్పలేక, "సరే లెండి! సాయంత్రమా?" అన్నాడు.

"ఆ! నాలుగ్గంటలబండికి."

3

"ఎప్పుడురావటం?"

"ఇప్పుడే."

"అంతా కులాసా?"

"ఆ!...అంతా ఎవరున్నారు?"

"కాళ్ళుకడుక్కోండి" అని ఇంకా ఏవేవో మాట్లాడి అత్తగారు లోపలికెళ్ళింది. నరసింహారావు కాళ్ళుకడుక్కున్నాడు. నరసింహారావత్తగారింటికి వెళ్ళయిన తరువాత ఇదే రావడం. అందువల్ల అక్కడక్కడ కలిగినమార్పులు ముందతనికెదురొక్కన్నాయి. పంపాకటి పెట్టించారు కొత్తగా. డాబా కాస్తా మేడ యింది. నరసింహారావు దబదబా మేడమీదికి వెళ్ళాడు విపరీతంగా ఎరిగున్నట్టు. సూర్యాస్తమయమై పావు గంటయింది. నరసింహారావు పెట్టె ఒక గదిలో పెట్టాడు. ఆగదిలో సామానించుమించుగా ఏమీ లేదు. డాబామీదికెళ్ళాడు. చుట్టూ చెట్లు కనపడు తున్నాయి. కంటికి బహుఅందంగాఉంది. ఏటిగాలి కతనిప్రాణం లేచిపోతున్నది. అకాస్మాత్తుగా కమల జ్ఞాపకంవచ్చింది. కమల! కమలఏది? ఎక్కడా కనపడ లేదు. నాలుగేళ్ళయింది చూచి! ఈనాలుగేళ్ళమధ్య చూడటానికవకాశంకలిగినా అతనే పోగొట్టు కున్నాడు. ఇప్పుడు బాగా ఎదిగుంటుంది. కమలను నరసింహారావు కోరికోరిచేసుకున్నాడు. అతనికి కొన్నిపందల సంబంధాలువచ్చినయి. ప్రతిపిల్లను చూడ్డం పెదవివిరచటం కమలకన్న అందమైనపిల్లలను చూచినాడు. కాని అతనికి కావలిసిన చురుకుదనం వాళ్ళవరిదగ్గిరా కనపళ్ళేదు. ఎన్నిసంబంధాలుచూసినా కుదరలేదు. ప్రాణంవిసిగిపోయింది. "ఇదేంవిడ్డూరమమ్మా? కావలిసినవన్నీ ఎక్కడదొరుకుతవి?" అనే వాళ్ళు నలుగురూ. విసిగి నరసింహారావు కన్యాన్వేషణ మానేశాడు. తాను కావలసినపిల్ల ఈలోకంలోలేదు కాబోలునని దిగులుపడ్డాడు. చివరకి కమల లభించింది. పెళ్ళిలోసంగతి జ్ఞాపకంవచ్చింది. మేజువాణీలో కమలకు నిలువునాబొట్టు పెట్టాడు. కమల నరసింహారావుకు చుక్క పెట్టింది—నరసింహారావుకు నవ్వు వచ్చింది.

కాని అకస్మాత్తుగా ఒకభయంకరమైన ఆలోచన వచ్చింది. కమలకతన్ను చూస్తే ఇష్టంలేదేమో? తాను ఎప్పుడూ రాకపోవటంచేత తనమీద ఇష్టంలేదని కమలకుమనస్సు విరిగిపోయిందేమో? నరసింహారావుకుమనస్సుమనస్సులో లేదు. మనస్సెట్లాగో మళ్ళించుకుని కూనిరాగాలుతియ్యటం మొదలుపెట్టాడు. కొంచెంచీకటిపడ్డది. నరసింహారావు లేచినిలుచుని ఎర్రని చంద్రుణ్ణి చూస్తున్నాడు. కమ్మని పూలవాసనవస్తు

న్నది. చంద్రుడు కొంచెం కొంచెంగా తెల్లబడుతున్నాడు. చీకటికీ చంద్రుడికీ యుద్ధం ప్రారంభమయింది. చీకటి ముందంజవేసింది. అప్పుడు చంద్రుడు, "ఇవ్వాళ కాదులే! రేపటినించీ నువ్వేముందరపడ్డాగాని" అంటున్నాడు. చీకటికాదన్నట్టుగా తలఊపడం ప్రారంభించింది. చంద్రుడు కొంచెం కసరాడు. చివరకు చీకటి పుంజాలు తెంపుకు పరిగెత్తుకు పోయింది.

ఇట్లా ఒకపావుగంట గడిచింది. మామగారు పైకి వచ్చి స్నానంచెయ్యమన్నాడు. నరసింహారావు భోంచేసి గదిదగ్గిరికిరాగానే కమల ఆగదిలోనించి పరిగెత్తుకునిపోయింది. నరసింహారావు గదిలోకిపోయి బట్టలుకట్టుకుంటూండగా బల్లమీద తములపాకుల చిలకలు కనపడ్డాయి. పక్కన వక్కపొడికూడా ఉంది. నరసింహారావమాంతంగా వాటిని నోట్లో కుక్కుకున్నాడు.

౪

తెల్లవారింది. నరసింహారావు కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి పుస్తకంచదువుకుంటూ కూర్చున్నాడు. అయిదు నిమిషాలు చదివాడు. ఏమీసాగలేదు. పుస్తకంమడిచి బయటికివచ్చాడు. కమలకనపడ్డది. ఇతన్నిచూసి ఆగింది. ఇతను కేవలం ఆమెవెళ్ళే దోవలోనే ఉండడంచేత ఆగవలిసివచ్చింది. తలవంచుకుని నిలబడ్డది. కమల కొంచెంమారింది. పెద్దదయింది కూడానుమరి. నరసింహారావు మాట్లాడకుండా ఒకనిమిషం నిలుచున్నాడు కమలనుచూస్తూ. కింద అత్తగారు కమలను ఊరికేపిలుస్తున్నది. కమల కొంచెం తలఎత్తి చిరునవ్వుతో నరసింహారావు వంక చూచింది "మీరే ఇట్లాచేస్తే ఎట్లాగండీ" అన్నట్టు. నరసింహారావు గదిలోకి వెళ్ళివాడు. ఎడమకన్నదరడం ప్రారంభించింది. అతనికి పిచ్చినమ్మకాలులేవు. కుడికన్నదరితే అదృష్టమున్నూ, ఎడమకన్నదరితే పత్యమునూఅని అతనిఉద్దేశం.

ఏడుగంటలయింది. వెండిగిన్నెలో కాఫీ, పళ్ళెంలో ఉప్మాపట్టుకుని మామగారు ప్రవేశించాడు.

నరసింహారావుదృష్టి కాఫీమీదలేదు. కిటికీలోనించి బయటికిచూస్తున్నాడు. మామగారు కాఫీ ఉప్మాలు అక్కడఉంచి వెళ్ళిపోయినాడు. కాఫీ చల్లారిపోతున్నది. అతను కాఫీవంకకు తిరిగాడు. కమల తలవంచుకుని నిలబడిఉన్నది. నరసింహారావు కమలవైపుతిరగ్గానే ఆమెబొటనవ్రేలితో నేలను రాయటం మొదలుపెట్టింది.

"ఏమిటిది?" అన్నాడు నరసింహారావు.

కమలమెల్లిగా తలఎత్తింది. కళ్ళల్లో ఇందాకటి కాంతిలేదు. మెల్లిగాతలవంచింది. నరసింహారావు ఆశ్చర్యపడ్డాడు. లేచి కమలదగ్గిరికివెళ్ళి వణుకుతూ ఉన్న ఆమెచేతినిపట్టుకుని ఆమె ముఖాన్ని తనవైపుకు తిప్పుకున్నాడు.

"ఏమిటిది?"

కమల మళ్ళీ తలవంచింది.

"చెప్పవ్?"

"కాఫీతాగారా?" అంది తలఎత్తకుండానే.

"తాగలేదు. దేనికి?"

"తాగవద్దు!"

"ఏం?"

కమల మాట్లాడలేదు.

"ఎందుచేత?"

"అది బాగుండదు!"

"ఎందుకని?"

"అందులో సీకాయపొడి కలిపింది మాఅమ్మ!".

నరసింహారావు కర్థంకాలేదు. కాస్సేపుండి నవ్వాడు.

"సీకాయపొడి కలిపితే రుచిఎక్కువవుతుంది."

"అదిసీ—సీకాయపొడికాదు. మరేమిటో! ఏదో పొడి కలిపింది."

"ఏంపొడి?"

"ఏదో నాకు తెలియదు."

"అయితే తాగితేఏం?"

"వద్దు! కాఫీబాగుండదు!"

నరసింహారావుకు ఒకభయంకరమైన ఆలోచన తట్టింది. పెదిమకొరుకుతూ రెండునిమిషాలాలోచించాడు.

# సింహాచల చందనయాత్ర దృశ్యములు

సుప్రసిద్ధాంధ్ర పుణ్యక్షేత్రములలో సింహాచలమొకటి. ఇచ్చటి స్వామి శ్రీనరసింహస్వామి. ఈ క్షేత్రము విశాఖపట్టణమునకు ఆరేడు మైళ్ళదూరముననున్నది. సింహాచలము రైలుస్టేషను. అయిదారు వందల మెట్లెక్కినగాని గుడి చేరనేరరు. కొండపైన యాత్రికుల సౌకర్యములన్నిటిని సమకూర్చుట కొక విశ్రామభవనము చిన్న విపణియుగలవు. పుష్పవనములు, ఫలవృక్షములు మెండు. జలయంత్రములనుండి నీరు తేబడి గొట్టములద్వారా ధారలుగా ప్రవహింపజేయబడుట క్షేత్రోత్సవముగానుండును.



కొండపైనుండి అగుపడు దృశ్యము



కొండపైకి పోవుట

ఈక్షేత్రమునందు జరుగు నుత్సవములలోనెల్ల చందనయాత్ర ముఖ్యమైనది. ఈయుత్సవము వైశాఖశుద్ధతదియనాడు జరుగును. నాడు పూజారులు నరసింహుని దేహమందు సంవత్సరమంతయు నిత్యము పూయబడుచుండు చందనమునొలిచి యాత్రికుల కాభక్త మనోరథుని నిజరూపము దర్శనము చేయించి మరల చందనము పూయుదురు. ఆచందనమును ప్రతివారును కొంచముకొంచముగా గైకొని తమతమ యూళ్లకుగొనిపోయి ప్రతిదినము పూసుకొనుచుందురు. దీనికే చందనయాత్రఅని పేరు.



కొండధారనుండి



గుడిమెట్లచెంత

ఛాయాచిత్రగ్రాహకులు—డి. వేంకటరావుగారు, పార్వతీపురము.

"ఆకలిసిందే మైఊంటుంది?" అన్నాడు కమల పీపురెట్టుతూ.

"నాకు తెలియదు."

"ఏమన్నా-అనుమానమా-మందా-?" కమల మెల్లిగా తలఎత్తిచూచింది. ఆచూపులో ఏమీలేదు. నరసింహారావు కమలను మెల్లిగా కౌగిలించుకున్నాడు. కాస్సేపుండి నవ్వుతూ—"నీకెట్లా తెలుసు?"

"నేనుచూచా!"

"ఎప్పుడు?"

ఇందాకా నేను కనపడకపోతే ఎక్కడున్నానో అని నాలుగుసార్లు పిలిచింది. నేను పలకలేదు.—"

"అప్పుడెక్కడున్నావు?"

కమల నవ్వింది.

నరసింహారావు కమల చెక్కిళ్ళునొక్కుతూ "తర వాత" అన్నాడు.

"నేను లేననుకుని ధైర్యంతో కలపటం ప్రారంభించింది.—"

"ఏమిటి?"

"పొడి!"

నరసింహారావు కమలను గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

"నేను కిందికి కొచ్చేటప్పటికి కలుపుతున్నది."

"అది సీకాయపొడికాదని నీకెట్లా తెలుసు?"

"సీకాయపొడి ముందరే డికాక్షనులో కలుపుతారు. తయారైనకాఫీలో కలపరు!"

"అట్లాగా? నాకు తెలీదులే!"

కమల మెల్లిగానవ్వటం మొదలుపెట్టింది నరసింహారావువంక చూస్తూ. నరసింహారావూ నవ్వటం మొదలుపెట్టాడు. కాని అనవ్వు ఒక్కక్షణంమాత్రమే. మరుక్షణం అతనిముఖం గంభీరంగాఉంది. అయిదునిమిషాలు ఆలోచించాడు.

"నేను ఊరికెళ్ళుతున్నా!"

"ఎప్పుడు?"

"ఈబండికే."

"దేనికి?"

"నీకు తెలియదూ?"

"రెండురోజులుండండి." కమల కళ్ళల్లో ఇష్టం లేదు.

"ఎందుకు? చావటానికా?"

కమల తలవంచింది. కళ్ళవెంబడి నీళ్ళువచ్చినై. నరసింహారావు కమల తలఎత్తి నీళ్ళుతుడిచాడు.

"నీఅదృష్టం. మంచిమొగుణ్ణి సంపాదించుకున్నావు. నాతో రావూ?"

"మాఅమ్మావాళ్ళు పోనివ్వరూ?"

"సరే. నీయిష్టం."

"రెండురోజులుండండి!" కమలనవ్వింది.

"సరేలే, లే! పెట్టెసర్దుకో, బండితెస్తా."

"మానాన్నకేదేమీ తెలియదు, ఆయన తగనిమంచివాడు. మాఅమ్మ—మానాన్న పడగరూ?"

"అడుగుతాను. ఒప్పుకుంటేవస్తావు. ఒప్పుకోకపోతే?"

"వస్తాను."

"చేతులో చెయ్యివెయ్యి."

కమలనవ్వుతూ వేసింది.

"గిల్లాలి."

♦ ♦ ♦

నరసింహారావు బండితెచ్చేసరికి ఎక్కడికో వెళ్ళిన మామగారువచ్చాడు. కమల పెట్టె సర్దుకుంది. నరసింహారావు కాఫీ సంగతిచెప్పక కమలను తీసికెళ్ళుతానని పట్టుదలపట్టాడు. మామగారు గాభరాతిన్నాడు. ఆయనకేమీ అర్థంకాలేదు అల్లుడిలోనిమార్పు. బతిమాలాడు. నలుగురూవింటే బాగుండదన్నాడు. నరసింహారావు వినలేదు. అత్తగారేదో చెప్పవచ్చింది. నరసింహారావు ఆమెవేపు తీక్షణంగా చూచాడు. అంతే. ఆవిడమాట్లాడలేదు.

కమల తండ్రివంక దీనంగా చూస్తూ బండిఎక్కింది. కళ్ళవెంబడి నీళ్ళొచ్చినై. బలవంతాన ఆపుకుంది. బండి గబగబా స్టేషనుకు వెళ్ళింది.

ప్రసాదరావుకు వళ్ళంతా కారంరాచినట్టుంది. నిశ్చేష్టుడైపోయినాడు. వళ్ళంతాచెమట పట్టింది. గబగబా మేడమీదికెళ్ళాడు. ఏమీతోచలేదు. నరసింహారావు గదిలోకివెళ్ళాడు. ఉప్మాకాస్తా అమాంతంగాతిని కాఫీతాగటం మొదలుపెట్టాడు.

# శోకమూర్తి

కొమఱ్ఱాజు వినాయకరావుగారు

అగు రతీసదృశాంగి, యాయనాథ!
కదలు నేనాడునామె నాకండ్లయెదుట;
అనుదినమ్మును దిగిపోవునామెమోము
జాబిలి, స్మరింప నాయెదజల్లుమనును!
ఆ—నవవయస్వినీవదనాబ్జమేదొ
శాశ్వతవిషాదభావరసంబుగురియు!
ఆ—యనాథబాలామణి యప్పుడపుడు
చాటుచాటుగ పయ్యెదమాటునందు
కంటతడిబెట్టు; నేలకో కలతజెందు!
ఇంపుకనుదమ్ము లేప్పుచో కెంపులగును.
ఆమెగురియించు నొక్కొక్క యశ్రుకణము
చెప్పకేజూపు మృదుహృదిజించువ్రణము!
ఆమెకన్నీటిబొట్లలో నవతరించు
నేమొ?—తానవలచు హృదయేశురూపు?
లేక కాబోలు నాయమ శోకమూర్తి
నిరుపమామూల్యప్రణయవినిర్మలాశ్రు
మౌక్తికామాలికాశ్రేణి భక్తిగుచ్చి
హృదయనాథున కర్పించు హృదయమునవె?
లేక కాబోలు శోకించు లేమ, లేత
వయసునమృతినొందిన బాలభర్తగూర్చి?
ఆమెదుఃఖించునెట్లు యాయాత్మకొరకు?
పాప మామెకుపెండ్లాయె బాల్యముననె!
బాలభర్తయుగతియించె బాల్యముననె;
భర్తనెరుగని యాబాల బాల్యముననె
విధవగామారెనట యౌర! విధివశాన!
తాటియాకులబొమ్మల తాల్మిఁజేసి
బొమ్మపెండ్లిండ్ల వియ్యాలుబొందునాస
కలిగియుండు నమాయకకాలమందు
చేసినారామెపెండ్లి విచిత్రవృత్తి!
ఆమె దుఃఖించునెట్లు యాయాత్మకొరకు?
లేక కాబోలు నాయమ శోకమూర్తి

వగలబొగులుట భావిజీవనముతలచి?
భావిజీవితమానొ? యూహాతిలోక
నాపథాన నాయమకు, వినాశభయద
కాలగర్భితానంతప్రగాఢశాంతి!
లేక కాబోలు నాయమ శోకమూర్తి
సతము దుఃఖాశ్రువాహినీస్నాతయాట,
తనకువచ్చినదురవస్థ తలచితలచి?
ఆమెచేడ్పాటుజూతు రే రడ్డుపడరు;
పాపమంచని నొకమారు పలుకబోరు;
పిలువ రాబాలపేరంటములకు నూర;
బాలసఖులైన సఖియకై జాలికొనరు!
ముగ్ధయెదురైన శంకించి మూఢమతులు
"ప్రాప్తమైనావె ప్రొద్దునే పాపి!" యనుచు
ములుకులై నాటుమాటలు పలుకుచుంద్రు
మంచిపలువలుకట్టిన మసగనీరు!
తొడవులేమైన తొడిగినతోసగొడవ!
తప్పునిలుచున్న, కూర్చున్నయొప్పుగాదు;
అదియునిదియేల విధవకు నన్నితప్పు!
వింటిరే మీర లీవింత? విభుడుచావ
ప్రాణియౌకాంత జీవచ్ఛవసదృశంబె!
శుభ్రభూషణవస్త్రాదిశుభచయంబు
తొడుగనీకున్న నేమాయె? తొడవులేల
సహజసంకల్పసౌందర్యసారమునకు?
ఆమెలావణ్యరమ్యదివ్యాంగరుచులు
మలినజీర్ణాంబరాళిలో మరుగుపడవు;
మరుగుపడునేమి మెరుములు మబ్బులందు!

* * *

అగు రతీసతీసదృశాంగి ఆయనాథ!
కదలు నేనాడు నామె నాకండ్లయెదుట;
అనుదినమ్మును దిగిపోవు నామెమోము
జాబిలి, స్మరింప నాయెద జల్లుమనును!

# దాంపత్యం

క శ్రీ సూర్యనారాయణ రెడ్డిగారు

౧

'నువ్వేం మొగుట్ట. నేను పెళ్ళాంట. వంటచేసు కుంటాంట. ఏం?'

'ఊఁ'

'నువ్వు బజారుకెళ్తావుట, కూరటా, నెయ్యా, పెరుగూ పట్టుకొస్తావుట.'

'ఊఁ.'

'వెళ్ళుమరీ. తరవాత నువ్వు ఆఫీసుకెళ్ళాలి కాదూ? టయిమవదూ?...'

'ఇవ్వోతెచ్చేను...అదేంటీ? పొయిమంటెట్టంలే దేం? అన్నం ఎలాఅవుతుందీ?'

'అబ్బ. అలాఅయితే నేనాట్టం లేదు బాబూ, మండుతూంది అనాలి.'

'ఊఁ. మండుతూంది'

'కూరొచ్చ, వడ్డిస్తా!'

'ఊఁ.'

'ఇవ్వేం మంచీళ్ళు...ఇదేంపప్పు!'

'ఛీ ఛీ, అదేంటి మన్ను!'

'అలాఅయితే చూడూ—!'

'పప్పేం మాంచిబాగుంది?'

'అన్నం...కలుపుకో?'

'నెయ్యేదీ?'

'ఇదుగో...ఇదేం పులుసు. ఇదేంచారు. ఇవ్వేం గారెలు. బొబ్బట్లుకావాలా?'

'ఓస్!'

'అబ్బ!'

'అదేంటీ అందులో?'

'పెరుగు'

'నువ్వుతినవూ అన్నం?'

'నేనూతింటా...మావాళ్ళేం అన్నంతిన్నాక ఆఫీసుకెళతాడు. అప్పుడేం అమ్మ తమలపాకులకి మున్నంరాచిస్తుంది.'

'మాఅమ్మా రాచిస్తుందీ!'

'అప్పుడేం నాన్న అమ్మగడ్డం పట్టుకుంటాడు.'

... ... ...

'ఏవిఁటర్రా పిల్లలూ!'

౨

'సరళా! ఇప్పటికొచ్చేవా? ఇలాఆలస్యంచేస్తే ఎలా చెప్పూ?'

'ఫలాహారంఅయ్యాదాకా ఉండి పట్టుకొచ్చేనండీ. దశరాకివచ్చేవారుకాదూ? పోనివ్వండి. జ్ఞాపకం వచ్చేంకాదూ ఇప్పటికేనా? వీదాళ్లని ఎప్పటికేనా మరవకండేం?'

'చూడూ. ఎంతప్రయత్నంచేశేను రావాలని! వీలయిందికాదు. నిన్నొదిలిపెట్టి ఒకక్షణమేనా—'

'...కాఫీచాల్లారుతోంది ... అవిపుచ్చుకోరూ?. అమ్మో, ఎంతచిక్కిపోయేరు! చదివేస్తున్నారేం బాగా?'

'అబ్బే అట్టే—?'

'తినరూ? వదలిపెట్టకండే ఒట్టు. సాంతం తినెయ్యాలి...అబ్బ! మీరు తిందురూ!'

'అలాకాదు—'

'...ఒక్కమాట అడగనాండీ? నిజంచెబుతారూ?'

'ఏవిఁటి?'

'చెన్నపట్నంవెళ్ళేక జ్ఞాపకంవస్తానండీ ఎప్పుడేనా? చెప్పరూ?'

'నీదివ్య మంగళవిగ్రహం—'

'ఓస్!...చెన్నపట్నం తీసుకెళుతున్నారు కాదూ?'

'పరీక్షలయ్యేక తప్పకుండా—'

'అన్నీఇలాగే...కాఫీ...అబ్బ, ఏవిఁటండీ. కాఫీ అంతా వొలికిపోతోంది.'

'ఒట్టు...సరళా,...నేనొప్పుకోను.'

'...యాఁవండీ. మరిచిపోయేరుకాదూ?'

'ఏవిఁటి.'

'చూశేరూ? నేను రాశేనా?'

'అద్దా! ...అక్కడే...అపట్టికింద...అటు కాదు. కుడివైపుని.'

'ఎంతబాగుంది! ఎలాకొన్నారు. చెప్పరూ?'

'పెట్టుకో...అల్లాగ. సరళా చూడూ. ఒక్క మారు—...'

'అమ్మాయ్, సరళా!'

'ఓయ్, వస్తున్నా. అమ్మపిలుస్తోందండీ. ...ఉండరూ...మళ్ళీవస్తానుకాదూ?'

'ఒట్టు.'

3

'రాణీగారికి తమలపాకులకి సున్నం రాచిపెట్టడానికి ఇంకాతీర లేదుకాబోలు!'

'తీరికూడున్నారుగా మీరూ! ఓ చెంప ఇల్లుకడుగుతుంటేనా. కాస్సేపు ఓపికపట్టలేరేం పాపం?'

'ఏంకడగడం నా మొహంకడగడం? ఎప్పుడూ కడగడమే! ఆకులకి సున్నంరాచి పెట్టేలోపునే మించిపోతుందేం పని?'

'ఎందుకుమించిపోతుందీ తీరిగ్గాకూచుని కబుర్లు చెబుతుంటే? కాస్తపోకాచెక్క తెచ్చుకుంటే అరిగిపోతారాబాబూ? చేసేవాళ్ళపైని కొంచెమేనా అభిమానముండాలి...ఎందుకూ, ఆడపుట్టకపుట్టాలి. పుడితే ఇలా వేపుకు తింటారా ఏం? మీమల్లేకనలేదూ మాఅమ్మనన్ను.'

'ఇఖనేం. అయినదానికీ కానిదానికీ అనవసర గ్రంథం నడిపించడం. పైగాఏమేనాఅంటేకోపాలూ! అందరూ మనమల్లే—'

'ఎందుకంటారూ? కోరితెచ్చి పెట్టుకున్నదేగా మీరూ? మీఅమ్మగారికి ఇష్టంలేదుటగా నన్ను చేసుకోడం. అలింగరాజాగారి అమ్మాయినే చేసుకోలేకపోయేరూ? సుఖపడేవారు పాపం!'

'ఇదుగో, మళ్ళీ—'

'పైగా రోషమారా... నిమ్మళించిందాండీ ప్రాణం?'

'ఈ భాగ్యానికి అప్పుడే తెచ్చిపెడితేపోవునా? చూడూ ఇల్లారా.'

'ఏవిఁటండీ ఊక్షే. పిర్గులేకపోతేసరి.'

౪

'ఏమే...ఓయ్...ఒసే.'

'యాఁవండీ!'

'మాట.'

'ఎందుకండీ?'

'ఏవిఁటే పిలుస్తుంటే, ఇంకాకాలేదా ఏం?'

'ఆ. అవుతుంది. అయినవాళ్ళనీ కానివాళ్ళనీ కొంపలోతెచ్చిపెడుతుంటే. రోజ స్తమానంచేస్తుంటినాయను. తెగితేనా దిక్కుమాలినచాకిరీ!'

'అయితే ఎవరేనా ఇంటికొస్తే—'

'మీకేం? చేసేవాళ్ళదుంపతెగుతూంది-ఆవిడగారికి తలనొప్పిట. అపసోపాలుపడుతూ కుర్భరంగా పడక వేసింది. ఇఖఆవిడకి ఉపచారాలాయను-పిల్లకాడినుంచి పెద్దలదాకా బంతులుతీర్చాలినుండె. ఎప్పటికి తెములుతుందీ?'

'ఏమిటేకూక్షే. ఎందుకొచ్చినసొద. అవతలవాళ్ళు-దీనికేమిటి. అసలుసంగతి—'

'ఏవిఁటి?'

'అమ్మాయిమాట.'

'అమ్మాయిమాటేమిటి?'

'అమ్మాయి మాటేమిటంటావేం? ఈడువచ్చిన పిల్లని ఇంట్లోపెట్టుకునీ. పురుషోత్తం రాశేడు. దీక్షితులుగారి రెండోకొడుకుట. చెన్నపట్నంలో ప్లీడరీచదువుతున్నాట్ట. కొద్దోగొప్పో భూమీపుట్రాకుంది. మాఘమాసంలో చేద్దామనుకున్నాను. ఏం?'

'అడగక్కర్లేదు. మంచిసమ్మంధం వదిలేరే?

'పెద్దకోడల్ని సుఖపెడుతున్నారు గనక నా సుఖ మీవి డని—'

'అయిందీ, పెట్టేవూ పెటకం!'

'ఎందుకూ, నా కేంపట్టింది మధ్యని?—మొన్న మానుల్ప్యులు పెళ్ళికి వెళ్ళేనా, ఎంత బాగా జరిగింది! చక్కని సమ్మంగనం. ఎంత పరువూ, ఎంత మర్యాదా, ఎంతో ఇది గా జరిగింది. ఇంతకీ అదృష్టం ఉండాలి!'

'ఆఁ.'

'అవును మరీ, అదృష్టంగాకపోతే మరేవిఁటి?'

'లేనూ చేస్తున్నాను కాపరం. ఆఖరికి ఒక్క అంచుచీరె—'

'పాపం. నేను కొని పెడుతున్నా నా, నువ్వు కట్టుకుంటున్నావా! ఎప్పుడే నా చీరెల మొహం చూశేవూ?'

'చాల్లేదురూ'

'ఓయ్, మాట.'

'అబ్బ!'

✻

'ఏమేవ్ ... రామరామ ... పిలుస్తుంటే పలకవూ!'

'ఓయ్, వస్తున్నా.'

'వస్తావు. కొల్లాయిగుడ్డ ఎక్కడ తగలపెట్టేవు?'

'తగలపెట్టడమూ, మంట పెట్టడమూను...ఇదుగో నండీ.'

'రామరామ...ఎంత లక్షణంగానో ఉంది, అంటుగట్టుకుపోయి...చెబితే నే!'

... ...

'గంధాక్షింతలు తీశేవూ?'

'పొయిమీద బోకె పొయిమీదే మండిపోతుం దెను! ఎలాంటి మనిషనూ?'

'ఓసి నీ ఇల్లు—ఊఁ—తప్పుతుందీ! నానా చికాకూ—'

'అవుగో, అక్కడే పెట్టేనండీ—'

'ఎక్కడ? నా ఖర్మం కళ్ళుకనపడవ్, కొట్టుకో నావరి!'

'ఆస్తంభందగ్గిర వా—'

'ఎక్కడ?'

'ఆస్తంభం దగ్గిరండీ!'

'ఊఁ... స్వేతవరాహకల్పే. వైవస్వతమన్వంతరే. ఓయ్, అబ్బాయి స్నానం చేశేట్టే?'

'లేదుగావుల్ను...అబ్బ. పీంకట్లు పదవకట్లు. ప్రాణంతిసేస్తున్నవి.'

'ఏవిఁటీ!'

'మీమాట గాదండీ—'

'సరే...ఊఁ...పూలు, దీపారాధనా.'

'.........'

'ఓయ్, పూలూ. దీపారాధనా!'

'వింటున్నానండీ, పొయిలో గరిటె—'

'రామరామ...అన్నీ నా ప్రాణాని కేవచ్చేయి... ఓయ్...మరీ లక్ష్యం లేకుండా పోతోంది రోజురోజుకూ...'

'అబ్బ. మరీని వేపుకు తింటున్నారండీ మనుష్యల్ని...'

'నమ-స్తే-మా-యచ, రు-ద్రాయచ, నమ-శ్శంభ-వేచ...తా కేపోయ్, వెధవాయ్, బొత్తిగా భయభక్తులు...పూలూ! రామరామ.'

'రామరామ, శివశివ. ఇవుగో...తగలబడిపోయింది గరిటె—'

'పద్మనాభా—యనమః—ఓం...కషాయం పెట్టేవుటే? ఆనందభైరవీ, కాస్తవాతరాక్షసమూ...'

'ఎందుకూ కషాయాలు, కన్నవన్నీ తింటూ పైగా?'

'నైవేద్యం...ఏమేవ్.'

'...ఎప్పటికీ మిట్టమధ్యాన్నమే ఖర్మం. వడ్డించ నాండీ?'

'మాధ్యాన్నికం కాలేదండీ, ఇంకానూ.'

# చెట్లకథ

అధికార్ల సూర్యనారాయణ రావుగారు బి. ఏ; బి. యల్.

భూదేవిమాతల్లి భూజములమేము,
వాసంతసుందరము వరియించినాము;
మనములనమలమూ ననురాగముంచి
చిగురుముస్తాబుల చెల్వంబునించి
వలపుబూవులతోడ చెలికానినెంచి
పండుసంతానాలు బడయుచుంటాము.
చాలకాలంబయ్యె జన్మాలనొంది
మున్ను జరిగినదెల్ల కన్నవారలము;
సౌఖ్యంపురసిననాడు సంతసించేము,
కన్నీళ్లువిడిచేము కష్టాలనాడు.
మోదఖేదములిచ్చు పూర్వవాసనల
స్మృతికిదెచ్చుచుతేనె చిప్పిలుచుండ
మధులబరవశమొంది మాచరిత్రములు
వేడుకతోడుత బాడించుకొనుచు
పులుగుల కేనాడు నెలవులిస్తాము.
నగలంచు మాలేతచిగురులందాల్చి,
ముదముతో మాయాకు పొందికల్గాంచి,
మాపూలమధురసూ మకరందమాని,
మాచాటు నీడేరి, మాచెంతవలచి,
సోదరీభావంబు చూపించి మమ్ము
ఎనలేనిగారాబమున కౌగలించి,
సెలవీయు కేయని పలుమారుపల్కి,
వెన్కవెన్కకుచూచి విడనాడలేక
పతిగృహంబునకేగు సతి శకుంతలను
చల్లనినీడల సాగనంపితిమి.
మందంబుగావీచు మలయానిలమున
మాయాకులాడంగ మదినాసపడుచు
గోవిందుడుండెనని గొమ్మలజూచి
లేకపోవుటెరింగి శోకంబుతోడ
దిశలగాంచుచు నతిదీనముగనున్న
సఖియలదశకెంతో జాలిపడి మేము
చూపనెంచెడువేళ సుందరాంగుండు
వలదనికన్నులు గిలిపినంతటనె
యేమియు నెరుగని మోములతోడ
నిలచిమానినుల బాధలుచూచినాము.
మాచిన్నియాకులమాటున డాగి
కోయిలహాయిగా కూయుటాలించి
వేణుగానరవంబు విన్నట్లుభ్రమసి
యువతులు తడబడ నదరిపడి పైకి
తిలకించి గోపాలతిలకుగనలేక
"ప్రాణనాథా!"యని పలుమారుపిలిచి
చక్కనికృష్ణునిజాడ తెల్పినచో
వడిగవసంతోత్సవము జేతుమంచు
మమ్ముబ్రతిమాలి వేసారు ముద్దాడె
రాధ మున్గాఢానురాగంబుతోడ.
శ్రీరామునెడబాసి చిన్నిసీతమ్మ
క్రూరరాక్షసవధూకోలాహలముల
మానసమువియ్యంగ బ్రాణనాయకుని
కలవరించుచుమేన జెలువంబుదక్క
లంకేశువాక్యంబులకు నుల్కిపడుచు
పంజరంబునచిక్కు పక్షివలెనుండ
చూడలేకామెకు తోడుకానెంచి
శాఖలలోదాచి సమయంబువేచి
ఆంజనేయునిజూపి ఆనందమిచ్చి
సాయశక్తుల మేము సాయపడినాము.
పలుబాధలొంది దంపతులుశ్రమజెంద
నాకులల్లాడించి జోకొట్టుచుండ
నలుడు మెల్లనలేచి చెలికోకజించి
పిట్టపిడుగున నొంటివిడనాడి యేగ
కొంతవడిమేల్కాంచి కాంతుగనలేక
బెడదలునెమ్మది నుడుకుచుండంగ
చెలువుడేగినజాడ తెలుపుడనివేడ

మాటాడజాలక మగువతోగూడ
విపినవీథులలోన వెదకివేసారి
సార్థవాహులతోడ సతిసంపినాము.

పుడమిఱేనితలవరుల్ నడుకానలోన
యమభటులట్టులు గుమికూడికొంచు
ప్రాణవిచ్ఛేదకృపాణముల్ బూని
చక్కనిబాలుని సారంగధరుని
కాలుసేతులుబట్టి ఖండించువేళ
రాజేంద్రుగాని చిత్రాంగినిగాని
దూరక దీనుడై 'హా రామ!' యనుచు
భూరజంబునబ్రుంగి పొరలాడునతని
యార్తరవంబుల నాకులురాల
బాధచూడగలేక వాడిపోయేము.

సత్యహరిశ్చంద్రసార్వభౌముండు
కాటికాపరియౌచు గష్టపడువేళ
చిమ్మచీకటిదిశల్ గ్రమ్ముకొనియుండ
వదలక చీరండ రొదసేయుచుండ
శోకంబుచే భీతిలేక చంద్రమతి
పన్నగదష్టుడై ప్రాణాలువిడిన
ముద్దులపాపని మూపునబెట్టి
కడుభయంకరమైన కాటికేగుచును
'హా! కుమారా!' యని యార్తయై వగచు
టాలించినిలువు నీరై పోయినాము!

సత్యవంతునిమేను చల్లారుచుండ
తొడలదలగడచేసి తోడులేకుండ
యమురాకకై కాననమునగూర్చుండి
భీకరాకారుని భీతియేలేక
గని నాథుప్రాణాలు గొనిపోవుచుండ
మనుజుల కసాధ్యమౌ మార్గాలబోయి
మంచిమాటలచేత మనసుమళ్ళించి
పతి పునర్జీవియౌనాపగిది వరమొంది
సావిత్రి వనిజేరుసమయంబుదాక
కనులుంచి సుకుమారు గాపాడినాము.

సత్యప్రవర్తన జవదాటలేక
అనుజన్ములందరు నజ్ఞాతవాస
దీక్షగైకొనువేళ దేవేంద్రసుతుని
శస్త్రాస్త్రములదాచి సాయమిచ్చేము
ప్రజలసేమమునకై పాటుపడనెంచి
ప్రాణేశ్వరినిబాసి రాజ్యంబురోసి
చిరరహస్యవిశేషచింతనల్ చేయ
మదిదిక్కపట్టి సమాధినుండంగ
నిర్వాణసుఖమిచ్చు నీడలగూర్చి
గౌతమబుద్ధుని గారవించేము.

అందరికన్న మేమాత్మలనెపుడు
అనురాగమున జూతు మాకువారలను!
బాలలు మానీడ కేళిసల్పినచో
ఆరోగ్యభాగ్యంబు లందగాగలరు!
ముదితలు మాపూల ముడుచుకొన్నంత
మగలకందంబుగా నగుపించగలరు!
తరుణులు మాకు ప్రదక్షిణాల్జేయ
గర్భంబుదాల్చి సౌఖ్యమునొందగలరు!
అబలలుమాపండ్ల నారగించినచో
కలకలలాడు పుత్రులగాంచగలరు!
ఫలములనాశించు బాలురేకాదు,
బాటలబోయెడి పాంథులేకాదు,
పరమమునులేకాదు, పక్షులేకాదు
మానీడ నిలచేరు, మమ్ముమెచ్చేరు!
పంచదారలవంటి ఫలములతోడ
పలురంగులంజూపు పర్ణములతోడ
పొలుపునెల్లెడజల్లు పుష్పములతోడ
ఘుమఘుమలవాసల నేకరీతిగనె
భూమి మాజీవితము, భూతదయ మతము!

# ప్రేమలో తారతమ్యము

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గారు

మధు ఆరేళ్ల బాలిక. మోసం ఎరగదు. పరికిణీ చొక్కా తొడుగుకొని కలకలలాడే నవ్వుమొగంతో ఉంటుందెప్పుడూను.

తల్లి నాలుగురోజుల క్రిందనుంచీ ముగ్గపెట్టి జాగ్రత్త చేసిన సపోటాపళ్లు నాలుగూ తీసి చాలా సేపటినుంచి మధుకోసం గూట్లో పెట్టి ఉంచింది.

తల్లి మధుని వీధులో చూచింది. ప్రేమవాహిని పొంగిపోయింది. ఆ నాలుగు పళ్లూ మధుహృదయంలో పడితే తన ప్రేమకి సార్థక్యం అనుకుంది.

వీధులో పిల్లలంతా ఆడుకుంటూన్నారు. వాళ్లతో కూడా మధూ కేరింతాలు కొడతూ ఆడుకొంటోంది. తల్లి వొచ్చి "మధూ!" అని పిలిచింది. మధు తొందరగా లోపలికెళ్లింది.

"మధూ! యీ పళ్లు ఇక్కడ కూర్చుని మెల్లిగా తినేం నువ్వు. ఆటల కేం మించిపోలేదులే." అని ముద్దులాడి పళ్లిచ్చి పనులు చేసుకుంటోంది తల్లి.

ఇంతలో పిల్లలంతా కిలకిలా లోపలికి ప్రవేశించారు. తల్లి "ఏమిటా అల్లరి?" అని వాళ్ల దగ్గర నిలబడింది. మధు పళ్లు చేత్తో తీసుకొని తల్లికేసి నిర్మలమైన హృదయంతో చూచింది. తల్లి కదలలేదు. నిలుచుండిపోయింది.

ఏం తోచిందో మధుకి. అందరికీ తలో కపండూ ఇచ్చింది. తనకి పండు లేదు. తల్లి నివ్వెరపడిపోయింది. పిల్లలు వెళ్లిపోయారు.

తల్లి మధుని కౌగిట చేర్చింది. ముద్దాడింది. "నీ కాసక కొనిపెడతానేం" అని రెండు డబ్బులు ఇచ్చింది మధుకి.

మధు పరుగున వెళ్లింది నవ్వుమొగంతో ఆడుకోటానికి. ఆ పళ్లు పట్టుకొని వాళ్లు మధుకోసం అల్లాగె కూర్చున్నారు. మధు వొచ్చాక అంతా కలసి బువ్వాలాటఆడుకొని అంతా కలిసి తిన్నారా పళ్లని.

తల్లి వీధిగుమ్మంలోంచి చూచి ఎంతో ఆనందించింది మధు హృదయనైర్మల్యానికి, పిల్లల హృదయనైర్మల్యానికీని.

# పెండ్లిచూపులు

శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మగారు

సాయంకాలం నాలుగుగంటలనుంచీ రామలక్ష్మికి యేమీతోచడంలేదు. పనివాళ్లమీద కేకలువేయడం, మేడమీదనుంచి కిందికీ, కిందనుంచి మేడమీదకీ ఈవిధముగా తిరగడంతోటే సరిపోతూంది. ఆవిడవెనకనే లిల్లీకూడా తిరుగుతూవుంది.

సూర్యనారాయణగారికి కృష్ణమూర్తి ఒక్కడేపిల్లవాడు. (ఇంటర్ మీడియెట్) చదువుతున్నాడు. చాలాఅందమైనవాడు. అసాదుక్కుతగ్గలావూ, కళ్లూ, ముక్కూ తీరుగావుంటాయి. మంచితెలుపు గనుక చూసేటందుకు బాగుంటాడు. తెలివితేటలకీ, చదువుతనానికీ చెప్పనక్కరలేదు. 17 ఏళ్లవయస్సు.

సూర్యనారాయణరావుకు కుక్కఅంటే బహుప్రేమ. కృష్ణమూర్తికికూడ అదేప్రేమ. అయితే రామలక్ష్మికి ఆచారంయెక్కువ కాబట్టి కుక్కఅంటే అంతయిష్టంలేదు. తండ్రీకొడుకులకోసరం లిల్లీచేసినపనులన్నీ ఓర్చుకుంటూవుండేది. లిల్లీ నలుగురూయెక్కడవుంటే అక్కడవుంటుంది. ఎవ్వరైనా గట్టిగా మాట్లాడేరంటే అరుస్తుంది. వాళ్లు కేకలువేయడంమాస్తేనేగాని అది అరవడంమానదు. కరిచినంతపనిచేస్తుంది. రామలక్ష్మి ఈలాఅడావిడిచేస్తూంటే యేమోఅని ఆవిడవెంటనేతిరుగుతూందిలిల్లీ.

వేలూరునుంచి జడ్జీయైన వెంకట్రావుగారూ, ఆయనభార్య జానకమ్మా సాయంత్రం 7 గంటలకు పిల్లవాడినిచూసేటందుకువస్తామని కబురుపంపినారు. ఆకబురువచ్చినప్పటినుంచీ "యేమేమిఫలహారాలుచేస్తామా" అని ఆలోచనచేసిచేసి, ఒకమోస్తరుగాతీర్మానించుకుని వంటఆవిడతోచెప్పింది. పిండివంటలుచేయవలెనని పెట్టెలోవున్నపాత్రలన్నీతీసివేసింది రామలక్ష్మి. ఆపాత్రలన్నీ చూసి దాసీది విసుక్కుంటూతోముతూంది. వంటమనిషి "పాత్రలను చప్పునియ్యి, పొయ్యికాచుకుంది" అని లోపలనుంచి కేకలేస్తూంది. ఇదంతాచూసి కాళ్ళకుమట్టుకుంటూ లిల్లీ మరింతఅరుస్తూంది.

రామలక్ష్మికి చిరాకుయెక్కువయి "ఛీ! ఫో అవతలకి! యేదిఅయితేనా, నువ్వు ముందుకొచ్చిచస్తావు నీవుపద్రవంయెక్కువఅయింది." అనిచెప్పి దాన్ని ఒక్కదెబ్బవేసి "కుప్పీ కుక్కనికట్టెయ్యి" అని దాసీదానితోటిచెప్పి పైకివెళ్లింది. మోటారువచ్చేప్పుడువినిపిస్తే వీథివైపుచూసింది రామలక్ష్మి. ఆమోటారువచ్చి వీళ్ళగుమ్మంలోఆగింది. "ఇదేమి ఇప్పుడేవచ్చేరే" అని మనస్సులోఅనుకుంటూ కొంచెం తెల్లమొఖంవేసి "రండి" అని వాళ్ళనుఆహ్వానిస్తూ మేడదిగుతూంది. ఇంతట్లోకే లిల్లీ గబగబాఅరుస్తూ వాళ్ళయెదురుగుండా వచ్చినిలుచుంది. జానకమ్మకి కుక్కనుచూస్తే భయంకాబట్టి భర్తవెనకనే జడుస్తూనిలబడింది.

రామలక్ష్మి ముఖంయెర్రచేసుకుంటూ "యేమే కుప్పీ కుక్కనికట్టమంటే కట్టలేదూ, నీకేమైనా చెప్పినమాటలు వినిపిస్తూందా?" అని దాన్నికసురుతూ "యేమీచేయదు, మీరు భయపడకండి" అని ఆవిడతోటిచెప్పి, కుప్పికేసి తేరిపారచూసింది. అతక్షణం కుప్పివచ్చి లిల్లీని గొలుసువేసికట్టింది. తరువాత జానకమ్మకు ప్రాణంకుదుటబడింది. అందరూకలిసి మేడమీదికివెళ్లేరు.

"ఆసోఫామీదకూర్చోండి" అన్నది జడ్జీగారితో రామలక్ష్మి. జానకమ్మకి తివాసీవేసి కూర్చోమన్నది. వారిద్దరూ కూర్చున్నారు.

"సూర్యనారాయణరావుగారెక్కడికెళ్లేరు? ఇప్పుడువస్తారా?" అన్నాడు వెంకట్రామయ్య.

"మీరు యేడుగంటలకువస్తానన్నారే అని, తండ్రీకొడుకూ బీచికివెళ్లేరు" అంది రామలక్ష్మి.

"అవును అలాగేవస్తామనిఅనుకున్నాను. కొంచెంపెందరాళేవెడితే బాగుంటుంది అంది. కాబట్టి యెప్పుడువస్తేనేమని.........అయితే నేను కొంచెంబయటికివెళ్లివస్తాను. మనకూమనకూ దూరబంధుత్వముందికాని, పరిచయంతక్కువ." భార్యకేసిచూసి, "కూచుంటావా నేనువెళ్లివస్తాను?" అన్నాడు వెంకట్రామయ్య.

"వెళ్లి త్వరగారండి" అన్నది జానకమ్మ.

జానకమ్మకు 34 యేళ్లువుంటాయి. మంచిఅందకత్తె. చారెడేసికళ్లూ, గుండ్రటిముఖం, పెద్దతలకట్టూ, అంతలావుకాక పొడుగూకాక సమానంగావుంది. జడ్జీగారిభార్యఅయినప్పుడు నగలకిచెప్పవలెనా, కెంపులు చెక్కినవడ్డాణం, రవ్వలఅడ్డిగ, రవ్వలకమ్మలూ, యెనిమిదిరాళ్ళబేసరీ, చేతికి నాగవత్తూ దానికికూడా రవ్వలుచెక్కినది, కాసులపేరూ, పలకసర్లూ ఇంకా అనేకమైనవగలన్నీ వేసుకొని, కరాచీ సరిగవేసినచీర కట్టుకుంటే భూలోకరంభేఅనుకోవాలి.

రామలక్ష్మిచూసిచూసి ఈవిడే ఇంతఅందంగావుంటే పిల్ల ఇంకా యెంతఅందంగావుందో? ఈలాటి కోడలు వాకువస్తే మనబంధువులకందరికీకూడా వన్నెతెస్తుంది. ఇన్నాళ్ళనుంచీ నేనుఅనుకున్నందుకు మంచి అందమైనకోడలేవస్తూంది. అయితే, ఇంతకీ వాళ్లుఒప్పుకోవాలికదా, మాట్లాడిద్దాంఅని తనలోఅనుకొని, "మీలాగేఉంటుందా అమ్మాయి?" అన్నది రామలక్ష్మి.

ముసిముసినవ్వునవ్వుకుంటూ "ఆ! చాలాగేఉంటుందండి. తండ్రిమల్లేవుండదు" అంది జానకి.

"వేలూరిలో ఇల్లుకట్టేరా? తెలియకఅడుగుతున్నాను. మరేమీఅనుకోకండేం?" అంది

"బాగుంది. ఈలాటివన్నింటికీ తప్పులెట్టుకుంటే ఆడపిల్లలనికన్నవాళ్ళకి సాగుతుందా?" అన్నది జానకమ్మ. వీళ్లిలామాట్లాడుకుంటూంటేనే, సూర్యనారాయణ, ఆయనకొడుకు కృష్ణమూర్తీవచ్చేరు.

"ఎంతసేపైందేమీరువచ్చి?" అన్నాడు సూర్యనారాయణ.

"అప్పుడేవచ్చేరు. ఆయన పనివుంది, ఇప్పుడేవస్తానని చెప్పి బయటికివెళ్లేరు. వచ్చేవేళకూడాఅయిందేమో?" అంది రామలక్ష్మి భర్తతోటి. వీరు ఈలామాట్లాడ్డంముగియకుండగానే వెంకట్రామయ్యవచ్చేడు.

"ఓ బావగారూ! రండి, నేను ఇంట్లోలేనందుకు క్షమించాలి" అనిచెప్పి ఆయనకూడా సోఫామీద కూర్చుని యోగక్షేమాలన్నీ విచారించుకోవడం మొదలుపెట్టేరు ఇద్దరూను.

గంట యెనిమిదిన్నరఅయినది. భోజనాలవేళయిందని వంటఆవిడ "భోజనాలకురావచ్చును" అని చెప్పి, పచ్చళ్లూ, కూరలూ, ఫలహారాలూ లెక్కలేనన్ని ఆకునిండుగా వడ్డనచేసింది. వడ్డనఅవుతూండగానే అందరూవచ్చి భోజనానికికూర్చున్నారు. సంతోషంగా భోజనాలుఅవుతున్నాయి. ఆమధ్యమధ్యలో, "మొహమాటంపడకండి" అని, సూర్యనారాయణ చెప్పుతూవున్నాడు. అందరూభోజనంచేసి, ఆతరవాత మేడమీదికివెళ్ళేరు.

అంతకుముందే తివాసీలుపరిచివున్నాయి కాబట్టి, దానిమీదకూర్చొని తాంబూలాలువేసుకుంటూ వున్నారు. కృష్ణుడు బత్తాయిపండ్లుతెచ్చి యెదురుగాపెట్టి, "అంతలోపల తాంబూలంవేసుకొన్నారా?" అన్నాడు.

"ఇప్పుడెందుకండీపళ్లు, ఫలహారాలకే ఇంకోకడుపు యెరువుతెచ్చుకోవాలి, పళ్లుకూడా యెక్కడపడుతాయి?" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇప్పుడవసరంలేదులెండి, కొంచెంసేపుతాళి మరీతిందాం" అని పళ్లన్నీవొలుస్తున్నాడు సూర్యనారాయణ.

ఎప్పుడూ పళ్లుతెచ్చేముందేవచ్చి, మూతినాకుకుంటూ ఇటూఅటూతిరగడం లిల్లీకి అలవాటు. పళ్ళన్నీ వొలిచేసేరు. "బావగారూ! కొంచెం నోట్లోవేసుకోండి" అనిచెప్పి, "ఇంకారాలేదే లిల్లీ, యెక్కడికివెళ్లిందీవేళ? పక్కఇంటిరాముడు తీసుకెళ్లేడా?" అన్నాడు సూర్యనారాయణ.

"ఎక్కడకూవెళ్ళలేదు. వీరంతావచ్చినప్పుడుఅరిస్తే, దానీదాన్ని కట్టెయ్యమన్నాను. కిందవుంది." అన్నది రామలక్ష్మి.

"దానికి అరవడంఅలవాటేకదా, కొంచెంసేపుఅరిచి అదేవూరుకుంటుంది. దాన్నికట్టెయ్యడమెందుకూ, మంచిపనిచేసేవు కాని, విప్పమను పండుతింటుంది" అన్నాడు.

"ఏమండీ మీకుక్క పళ్లుకూడాతింటుందా! మనఇంట్లోపెంచుతూన్నందుకు మనతిళ్లేఅలవాటుచేసేరా వీధిలోకివెళ్లి, అలాంటివేమీతినదా? అయితే మంచికుక్కే, బాగానేపెంచుతున్నారు" అన్నాడు వెంకట్రామయ్య.

"ఏమిటోనండి, దానిబుద్ధి అదియెక్కడనూస్తుందీ. మీరు పద్యంచదవలేదా? ఎప్పుడైనా కాకులు తెచ్చిపడేసిన యెముకముక్కదొరికితే కొరుకుతూఉంటుంది. మేమెప్పుడూ దానికని ప్రత్యేకంగాపెట్టించలేదు" అనిచెప్పి లిల్లీని పక్కనకూర్చోపెట్టుకొని, తొనలువలిచిపెట్టేడు సూర్యనారాయణ.

అదితింటూంటే "బాగానేతింటూందండీ" అని దానికేసేచూస్తూ, ఆయనా పళ్లుతింటున్నాడు.

అందరూ పళ్లుతిన్నతరువాత, తిరిగీ ఇంకోకమాటు తాంబూలంవేసుకొని, "ఇంక మేమువెళ్తామండీ ఇప్పటికే చాలాప్రొద్దుపోయింది" అని చేతినున్నగడియారంచూసుకున్నాడు. "గంట పదైంది. ఇంక ఆలస్యం చేయకూడదు. బయలుదేరాలి" అన్నాడు వెంకట్రామయ్య.

"రేపువెళ్లవచ్చును లెండి. ఇప్పుడేమిఅవసరం ఇంతరాత్రిఅయినతరువాత. అదిగో ఆయెదురుగావున్నగది మీకు సౌఖ్యంగావుంటుంది. ఈరాత్రివుండి తెల్లవారుజామున నేలేచి వెళ్ళవచ్చును. పదిగంటలయినతరువాత వెళ్ళడంఅంటే బాగాలేదు. నామాటవినివుండండి; మీకు సౌఖ్యంలేకపోతే వెళ్ళవచ్చును. రండి గదిచూతురుగాని" అని వెంకట్రామయ్యనుతీసికువెళ్లి చూపించేడు సూర్యనారాయణ.

ఆగది పెద్దదిగానూ, చాలావిశాలంగానూ, అందంగానూ రెండుమంచాలూ, ఒకమేజా, అద్దం ఇటువంటివన్నీ, ఇంకా పలువిధములైన కంజాయింపులన్నీవున్నందువల్ల, చూసేటందుకు షోకుగావున్నది. ఆగది ముందుతట్టు పెద్దడాబాకూడవున్నది. అక్కడ కాళ్లుచేతులుకడుగుకునేందుకు గంగాళంనిండుగా నీళ్లుకూడా పెట్టివున్నది. మంచిగాలికూడావేసును. కాబట్టి వుందామని నిశ్చయంచేసుకున్నాడు. భార్యనిపిలిచి, "వుందామా తెల్లవారివెళ్ళవచ్చును" అన్నాడు.

"సరి, మీఇష్టంయేలాగో అలాగే. నన్నడిగేదేమిటీ?" అని అంది జానకమ్మ. ఇద్దరూకూడా వుండివెళ్ళవలెనని తీర్మానించుకున్నారు.

ఎవరిపక్కలు వారువేసుకొని, ప్రొద్దుఅయినదికదాఅని పడుకున్నారు.

వాళ్ళకు పుర్మాయించినగదిలో జానకమ్మ పడుక్కున్నది. అక్కడనే డాబామీద వెంకట్రామయ్య మంచంవేసుకొని పడుక్కున్నాడు.........అందరికీ నిద్రలు పట్టీపట్టకుండవున్నారు. జానకమ్మ ఇంకా నిద్రపోలేదు. లేచి గంగాళంనీళ్ళదగ్గరకువెళ్ళి, కొంచెంసేపు కూర్చోనివచ్చి పడుక్కున్నది.

పదినిమిషములుఅయినతరువాత గభీలుమని వులిక్కిపడిలేచి క్రిందపడేటట్టువెళ్ళి, గంగాళందగ్గర చూసింది. చూసినతోడనే? ఆవచ్చేదుఃఖాన్నీ, కోపాన్నిఆపుకుంటూ, వెంకట్రామయ్య పడుక్కున్నచోటి

వెళ్ళి, "నన్ను, నన్ను, అబ...అ...బ...మానంతీయడానికి వుండమన్నాడు. నేను ఇంక ఇక్కడవుండను. ఎల్లిపోదాం, యెల్లిపోదాం నన్ను, నన్నూ" అంటూ చిన్నపిల్లలూ, అవ్వలూ మాట్లాడేటట్టు దద్దుబిద్దులాడుతూ యేడుస్తూంది.

అదిచూచి వెంకట్రామయ్య అదిరిపడిలేచి, "యేమి, యేమి, యేంచేసేరు? పోదాంలే తెల్లవారనీ. అలాకేకలువేస్తావేమీ, చెప్పు కేకలువేయక, అందరూలేస్తారు" అంటూ లేచికూర్చున్నాడు. ఈవిడ ఇలా యేడుస్తూంటే సూర్యనారాయణలేచి, "యేమిసార్, యెందుకు అలాంటారు. ఆమెవంట్లో బాగాలేదా? లేక భయపడ్డారా?" అనిఅడుగుతూ, రామలక్ష్మినిలేపి "నువ్వెళ్ళికనుక్కో యేమిటోనూ" అన్నాడు.

రామలక్ష్మిలేచి దీపంతీసుకొనివెళ్ళిచూస్తే, తలమీద చేతులుపెట్టుకొని యేడుస్తూంది. అదిచూచి, "యేమండీ, యెందుకూ వంట్లోయేమీ?" అని దగ్గరకువెళ్ళింది.

"నువ్వుదాకు......దాకు......దావద్దు......పో......పో......దువ్వు అదిగక్కడ...దేరు" అని ముఖానికి చేతులుఅడ్డంపెట్టుకుని, మరింత కేకలువేస్తూయేడుస్తూంది.

ఈకేకలూ, యేడుపూవిని ఘుర్రుఘుర్రుమనిఅరుస్తూ లిల్లీవచ్చి రామలక్ష్మిపక్కన నించుంది. లిల్లీని చూస్తే సగంపళ్లువూడిపోయిన పళ్ళకట్టురెండు నోటిలోకరుచుకొని, ఘుర్రుఘుర్రుఅంటూనించుంది. రామలక్ష్మికి యేమీతోచక నిర్ఘాంతపోయి జానకమ్మముఖంకేసీ, లిల్లీముఖంకేసీచూస్తూ నిలబడింది. అక్కడ వున్నవాళ్ళందరూకూడా ఆవిధంగానే చూస్తున్నారు.

జానకమ్మకి దుఃఖం మరింతయెక్కువయింది. వీళ్ళవల్ల తప్పులేదని తెలిస్తేకూడా, సిగ్గుపడి తక్షణం మోటారెక్కి, ఆరాత్రికి, రాత్రిబయలుదేరి ఇద్దరూకూడా వెళ్ళిపోయినారు.

## బాష్పములు

దామెర పెదవెంకయ్యగారు

పవిమలభావములు నీదుహృదయసీమ
బ్రాకులాడెడినో కావ్యరచనసేయ
బొడముతహతహ నిక్కెడనెడఁగదల్చి
రాల్చుచున్నావు బాష్పపరంపరలను
వలపుకబ్బముసెప్పు పుష్పకవి! నేను.
చంద్రకాంతశిలావేదిపై తమిట్లు
భావరసముగ్రహించి బాష్పములునింప
బూర్ణిమాచంద్రికాకావ్యమునురచించు
సరసశృంగారకవివతంసమవు చంద్ర!
మేలిగానములు పాంథులు మెచ్చరేమొ!
మౌక్తికములయి రాజన్యమకుటపాళి
వరలునివియేవిలాసినీబాష్పతతులో
వార్ధిగార్భాన దివినుండి పడియెనాడు
అరయ మనకెల్లఁ బూజనీయమ్ముకాదె?
కరగిజారెనువాల్గంటికంటినీరు.
నాడుమనసారఁ బ్రవిమలాంధ్రమునఁగవులు
మంచుముత్యాల క్రోవల మాడ్కినించి
విడిచిపుచ్చినకృతి బాష్పబిందుతతులు
మనకు నానాటి కంఠభూషణములగుచు
నమరినవి నేటికిని దడియారకుండ
కబ్బపుజగానఁ దొలుతొల్తఁ గన్నుఁదెఱచి
పొడముతహతహనేనిందు విడిచిపుచ్చు
"బాష్పములు"ము త్తియంపుచిప్పలనుబడునొ
పూలనోదుగునొ పాషాణములనుదొరలి
పోవునో యెట్టికంఠవిభూషలగునో!
ఎవ డెఱుంగును? మనదేశ మెంతలేదు!!!

# అక్బరు నిర్వేదము

కర్లపాలెము కృష్ణారావుగారు

దట్టీయందమర్చబడినవరలోనిచంద్రాయుధము నిర్విచారముగ యటునిటూగుచుండ తటిల్లతవోలె తళుకుతళుక్కుమని మెరయుచు అశ్వశిక్షయందారితేరినరౌతువోలె దన "పంచకళ్యాణి"ని విలాసముగకదనుద్రొక్కించుచు, పోటుబంటులశవాకారములనొకకంటదిలకించుచు, యథేచ్ఛగవీరవిహారముసల్పుచుండిన యావ్యక్తి యెవరుచెపుమా? స్త్రీమూర్తియా? అదిగో! ఇంకనుసందేహమేల? ఫాలభాగమున లయదప్పకుండ ముంగురులుచిందులుద్రొక్కచుండ వెలలేనివిమలముక్తాధామము సగర్వముగనాట్యముసలుపుచుండ పుష్యరాగముల మాడ్కి నందందుగండభాగమున గ్రమ్మినచెమటబిందువుల కోమలకరకమలమెత్తి కొనగోట రాల్చుచు కళ్లెము నొకచేతలాగిపట్టి దిశలబరికించుచున్నది.—ఆహా! ఏమిది! భీభత్సరసమున కాటపట్టగురక్తాంబరధారిణి—ఎంతలోనెట్టిమార్పు? శృంగారస్వరూపిణి రుద్రమూర్తియైపోయినది. చిగురాకుమోవిబిగించి కనుబొమలుముడివడ ముక్కుపుటములుస్థూలమగుచున్నవి. దేదీప్యమానంబులై, చంచలములై, సిరులకాలవాలమగు నేత్రద్వయము క్షణములోవిస్ఫారియగ్నికణములరాల్చుచున్నది. లలితమై, యానందదాయకమై యొప్పువదనమండలమెఱ్ఱబారి యదరుచున్నది.—అదిగో! నావంకకే—నన్నేపిలచుచున్నది. అరరే! దుమికినది. ముడివీడి కేశపాశము వెన్నునగుచ్ఛగుచ్ఛములుగవిరియబడ క్రిందికిదుమికినది. ధగద్ధగాయమానంబగు ఖడ్గమునుఝుళిపించుచున్నది.—ఆ—తల్లీ! ఏమనుచున్నావు? పాటేశ్వరివా? నీవు పాటేశ్వరివా?—"మేవాడ్ రాజ్యమునకు పాలకులము మేమే. బొందిలోజీవములున్నంతవరకు నీసార్వభౌమపదవిని—నీనిరంకుశాధికారమును సమ్మతింపము—సాగనీయము" అని యాయనుచున్నావు? దేవీ! గ్రహించితిని. మేవాడ్ రాజ్యమునీదే. ముమ్మాటికినీదే. వలదు. వలదు—నాకీచక్రవర్తిబిరుదమనవసరము స్త్రీలపైతము అసమ్మతినిజూపుచు త్యాగవహ్నికాహుతియగుచున్నపుడు పరిపాలనమెట్లుసాగగలదు? అజ్ఞానాంధకారమునబడి స్వాతిశయమున వైరమును బెంచుకొని మిమ్మగచాట్లపాలుజేసితిని. పరమపవిత్రమై పూజనీయమైన స్త్రీజాతితో యుద్ధమునేయజాల. మీమాతృదేశారాధనాదీక్ష యనిర్వచనీయమైనది. హైందవ నారీరత్నములింతటి రణక్రియాకుతూహలురని, యింతటిశక్తిసామర్థ్యములుగలవారని, యింత త్రికరణశుద్ధిగలదేశసేవికలని, యింతపరిపాలనాజ్ఞానధురంధరలని ఎఱిగియుండినచో నేని కార్యమునకు తలపెట్టను. దేవీ! అనాదీయమై న్యాయసమ్మతముగ మీహక్కుభుక్తములలోనున్న "మేవాడ్" రాజ్యమునీదే. అవిచ్ఛిన్నముగనేలుకొనుడు. మఱియొకదుర్గమును గూడ హృదయపూర్వకముగ మీకర్పింతును. ఉభయులము సరిసమానులమై ప్రజాసేవ జేయుదుము. మాతా! రోషకషాయితంబగు నీశక్తిస్వరూపమునువీక్షింపజాల. శాంతింపుము. ధర్మమే జయించునుగాక. శాంతింపుము. అల్లాహో అక్బర్!

# పతివ్రతా!

బొడ్డు బాపిరాజుగారు

మిన్నంటిరాయు భూమీధరమ్ములునైన తలవినమ్రిత నీకు దారిఁజూపు;
లోకమ్ములన్ని భస్మీకరింపఁగఁజాలు దావాగ్ని నీకు శీతలమొసంగు;
రంగదుత్తుంగతరంగభీషణమైన వారాన్నిధులు నీకు పాయ నిచ్చు;
ఆలోకభీకరంబగు దుష్టవన్యసత్వములెల్ల నీ కూడిగములు సేయు;
వారు వీరననేల? దేవతలునైన
నెలమి నీయాజ్ఞ శిరసావహింతురమ్మ!
కలదె సర్వసర్వంసహాస్థలిని నీ క
సాధ్యము? పతివ్రతా! నమస్కారమమ్మ!

త్రిభువనమ్ముల నేలు దేవతాప్రభువుల పసిపాపలనుజేయు ప్రతిభ గలదు;
యమపాశదృఢబంధనములఁ జిక్కినవానిజీవమ్ము లిప్పించు చేవగలదు;
కమలాప్త, హిమధామ గగనసంచారంబు రహి నిరోధించు సన్మహిమగలదు;
శరచాపములఁబూని సాహసమ్మున ఘోరసంగ్రామమొనరించు శక్తిగలదు;
నాకు బీకుగ; బీకును నాకుగ; సలు
పఁగ నమోఘవాక్యప్రభావమ్ము గలదు;
కలదె సర్వసర్వంసహాస్థలిని నీ క
సాధ్యము? పతివ్రతా! నమస్కారమమ్మ!!

విభువచనంబులె వేదవాక్యంబులు; సఖునియాజ్ఞయె రాజశాసనంబు;
ప్రాణేశుశుభమె వాంఛితార్థము; భర్తచరణపూజనములె జపతపములు;
పతినామచింతన పరమేశ్వరధ్యాన; మాత్మేశుముదమె అభ్యర్చితంబు;
జీవితేశ్వరుని సంసేవనంబె హితంబు; కాంతునిసుఖమె ముఖ్యాశయముగ
ధవునిరూపంబు హృదయపద్మమున నిల్పి
పతిహితధురీణవై నీవు బరఁగుదమ్మ!
కలదె సర్వసర్వంసహాస్థలిని నీ క
సాధ్యము? పతివ్రతా! నమస్కారమమ్మ!!!

# సులభ

**తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు**

సులభ నైష్ఠికబ్రహ్మచారిణియై జనకమహారాజు కాలమందు జీవించియుండెను. జనకుఁడు రాజ్యకార్యమగ్నుఁడైనను పూర్ణవిరాగియై, గొప్పవిద్వాంసుఁడై, తత్త్వజిజ్ఞాసుఁడైయుండెను. వారి రాజసభయందు దూరదూరదేశములనుండి పండితులు విద్వాంసులు చనుదెంచి శాస్త్రచర్చ నొనర్చుచుండిరి. సులభయును పరమవిదుషీరత్నమై శాస్త్రచర్చయం దాసక్తిగలిగియుండెను. యోగక్రియలందు సాధనములందు నామెపారంగతురాలై యుండియు తగిన భర్త లభించకపోవుటచే ఆజీవితము బ్రహ్మచారిణియై మెలఁగుచుండెను. ఎందుకనన నాసమయమునందు పరిణతమగుటకుముందే సన్యాసాశ్రమస్వీకార మొనర్ప నధికారముగలదు. ఇందుచే నీమె సన్యాసినిగూడనయ్యెను. ఈమెకు జనకుఁడు మోక్షధర్మమందు ప్రవీణుఁడైయుండెనని తెలియుటతోడనే యాతని పరీక్షింప మిక్కిలి కుతూహలయయ్యెను.

ఆమె యోగవిద్యచే తన సన్యాసినీవేషము త్యజించి సుందరీరూపముదాల్చి కొలఁదిదినములలో విదేహనగరముఁజేరెను. అచ్చట భిక్షమెత్తుకొనుటకై తపముచే జనకునికడ నామె సౌకుమార్యముగాంచి రాజాశ్చర్యనిమగ్నుఁడయ్యెను.

అతఁడు మనంబున నీమెయొక తెరవా యెచ్చటనుండి చనుదెంచినదోయని తలపోసి యామెకనేకాదర సత్కారములాచరించి కూర్చుండఁబీఠమర్పించి పాదములఁగడిగి అనేకపూజలుచేసి యుత్తమోత్తమభోజనమొనరింపఁజేసి చాలఁగ తృప్తిపఱచెను. భోజనానంతరము సులభ మోక్షధర్మవిషయమై రాజు ననేకప్రశ్నలవైచెను. కాని యామె సంశయము దీఱకపోవుటచే నీతఁడు ముక్తుండా? కాఁడా? యని యనుమానించి నిజయోగబలముచే రాజమస్తిష్కముఁజేరెను. అప్పుడు రాజిట్లుపలికెను.

"ఓపూజ్యదేవీ! నీవేమి యాటనాడుచుంటివి? నీవెవరికుమార్తె వెవరిభార్యవు? అడుగకుండ నితరుల జాతి, మత, విద్య, ఆయువులు గ్రహించుట సులభతరము. ఎచ్చటనుండి వచ్చుచుంటివి? ఎచ్చటికేగుచుంటివి? నాపరిచయముగూడ వెల్లడించుచుంటిని వినుము. నేను రాజ్యమదముక్తుఁడను. నీతో నేను వైరాగ్యచర్చనొనర్పఁదలచుచుంటిని. ఈవిషయమై నిన్నుబ్రశ్నింప నెవ్వరును సమర్థులులేరు. పరమబుద్ధిమంతుఁడగు పంచశిఖునిశిష్యుఁడను. అతఁడు నాశంకలనన్నింటినిబోగొట్టెను. నేను యోగసాంఖ్యశాస్త్రములందు పారంగతుఁడను. మోక్షకర్మ, ఉపాసన; జ్ఞానములు మూఁడుసాధనముల నే నెఱుంగుదును. పంచశిఖమహాత్ముఁడు చాతుర్మాస్య మిచ్చటనే జరిపిరి. వారు నాకు యోగవిద్యనలవడఁజేసిరి. కాని రాజ్యమువిసర్జింపుమని నాకాజ్ఞాపించియుండలేదు. వారు మోక్షమునకై నిష్కామకర్మల నొనర్పుమనియె చెప్పియుండిరి. యోగముచే జ్ఞానమలవడును. జ్ఞానముచే నఖిలసుఖదుఃఖవిముక్తియు జరుగును. నాకీజ్ఞానమే దొఱకినది. ఈసంసారజీవితమువలన నాకు కొంచెమిచ్చి పుచ్చుకొనుటజరుగదు. తడుపఁబడిన భూమిపై బీజము లెట్లునాటుకొనునో యట్లే మనుజులకర్మోత్పత్తి జరుగుచున్నది. గురూపదేశముగా వాసనారూపమైన బీజమును నశింపజేసినది. అందుచే దానికి మొలకలైన బయలుదేఱదు. సుఖదుఃఖములు నామనస్సునకు సమానములు. ఒకఁడు నాయొక్కహస్తముపై చందనము, రెండవకరముపై నగ్ని బూసిన నీరెండుకర్మలును నాకు సమానములే. నాకు మృత్తిక, శిల, సువర్ణము సమానములు. సంబంధములన్నిఁటినివిడచి నేను రాజ్యమొనర్చుచున్నాను. కనుక నేను త్రిదండసన్యాసులలో శ్రేష్ఠుఁడను. శాస్త్రమందు జ్ఞానము, ఉపాసన, కర్మ యనుమూఁడును స్థితిని తెలియఁబరచుచున్నవి. మహాత్ముఁడయిన పంచశిఖుఁడు నాకు కర్మలవలన మంచిజరుగునో దానికై చింతింపరాదనియు; కర్మలప్రయోజనమున్నను లేకున్నను వాటినిత్యజింపరాదనియు శిక్షనొసంగియుండెను. ఇటువంటివృత్తి గ్రహించువాఁడు యత్నము, నియమము, కామము, ద్వేషము, పరిగ్రహము, మానము, దంభము, స్నేహము మొదలైన విషయముల

వన్నిటిని సమానబుద్ధిలో జూడవలెను. కషాయవస్త్రములు ధరించుట, వపనమొనరించుకొనుట, దండకమండలులుదాల్చుట మొదలైన కార్యములన్నిటిని నేను బాహ్యచిహ్నములని తలంచుచున్నాను. నాయాలోచన ప్రకారమివియేమియు మోక్షహేతువులుకావు. ముక్తికై వస్తుత్యాగము, వస్తుగ్రహణము ముఖ్యమని నేను తలంపను. నేను జ్ఞానమునే యావశ్యకమని తలంతును. ఇందుచేతనే ధర్మము, అర్థము, కామము, రాజ్యవైభవము మొదలైన బంధనములచే గూర్పబడినను నేను ముక్తుడను. నాకేబంధనములేదు. స్నేహరూపబంధనముచే గట్టబడిన రాజ్యప్రభుత్వపాశమును నేను జాతిపైనూరి పదునుగూర్చిన నిజత్యాగఖడ్గముచే ఛేదించితిని. అయినను నేనీవిధముగ జీవన్ముక్తుడను. మరియు యోగప్రభావయుక్తవగు నిన్ను గాంచ నాకమందాదరభావముత్పన్నమగుచున్నది. భిక్షుకా! నీసుందరత్వము, అవస్థయునిప్పుడు యోగగ్రహణానర్హములైనను నీయందు సన్న్యాసులకుదగిన యమ, నియమాత్మసంయమములు స్పష్టముగ గానుపించుచున్నవి. ఇది నాకాశ్చర్య కారణమగుచున్నది. నీవు కపటముగ మెలగుచుంటివని నాకనుమానముగ నున్నది. నీవెందుకిట్లుంటివి? నే నిదరుగజాలకుంటిని. నీవిప్పుడీసన్న్యస్తధర్మము విడనాడకుండుమని నే సలహాచెప్పుచున్నాను. గుప్తవేషముదాల్చి నీవు జనకుడు ముక్తుడోకాడో గ్రహింప నిశ్చయించినట్లు తోచుచున్నది. నీయాంతరంగికమైన యుద్దేశ్యమేమి? నీయాగమనకారణము, నీజాతియు, నీయధ్యయనాది సంగతులు యావత్తువెల్లడింపుము."

ఈరాజాక్షేపణలు సులభకేమంతయు కష్టమునిపించలేదు. జనకుడడిగిన సంగతులన్నిటికి విస్తారపూర్వకముగ జవాబొసంగెను.

మొదట రాజునకు వాణి యెన్నివిధములుగనుండవలయునో, వాణిలోగల రెండవగుణములేవేవి సమావిష్టములైయున్నవో యెరింగించి మరియు నిట్లుపలికెను:

"వాణిని దూషించెడుదోషములు తొమ్మిదియుండును. బుద్ధిని దూషించెడుదోషములును తొమ్మిదేయుండును. ఈపదునెనిమిదిదోషములు లేనిదై దీనికి విపరీతమైన యష్టాదశప్రకారగుణయుతమగువాణిని "వాక్య" మందురు. సరిగా తెలియనివాక్యము "సుపేతార్థవాక్య" మందురు. విశేషార్థ విరహితవాక్యముల "నభిన్నార్థవాక్యము" లందురు. ప్రశంసనొసర్పు విశేషణములుగల వాక్యములను "న్యాయవృత్తవాక్యము" లందురు. సంక్షేపముగలిగించు వాక్యములను "సంక్షిప్తవాక్యము" లందురు. శ్లేషము, సామ్యము, కాంతి, ఓజస్సు, (ఆర్జవము,) స్పష్టవాదిత్వము, ఉదారత్వము, రీతి, గతి, ఈయొనిమిదిగుణములు గలిగిన వాక్యముల "గోమలవాక్యము" లందురు. వీటినే శ్లక్ష్ణవాక్యములనికూడ నందురు. దీనికి విపరీతముగ నష్టగుణవిరహిత వాక్యముల "నశ్లక్ష్ణవాక్యము" లనియు "నకోమలవాక్యము" లనియు చెప్పుదురు. సందేహముత్పత్తి కాని వాక్యముల "నసందిగ్ధవాక్యము" లందురు. బుద్ధిదోషములందు కామము, క్రోధము, భయము, లోభము, నమ్రత, గర్వము, లజ్జ, దయ, మానము, మొదలయినవాటిని లెక్కించి మరియు నిట్లనిరి.

"ఈతొమ్మిది బుద్ధిదోషములతో నే నెప్పుడునుమాట్లాడను. రాజా! ఆత్మపదార్థములందు భేదముపడకుండ నెవడు మాట్లాడుచుండునో వానినే నిజముయినవక్తగా నెరుంగవలయును. రజ, జలబిందువుల స్వభావముచే పరస్పరము కలిసికొనునట్లు ప్రాణులశరీరములు కలుసుకొనును. ఇందుచే శరీరముకంటె భిన్నముగ నాత్మతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచేంద్రియములు కలిసికొనును.

నీవు నన్నెవరని యడిగితివి. కాని యీప్రశ్న వ్యర్థము. ఎందుకనగా లక్ష్య, కార్యముసంయోగమువలె నేనును జడచేతనసంయోగముచే తయారయితిని. ఇందులో నీవు జడప్రశ్నవైచుచో నీయందున్న జడమే(అచేతనము) నాయందునున్నది. సముదాయప్రశ్నమడిగినచో నీయందున్న సముదాయమే నాయందునున్నది. అందుచే నీప్రశ్న వ్యర్థము. ఇంద్రియములగురించి యెప్పుడు నడుగడు. నీవెవరవు? నేత్రములు తన్ను గాంచజాలవు. శ్రవణములు తన్ను వినజాలవు. ఈవిధముగ నింద్రియములుగూడ నొకటి రెండవదానిని నెరుగజాలవు.

ఇతరవస్తువులఁగాంచ నెట్లు సూర్యకాంతికావలెనో యట్లే యింద్రియములకుకూడ వస్తుపదార్థప్రకాశము జేయుటకై వెలుపలి ఇతరగుణ మావశ్యకమగుచున్నది. జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును, గాక పదునొకండవది "మనస్సు" ఉన్నది. దానివలన మనుజుఁడు మంచిచెడ్డ లాలోచింపఁజాలుచున్నాఁడు. పండ్రెండవది "బుద్ధి". దానివలన తెలియఁదగిన విషయములు తెలియుచు శంకానివారణమగుచున్నది. పదమూఁడవగుణము "సత్త్వము". దానివలన మనుష్యుడెంతవరకు సత్త్వగుణముకలవాఁడో తెలియుచున్నది. పదునాల్గవగుణ "మహంకారము." దానివలన ప్రాణి నేనుకర్తనని యొప్పుకొనుచున్నాఁడు. ఇది నాది కాదను భావము తెలియించునది పదునైదవగుణము. పదునాఱవగుణ "మవిద్య". పదునేడవగుణము "ప్రకృతి". పదునెనిమిదవగుణము "వ్యక్తి". సుఖదుఃఖముల, వృద్ధత్వ మరణత్వముల, లాభహానుల, ప్రియాప్రియముల మిళితయోగము, పందొమ్మిదవగుణము. తరువాత "కాల" మను పేరుగలది ఇరువదవగుణము. దానివలన ప్రాణిమాత్రుని యుత్పత్తిసంహారములగుచున్నవి. ఈవిధముగ నిరువదేడుగుణములు చెప్పబడుచున్నవి. వాటియందు విధి, వీర్య, బలములను గుణములను మూటిని గలుపుచో ముప్పదిగుణములగుచున్నవి. ఎక్కడ నీముప్పదిగుణములు కలుగునో అదే "శరీర" నామమును బొందుచున్నది. ఓరాజేంద్రా! ఏఅవ్యక్తప్రకృతి యీకళలనుంచి వ్యక్తమైయున్నదో అదే నేను. నీవు నితరశరీరధారులుగూడ నదియే. కనుక నీవెవరని ప్రశ్న చేయు నావశ్యకత లేదు. స్త్రీగర్భమందు బిందుస్థాపితమై, దానితో ప్రారంభమై, వీర్యరుధిరములనుండి యుత్పన్నములైన యుగసులను పిండములని చెప్పుదురు. ఈపిండములనుండి బుద్బుదములుత్పన్నములగును. తద్బుద్బుదమునుండి గ్రుడ్డును, గ్రుడ్డునుండి భిన్నభిన్నాంగములు, నఖములు, రోమములుత్పత్తియగును. నవమాసానంతరము శిశువుత్పన్నమగును. అప్పుడు తన నామము వలె రూపము నేర్పడును. వాని యొజ్జనిర్దేశ్యనుగాంచి "కుమారు" డందురు. సమయము ననుసరించి బాల్యావస్థజనుచున్నది. కాని అది తిరుగరాజాలదు. దానితరువాత యువావస్థయు, ననంతరమున వృద్ధావస్థయు ప్రాప్తించుచున్నవి. క్రమక్రమముగ పెండటియవస్థ నాశనమగుచున్నది. కాని తిరుగరాదు. అనంతరమున శరీరమునకుగల పదునాఱుకళలు పరివర్తనమగుచున్నవి. కాని యత్యంతసూక్ష్మమైన దగుటచే నీభేద మెవ్వరికి తెలియబడదు. నూతనాశ్వమెటుల స్వారిజేయునప్పుడు ప్రతినిముషమందు దనస్థానమును మాఱిపోవుచున్నదో యటులే యీశరీరము ప్రతినిముషము మాఱిపోవుచున్నది. అందరకు నెల్లప్పుడీగతియే జరుగుచున్నది. నీవు నన్ను ఎవరవు? ఎచ్చటనుండి వచ్చితివి? అని అడిగితివి. అది వ్యర్థమగుచున్నది. నీవేప్రకారముగ నీవిషయమై నీయాత్మను గాంచఁజాలుచుంటివో అటులే ఇతరులవిషయమై ఇతరులయాత్మ నెందుకు గాంచఁజాలవు? మైథిలా? "ఇదినాది" "ఇదినాదికాదు" అను జగడమునుండి యెవ్వఁడు ముక్తుడగునో వానికి "నీవెవరవు? ఎవరిదానవు" అను మాటలడుగుటచే ప్రయోజన మేమి?"

ఈవిధముగ సులభ తత్త్వజ్ఞానములనేకములు చెప్పి జనకుని భ్రమ, విచారములనన్నిటిని దొలంగజేసెను. మఱియునిట్లు చెప్పెను:

"మోక్షమార్గము చాలకష్టము. గృహస్థాశ్రమమందు ముక్తిగాంచుట దుర్లభము. ఇందువలనే సన్యాసమే సర్వశ్రేష్ఠము. జాతికి నేను బ్రాహ్మణ, వైశ్యకులములలో బుట్టియుండలేదు. శూద్రకులములో జన్మించియుండలేదు. నీసజాతీయమైన క్షత్రియవంశజను. నేను భ్రష్టురాలనుకాను గాన నాయుత్పత్తి శుద్ధమైనది. "ప్రధానుఁ"డను ప్రసిద్ధరాజర్షిని తమరెఱింగియేయుందురు. ఆకులమందే నాజన్మమయ్యెను. నాపూర్వజులు చాలయజ్ఞములొనర్చియుండిరి. నాకనురూపవరుడు లభింపకపోవుటచే నేను బ్రహ్మచారిణినైతిని. ఇందుచే మోక్షధర్మమునందు ప్రవృత్తనై, సాధువ్రతముదాల్చి యొంటరిగ నీ పృథ్వియంతయు దిరుగుచుంటిని. నాయందేవిధమైన కపటములేదు. నే నితరుల ధనమాశింపను. నేను నాధర్మమువీద నే దృఢురాలనై యుం

డును. ఓరాజా! నేను నాప్రతిజ్ఞపై స్థిరురాలను. నేనాలోచింపకుండ, తెలిసికొనకుండ నేమియు ప్రసంగింపను. నీప్రశంస నేను చాలవింటిని. నీ మోక్షసంబంధమైన విచారములన్నియు భ్రమపూర్ణములు పొరపాటులతో నుండెనని యిప్పుడు తెలిసికొంటిని. అందుచే నీవిచారములన్నిటిని గ్రహించి నావిచారములను నీపై ప్రకటించి నిన్ను యోగ్యమార్గముపైకి తీరా నే నిటకు జనుదెంచితిని. నాపక్షమును సమర్థించి ఇతరులపక్షమును ఖండించి పక్షపాతముగ కార్య మొనరింప రాలేదు. నీ మేలుకొఱకే వచ్చితిని. అందుచే జీవన్ముక్తురాలను. ఇందుచే నాకు నీయందు పదేశావశ్యకత యేమి? ఏపురుషుఁడు తనలాభమునకై వాదవివాదరూపమైన పరిశ్రమ మొనర్పడో వాఁడే ముక్తుఁడు. కాని నీవు నీపక్షమును నిజ మొనర్చుకొనుటకు వాదవివాదముల జేయుచున్నావు. ఇందుచే నీవు ముక్తుఁడవుకావు. ఇందుచేత నీవు నావాక్యముల నాదరము చేయుము."

సులభ ఈప్రకారము జనకునికి దత్త్వోపదేశ మొనర్చుచు నొకరాత్రి యటవసించి మఱునాఁడు జనకుని సెలవుగైకొని బయలుదేఱిపోయెను.

జనకమహారాజువంటి పరమజ్ఞానితో శాస్త్రములలో గూఢతత్త్వచర్చయందు బోట్లాడుట సామాన్య విషయముకాదు. మహాభారతములోని శాంతిపర్వమందుగల జనకసులభాసంవాదమంతయు పాఠయోగ్యమైనది. ఇందుచే నీప్రాచీనార్యలలనల గంభీరవిద్వత్తత సోదరీమణులకు సులభముగ తెలియును.

భారతదేశార్యవిదుషీమణులలో సులభవంటి వేదాంతజ్ఞచరిత్రము ప్రశంసార్హము.

## ఆత్మబలము

గుంటూరి వేంకటశాస్త్రిగారు

ఈసమస్తాపసీతల మిపుడె ఘోర
నిబిడహత్యలనిండిన నింపుగాక:
నాకు నలుసంత పిఱికితనంబులేదు
నామనోగతపథమున నడతునేను.
ఏమహాశక్తియిపుడు నాహృదయభావ
ములకుకారణము; అద్దియే పూర్ణసిద్ధి
కలుగజేయునునాకు నిక్కముప్రపూత
భావములు కార్యరూపము బడయుటెంత?

ఈమహాకార్యమున ప్రాణమిపుడెవీడ
నేనుసంసిద్ధుడను నాకు దానగల్గు
ఫలితమేమైన నీభూతపంచకమున
నిత్యతనుదాల్చి పనిచేసి నెగడుటొకటి.
ఏను కీర్త్యపకీర్తుల కేకరీతి
స్వాగతమొనర్తు నీలోకసంతతియెడ;
నీకయొనర్చుప్రయత్న మనింద్యమనుచు
స్వాగతమొసంగు నాకదే స్వర్గమూర్తి!

## తగదువగఁ జెంద నీపాదదాసికొరకు

దివాకర్ల వేంకటావధానిగారు

సవ్వడి నొకమారు నాలోఁనదలవంచి
నీచిత్రచర్యలన్నియుఁదలంచి
కనులఁగాల్వలుగట్ట మనవియోగమ్మున
కోపకయేడ్చెద నొక్కసారి
ఒకయప్పు డెదుట నీవున్నట్లుభావించి
కసిదీరఁగా బయల్ కౌగిలింతు

నింతకతనుఁడవై లి వేళాకోళయని చిత్త
ముడికింపఁదిట్టెద నొక్కమారు.
మరలివచ్చుట కింకను మాయదైవ
మననుకూలుఁడెకాఁబోలు నాత్మనాథ!
అడిగితివిగానఁ దెల్పితి నంతెకాని
తగదువగఁజెంద నీపాదదాసికొరకు.

# విధివ్రాత

మల్యాల వేంకటశేషగిరిరావుగారు

అది ఒకదివ్యరాజసౌధాంతర్గతభాగము. అచట నొకమేజాబల్ల. అది గజదంతనిర్మితంబయి ధవళకాంతులీనుచున్నది. బల్లపై రంగురంగుల బొమ్మల వరుస. ఎదుటనొక నవవయోవిలాసిని.

ఆమె బొమ్మలనలంకరించి వికసితవదనమున మురియుచున్నది. ఆహా! వికసితవదనమున విసుగుజనించినది. విసుగులో వెంగలితనము. వెంగలితనమున వింతచేష్టలు. హరిణిచూడ్కులవలె చంచలములగుచూడ్కులు. బొమ్మలనువీడి చటుక్కునలేచి ఒడలియాభరణములను బెఱికి నలుదిశలకు విసరివేసినది. కురులు విరియబోసినది. తిలకముచెరిపినది. వలువలనుత్యజించి తునుకతునుకలుగఁజీల్చి యందొక పెద్దతునకధరించినది. రాకొమారిత రాకాసియై దరిద్రురాలివలె నొక గాజుపాత్ర హస్తమునఁబట్టి "అమ్మా! బిచ్చము. బిచ్చము. దిక్కులేనిపక్షిని" అని దీనత్వమున ప్రతిబొమ్మను యాచింపమొదలిడినది.

నిర్జీవములగు ప్రతిమలకడనుండి యెట్టి ప్రత్యుత్తరమునుబడయక "అయ్యో! నాకర్మమిట్లుకాలినది. లేనియెడల మీరు నన్నాదరింపరా!" అని నేలఁగూలి ఉన్మాదినివలె రోదనముసేయుచు నిటునటు దొరలుచుండెను. కొండొకతడవునకు మరలలేచి ముందు నిలువుటద్దములోఁ దనవికృతాకారమునుగని విస్మితురాలయి "అక్కటా! ఏమి యీభిక్షుకివేసము? యీబిచ్చపాత్ర? ఎవ్వరును జూచియుండరుకదా!" అని లజ్జచెంది కళవళపాటుతో మంచివస్త్రములనుధరించి, శిరోజములను జక్కఁజేసి, తిలకమునుదిద్ది, యచటశయ్యపై నాసీనయై, తన కట్టిదుర్గతియేలకలుగవలెనని యాలోచించుచుండ దనయంతర్వాణి

"నీజనకుఁడు నేఁడు నిన్నెచ్చటకుఁబోవలదని శాసించియుండలేదా! నీకు బిచ్చమెత్తుయోగముకలదని యెఱింగి నీవు వీథినిబడి యాచింపకుండ నిన్నిట్లొనర్చెను" అని నుడివినట్లయెను.

"ఆహా! రారాజులకైన విధివ్రాతదప్పింప నెవరికశక్యము?" అని యామె యచ్చోటువీడెను.

# ప్రేమసమాధి

వేంకట కాళిదాస కవులు

[శైలాసమాధి. మజ్నూ శిథిలాశామతి. అతని విలాపగీతములు స్వర్గమును, భూమిని ఒక్క ముడిలో బంధించివైచినవి. జ్యోతిర్లోకమున కతనిగీతపరంపర పుష్పనిశ్రేణి. చుక్కయైన తన జెచ్చెలికొఱకు కతఁ డున్మాదతపస్వియైనాఁడు. ఆయవధి కతని ప్రేమైకహృదయము బాష్పాంజలిగాఁ గరఁగిపాఱినది.]

ప్రేమసమాధిఁ గోఁ బలుకరించెను నీయెద నన్ను; నాఁటియా
శామధురక్షణమ్ములకె చాచితి నాహృదయమ్మునెల్ల;— మ
ల్లీమసృణప్రసూనము మలీమసమై వసివాళ్లువారు నీ
యామిని వేళలన్ వెదకులాడెద నీ యెటనున్న కోసమో.
మనమనసుల్ సుమప్రణయమాధురి మూఁగతనంపుఁగోర్కె మం
తనముల నాడుకొన్నవి మిథస్స్ఫురితస్మితకాంతి; నీ కనుం
గోనల వెలింగిపోయిన నిగూఢరహస్స్మృతి లోకమందె చు
క్కనయి దెసల్ దెసల్ కలయఁగాంచెద నీకయి వేయికన్నులన్.
నందనపారిజాతసుమనస్స్మితకాంతుల వెల్గిపోవు నా
యందపుఁజిన్నిచుక్క! లయులా! యిట దూరపుఁబల్కరింతకై
తుందునుకల్ వడున్ మనసు తుంపెసలారు, భరింపలేనియీ
డెందమునందు నేఁడు నిబిడీకృతముక్ గళితాశ్రుమాలికల్.
ఇన్ని మెరుపులుమెరయు నీ చిన్నిమోయిలు
తునుక కురియులేదేమొక్క చినుకునైన;
ఏకభావమె రగులు నాహృదయమందుఁ
బొడము నేటికో బాష్పాంబువులు తడఁబడి.
నీవు నభఃపథమ్మున జనించితి చక్కని చిన్నిచుక్కవై,
నావిరిదోటకున్ దెరిచినావు వెలుంగులద్వారం; మాపువుం
దావులలోన నన్ బిలిచినావు స్వరంగణపాళినుండి; నా
కై విరియించినా వమృతహాసము నన్నొక చుక్కఁ జేయుచున్.

# స్త్రీవిద్యావిచారము

బంకుపల్లి సూర్యనారాయణశాస్త్రిగారు

కుటుంబమెల్లధర్మములకు, నెల్లనాగరికతలకు ప్రారంభము. కుటుంబమే సమస్తజాతిని ఉన్నతస్థితికి నడుపుయంత్రము. అట్టికుటుంబమునకు జీవనము స్త్రీ. స్త్రీయొక్క వ్యక్తిత్వమే సంఘజీవనమునం దాదర్శప్రాయమై జాతికంతకును ప్రతిబింబించుచుండును. అట్టిస్త్రీయే గృహమునకులక్ష్మి. సంఘమున కాభరణము. జాతికి ధర్మదేవత. సంఘముయొక్కగాని, జాతియొక్కగాని భావిభాగ్యోన్నతికి స్త్రీలే కారకురాండ్రు: జాతి విద్యావంతమై, నాగరికయుతమై, స్వాతంత్ర్యాభిలాషియగుటకు విద్వాంసులును, వీరాగ్రేసరులును, భగవద్భక్తులును దేశమునందుద్భవించవలెను. అట్టివారల నుద్భవింపచేయునది స్త్రీయే. శివాజిని యకళంకదేశభక్తునిగ జేసినది తల్లియేగదా! ఫ్రెంచిస్వాతంత్ర్యమునుబడసిన నెపోలియన్ విశ్వవిఖ్యాతకీర్తికి తల్లిసుశిక్షణయే కారణము. ధ్రువునిజ్ఞానతేజస్సును ప్రజ్వలింపజేసినది తల్లి. వేయేల! నేడు మనభారతదేశమున బురుషశ్రేష్టుడని విశ్వవిఖ్యాతిగాంచుచున్న గాంధిమహాత్ముని ధర్మనిష్ఠాపరాయణునిగా జేసినదెవరు? కాన నోభారతస్త్రీరత్నములారా! మనభావిభాగ్యోన్నతికి దొలుత మన రమణీరాజ్యము విద్యావంతముగావలయును. మరియు విద్యావతులైనగాని స్త్రీలు స్వధర్మమును గ్రహింపజాలరు. వారు స్త్రీధర్మమును గుర్తెరిగినగాని సంఘదురాచారములను నిర్భయముగా నెదుర్కొనలేరు. అతిబాల్యవివాహములు, నిర్బంధవైధవ్యము, కన్యావిక్రయములు, ఘోషా మొదలగు దురాచారములు స్త్రీవిద్యాశూన్యతకే కారణములగుచున్నవనుట సత్యదూరమగు విషయముగాదు. స్త్రీలు విద్యావతులగుచుండిన ఎట్టిబాల్యవివాహపిశాచమైనను విజృంభింపవిరమించును; ఎంతటి మితిమీరిన పూర్వాచారాపరాయణుడైనను నిర్బంధవైధవ్యమును విధింపవెఱచును; పూర్వాచారములకు విరుద్ధములయినను సరే లోకక్షేమకరమగు నాచారము సిద్ధమగునపుడు పూర్వాచారములను నిషేధించి తీరవలయును. కొందఱుస్త్రీలు పూర్వాచారములకుదాసులై లోకక్షేమకరమగు నాచారముగూర్చి స్వప్నములయందైన నాలోచించరు. అట్టిదానికి మూర్ఖతయే ముఖ్యకారణము. అట్టిమూర్ఖతను బారద్రోలునది విద్యయే. ఉన్నతవిద్యావతులగు స్త్రీరత్నములచేతనేగదా ఈపదిసంవత్సరములలో భారతనారీలోకమునందు నొకగొప్పమార్పు గలిగినది? దానప్రస్తుతమెట్టు విద్యావిధానము స్త్రీలకు విజ్ఞానాభివృద్ధి గలిగించునను విషయము విచారించవలయును. విద్యవలన వినయవివేకాదిసుగుణసంపద యలవడును. సుగుణసంపదగల్గినగాని సీమంతినులు శీలవతులుగాజాలరు. శీలమే సీతకు వన్నెదెచ్చినది. అగుట విద్య సచ్ఛీలద్యోతకముగ నుండవలయునని దేలినది. మరియు అంగనలు పాశ్చాత్యవిద్య నభ్యసించి యున్నతోద్యోగముల బడయవచ్చును. వారు పట్టభద్రురాండ్రుగావచ్చును. వారికి పురుషులతో బాటు సమానప్రతిపత్తి యుండవలయును. కనుక జ్ఞానసంపాదనకు బురుషులు జదివెడి గ్రంథములన్నియు స్త్రీలు జదువవలయును. కాని గృహనిర్వహణమున సమర్థతలేని గృహిణులు పాశ్చాత్యపట్టభద్రురాండ్రైననేమి? సామ్రాజ్యాధిషిక్తురాండ్రైననేమి?

కొన్ని విషయములలోమాత్రమే పురుషుని వ్యాపారముకంటె భిన్నముగ స్త్రీవ్యాపారముండును.

గానము, పాకముచేయుట, నూలువడకుట, కుట్టుపని, గృహమునుబిడ్డలను ఆరోగ్యపద్ధతిని నిర్మలముగానుంచుకొనుటకు తగుపారిశుద్ధ్యమునుదెల్పు వైద్యజ్ఞానముగూడ స్త్రీ లభ్యసింపవలసిన విద్యాభాగములే. అందు నొక్కొక్కటి ప్రత్యేకించి విచారింతము.

భగవంతుడు స్త్రీలకంఠమునందు బురుషునికంటె సహజమార్దవమును బ్రసాదించియున్నాడు. దానిని బట్టిచూడ స్త్రీలే విశేషముగా సంగీతమునభ్యసింప నుద్దేశించినట్లు స్పష్టమగుచున్నది. పాకముజేయుట స్త్రీల

గృహకృత్యములలోనిదేయని వేరచెప్పనక్కరలేదు. అట్టిపాకముచేయుటయందుగూడ సంస్కరణమావశ్యకము: ఆహారమునుస్వీకరించుట ఆరోగ్యముగా బ్రదికియుండుటకుగాని రుచికొఱకుగాదుగదా! మన మనశ్శరీరశక్తులు మనముభుజించు నాహారమునుబట్టియే యుండును: దాన నాహారమట్టిశక్తులను వృద్ధిచేయు సాత్వికాహారమై యుండవలయును. ఇప్పటి మనస్త్రీలు రుచియే ప్రధానముగజేసుకొని నానావిధమైన యనారోగ్యకరములగు వ్యంజనములతోను, పలురకములగు పంటకములను, ఊరగాయలను తయారుచేయుచు బహుధనమును, కాలమును వ్యయపఱచుచున్నారు. వారికి సహజమగు సాత్వికాహారము బలకరము, నారోగ్యదాయకమని తెలియదు. స్త్రీలకు ఆహారపారిశుద్ధ్యమును దెల్పు తద్విషయికమగుజ్ఞానమును వారు సంపాదింప ప్రయత్నపడవలయును.

స్త్రీలు తమవిశ్రాంతిసమయములలో వృథాకాలయాపనముచేయక నూలునువడకుచుండవలయును. వ్యవసాయము ప్రధానవృత్తిగాగల మనభారతదేశమందు పూర్వము రాట్నములు మగ్గములు ఉపవృత్తిగనుండి ప్రజాపోషణము చేయుచుండెడివి. మరియు నెట్టిఆదాయములేనిప్రజలకు నాదాయముకల్పించునది రాట్నమే. ముప్పదిమూడుకోట్ల భారతీయులకు గడుపునిండ నన్నమిడునట్టిరాట్నము ప్రభుత్వమువారు వచ్చినపిమ్మట మూలబడినట్టు ఒప్పుకొనక తప్పదుగదా? స్త్రీలు తమకుటుంబముకొఱకాహారవస్తువులను పాకముచేసి భర్తకును బిడ్డలకును ఇడునటుల వారికొఱకు వస్త్రములనుగూడ తామేతయారుచేయవలయును. మనము ప్రాణసంరక్షణమునకు పాకముచేసినయన్నమును కొనితెచ్చుకొనముగదా! అటులచేయుట హేయకృత్యము. అటులనే మానసంరక్షణమునకు గూడ వస్త్రములను విదేశములనుండి కొనితెచ్చుకొనుట హేయకృత్యమేయగును. స్త్రీ క్రమపద్ధతిని నూలువడకిన సంవత్సరకాలములో తమకుటుంబమునకువలయు నిరాడంబరమగు దుస్తులను తయారుచేయగలుగును.

కుట్టుపనిగూడ పైయంశములో నంతర్భూతమైనదే. తాముచేయు వస్త్రములను దుస్తులుగా తయారుచేయుటకు వారుకుట్టుపనిగూడ నేర్వవలయును.

ఇక దమగృహమును బిడ్డలును ఆరోగ్యపద్ధతిని పరిశుభ్రముగానుంచుకొనుటకు తగుపారిశుద్ధ్యజ్ఞానము గూడ స్త్రీలకుండవలయును. ఏగృహమున స్త్రీలు విద్యావతులుగనుందురో యట్టిగృహములు చెత్తలతోను, చట్లతోను, ధూళితోను నిండియుండునా? అట్టివారిబిడ్డలు మలినముగను, యనారోగ్యముగనుందురా? స్త్రీలు కొందఱు విద్యలేనికతమున నేగదా తమ వెఱ్ఱిప్రేమల బురస్కరించుకొని తమబిడ్డల భావియారోగ్యము నాలోచించక వారియల్లరిని బాపుకొనుటకై నానావిధములగు మిఠాయిలను, పంటకములను తినుమనిడుచుందురు? వారు తమబిడ్డల యారోగ్యమును కోరకుండుట శోచనీయము.

స్త్రీలు యీశ్వరవిషయికజ్ఞానముకొఱకు సదా ప్రయత్నపడవలయును. భగవంతుడు సర్వవ్యాపియని దెలసి నారాధింప విద్యావతులగు స్త్రీలు ఆమోదయోగ్యమగు నపరంజివంటివారు. సామాన్యముగా స్త్రీలలో దైవభక్తికలవారున్నారు. అట్టిది మతవిరహితమగు మూఢభక్తి. సార్థకమగునాచారముగాదు. అట్టివారు సదా ఆదాయమునకుమించి ధనమును నందికేశ్వరునినోములకును, వ్రతములకును వ్యయపఱచుచుందురు. ఎచ్చట విద్యావతులగు స్త్రీలుందురో నచ్చటజరుగు వివాహములు, పండుగలు మొదలగు నుత్సవములు నిరాడంబరముగ నుండును. అచ్చట ధనవ్యయము చాలమితముగ నుండును. అట్టిస్త్రీల జీవనము కేవలము నిరాడంబరమగు సత్యజీవనము.

సామాన్యముగా నగలనిన స్త్రీలకెక్కుడుప్రీతి. అట్టిది వారి యనాగరికసూచకమే. అట్టిచోట వారి విద్యాహీనతయే ప్రబలకారణము. విద్యలేనికతమున నేగదా మనకన్యలు వివాహములలో సువర్ణమునే తొలుతవరించుట? వారు సుగుణసంపత్తిగలవరుని వరించ మఱచిపోవుచున్నారు. స్వర్ణమోహమునవారు వివాహ

ములలో తగవులుగూడ పెట్టుకొనుచున్నారు. స్వర్ణమోహముననేగదా యనేకవివాహములు విచ్ఛిన్నములు గూడనగుట తటస్థించినవి? అట్టిస్త్రీలేగదా తఱుచు తమభర్తలనగలకొఱకు పీడించుచుందురు? అట్టివారేగదా తమకర్ణనాసికములకు రంధ్రములు పొడిపించి కాయక్లేశమునైన సహింతురుగాని తామనుకొను సౌందర్యమును పోనిచ్చగింపరు? ఇంతకంటె నజ్ఞానము వేఱుండునా? విద్దకేర్చినముద్దియ భూషణముల నిచ్చగించునా? సహజసౌందర్యమునే యపేక్షించును. ఆశ్రమవాసియగు శకుంతల సౌందర్యవతికాదని యెవరనగలరు? పతివ్రతయగుపడతి భూషణముల నతిహేయముగా జూచుననుటకు: భాగవతమున—కనకవతీపురమున నొక్క ధరామరుని కన్యకారత్నంబుగలదు. అవ్వధూతిలకము రత్నసమేతంబులగు కంకణంబులుధరియించి బంధుజనంబులకు పరమాహ్లాదంబుగా నన్నంబు గావించుకొఱకు శాలితండులంబులు దంచగా నపుడు ముసలగ్రహణఘాతంబున కంకణంబులతిరావంబుగా మ్రోయుచుండ నప్పరమపతివ్రత వందుల కసహ్యపడి యన్నియుడులిచె. కనుక నో భారతసతీరత్నములారా! షడ్గుణైశ్వర్య సంపన్నులగుస్త్రీలు భగవదాయత్తచిత్తంబున ప్రసన్నచిత్తలై క్షుద్రములగు నలంకారములను అనిత్యంబులుగా దలంతురుగాక!

స్త్రీలు విద్యావతులగుదురేని నిచ్చలు గృహకృత్యములను సమర్థతతో క్రమపద్ధతిని నిర్వహించుకొనుచు పగలెల్ల కష్టపడివచ్చిన తమభర్తలకు వినోదముగలిగించువిషయములను మృదుమధురముగా ముచ్చటించుచు వారి శ్రమ నివారణచేయుదురు. ఎంతవైపరీత్యము! విద్యలేనికతముననేగదా స్త్రీలు సామాన్యముగా స్వప్రయోజనాపరులై గృహమున తోడివారిదుఃఖములను దెలుసుకొనలేక ఆత్మజ్ఞానశూన్యలై జాలిలేక వారిదుఃఖములను వారింపకపోవుటయేగాక, వారెంతసేపు విచారించినను తమకు నగలులేవనియు, వస్త్రములులేవనియు తలపోయుచుందురు? అట్టివారేగదా స్వాతంత్ర్యములేమింజేసి తమమాటచెల్లనపుడు తఱుచురోగముల నెపమున బురుషుల నొడబఱచి నిష్టార్థమును సాధించుచుందురు? అట్టివారియెదుటనే గదా పురుషులు పాండిత్యమునందెంత ప్రజ్ఞగలవారై బయటపూజ్యులుగ పరిగణింపబడుచున్నను యిలుచేరగనే నోరెత్తలేక వర్తించుచుందురు? మరియు నట్టిస్త్రీలేగదా బాల్యవివాహదేవత నారాధింతురు. విద్యావతులగు తల్లులు తమబిడ్డల మానసికశారీరకశక్తులనుగాపాడుచు ప్రేమింతురు. అట్టిదే నిజమగుప్రేమ. తల్లులు తమముచ్చటను పురస్కరించుకొనిగదా తమపసిబాలికల మెడలకు బండరాతులను గట్టబెట్టుచున్నారు? మరియు వారి యకాలసంతానములకు స్వాగతమిచ్చుచున్నారు. ఇట్టి యనేకములగు సాంఘికదురాచారములకు స్త్రీవిద్యాశూన్యతయే మూలకారణము. బాలురకువలె బాలికలకుగూడ విద్యనభ్యసింపజేయవలయును. మరియు బురుషులవలె బాలికలకు నయసువచ్చునంతకు వారి వివాహములగూర్చి తలపెట్టగూడదు. వివాహమయినతరువాత గూడ భర్త భార్యకు క్రమపద్ధతిని విద్య నేర్పవలయును. విద్యావంతుడగు బురుషునకును, విద్యావిహీనురాలగు స్త్రీకిని తుచ్ఛమగు నింద్రియసుఖవిషయములందు దప్ప మహోత్కృష్టమగు నీశ్వరసేవయందెంతమాత్ర మైక్యముండదు: గృహస్థునకు నీశ్వరసేవయే పరమధర్మము: గృహిణులను జేబట్టుట నట్టిధర్మవృద్ధికొఱకుగదా?

# ఉద్బోధన

సామవేదం జానకీరామశర్మగారు

"కారెమపూడిపట్టణముఖంబున వైరులతోఁ బెనంగగాఁ
జేరెనుతండ్రి, ఇంతమదిఁజేయవు రోచన, వైరివీరసం
హారపరాక్రమక్రమవిహారనిబద్ధహృదంతరుండవై
పోరున కేఁగఁగన్ బిరుదుపోటుమగండనఁ జెల్లుకై వడిన్.

ఆనలగామరాజు తనయంత ప్రభుం డిఁక లేఁడఁటంచు గ
ర్వమున కన్నుఁగానక పరాభవమెంచక నీదుతండ్రితోఁ
బూనెరణమ్ము. నీవిఁక నుబోయి సహాయమొసర్పుమో ప్రతా
పానలయుక్త! వైరినిచయమ్మును భస్మమొనర్చివేడుకన్.
తాతయుఁ దండ్రియున్ బహువిధమ్ములఁ గీర్తిఁ గాంచియుంట, నీ
చేఁతకు లోకమెల్ల తనచిత్తములో వ్యధనొందునట్టి యీ
నీతికి దూరకూతనువు నీవు ధరించిమనంగనేల? కో
పాతిశయమ్ము పూని, రణమందున నిల్వుము ఖడ్గపాణివై.

కరిగిపోసిన శౌర్యంపుఖని యతఁడు
బ్రహ్మనాయఁడు వైరులపాలిమృత్యు
వతనికొమరుండ వీవాఁకరుగకున్న
నహితగణమెల్ల తలఁచి బిట్టపహసించు.

ఓరతిరాజరూప! మనమూరక భోగములందుఁ జొన్పి స్వే
చ్ఛారహితప్రవృత్తి మరుశాసనతీవ్రతకోడి, వంశపుం
గౌరవమెల్ల నేటఁబడఁగా నిట జాగొనరింతువేల? సం
హారమొనర్చి శత్రుల మహాద్యశముం గడియింపుమెల్లెడన్.
బ్రతికిన రెండునాళ్లు నపవాదుభరింపక, పౌరుషంబు, స
న్మతియును జ్ఞానముం గలుగుమాడ్కి. మనన్వలె, లేదపోని, జీ
వితముకు స్వస్తి చెప్పవలె, వీరునిలక్షణమిద్ది, ఆత్మ నీ
గతిఁ దలపోసి చేయఁదగు కర్జమునెన్నుము వీరపుంగవా!
ఎత్తిననీకృపాణమున నేర్పడఁగా రుధిరస్రవంతి ప్రో
న్మత్తగజద్విషన్నికరమారణముం బొనరించి, శీఘ్రమే
వత్తువు ప్రాణనాథ! కరవాలమిదే గయికొమ్ము కూడ తో
డైత్తువు పో జయాంగనను దేజమునల్గడలందు నింపుచున్.
నీకిటమంచిచెడ్డలను నేర్పఁగనాదునే? ఉగ్గుబాలతో
మీకులనాములెల్లరును మ్రింగిరి శౌర్యరసము జ్ఞప్తికె
వాకొనియుంటినిట్లు, రణవర్థితశౌర్యరసైకయుక్త నా
థా! కమలామనోహరుఁడు తా విజయమ్మొసఁగూర్చివేడుకన్."

(తన సౌందర్యరసావగాహనమున సంగరప్రసక్తిని మఱచిన బాలచంద్రుని వీరనారి మాంచాలయుద్ధమునకుఁ బ్రేరేచుచున్న మాటలు.)

*

* *

# విధి

ఆకాసమునిండ కాఱుమబ్బులు కమ్మివేసినవి. తుఫానుగాలి తీవ్రముగ విసరుచు భయముకలిగించుచున్నది. సముద్రపు కెరటాలు మహాభయంకరముగా లేచి గర్జించుచు నురుగులుగ్రక్కుచు ఒడ్డును వేగముగా కొట్టుచున్నవి. ఇట్టిసమయమున సముద్రముమీద ప్రయాణము ప్రాణమునకు మోసమే. సాహసించిపోయిన చావవలసివచ్చును. నేటికి ఈకొండమీదనే కాలముగడుపుదును.

వేటకుపోదమన్నను ఈదారి మిగుల ఇరుకటమైనది. అడవిలో ప్రవేశించిన కటికచీకటియే కదా. ఏచెట్టునీడ ఏచిఱుతలుండునో, ఏపొదల చాటున ఏసింహాపుపిల్లలాడుచుండునో! వేటకుకూడ తగినసమయముకాదిది.

ఆకాశమున మబ్బుతెరవిడిపోయి, సముద్రముశాంతపడి, వాయువు నెమ్మదిగావీచునప్పుడు అపాయములేకుండపోవచ్చును.

ఈకొండ మిక్కిలి ఎత్తయినది. కెరటాలు ఇంతవఱకురాలేవు. తుఫాను తగ్గువఱకు నేను ఇక్కడ సురక్షితముగానుండవచ్చును.

సముద్రముమీద ప్రయాణమైపోయిన జనులు నిరపాయముగా తిరిగివచ్చిరి. తెప్పమీద చేపలనుపట్టుటకుపోయినపల్లెవాడును కుశలముగా మరలివచ్చెను. పేరడవిలోనికి వేటాడుటకుపోయిన బోయవాడును సంతోషముతో వచ్చివేసెను. మెట్టమీదను కట్టినపట్టణమె భూమికంపింపగా క్రిందికి బోరగిల్లెను.

రచయిత
కల్యాణసింగ్ గారు

* *

*

# జయలక్ష్మి దినచర్య

కాళహస్తి పాపయ్య దేవరగారు

ప్రత్యూషకాలమందమలయవాయువు చల్లచల్లగావీచుచు జయలక్ష్మిని మేలుకొల్పెను. లేచి కాలకృత్యములుదీర్చుకొని, కుంకుమతిలకముపెట్టుకొని, ధవళవస్త్రములుధరించి, గృహకృత్యములుదీర్ప మొదలిడెను. ముస్ముందు కల్లాపుజల్లి ముగ్గులుపెట్టెను. ఇంతలో బిడ్డలులేచిరి. వారందరికి ముఖప్రక్షాళనగావించి, స్నానముచేయించి, శుభ్రమైన వస్త్రములుకట్టనిచ్చి, వంటశాలకేగి, భర్తకు కాఫీఅలవాటుగాన, కాఫీ, ఉప్మాలు తయారుగావించి, అలవాటైన పెద్దకుమారుడు ప్రభాకరునకు, రెండవవాడు సుబ్బరాయునకు కాఫీ వుప్మాలుపెట్టి బడికిఅంపివేసెను. పిమ్మట ఒక పెద్దగ్లాసుతో కాఫీయు పెరటిలోయున్న అరిటాకు కోసితెచ్చి, జలముచే శుభ్రపరచి, అందు ఉప్మాయుంచి, వసారాలో ఒకకుర్చీయందు ఆసీనుడైయున్న భర్తకడకేతెంచి ముందిడెను. పిమ్మట భర్తతో 'యేమండి? మీకుజీతము హెచ్చించెదరు అనిచెప్పేరు. యింకను జేయలేదా?' యనిప్రశ్నించెను. భర్తయగు మాధవరావు చేయుచున్నపని పావలనుంచి 'జోను పైయధికారికి నాయందు అమితానురాగముగలదు. ఈనెలలో జేసెదనని జెప్పినాడు' అనెను.

జయలక్ష్మి 'చూడండీ, చూడండీ కాఫీ చల్లారిపోతుందెమొ తీసుకోండి' యని మరల వంటశాలకేగి తనకుమార్తె సరళకు కాఫీ మున్నగునవియిచ్చి కొంత తానుతీసుకొనెను. తరువాత భర్తకడకేతెంచి యీపూట యేకూర వండమంటారండి యనిఅడిగెను. మాధవరావు నవ్వుచు నీకు నచ్చినకూరవండుము అని బట్టలుధరించి ఆఫీసుకు వెళ్ళుచుండెను. నిన్న మీరు చాలాఆలస్యముగావచ్చేరు. ఈరోజున త్వరగారావలయునుమండియని నెమ్మదిగాఅనెను జయలక్ష్మి. అలాగునచేయుని తలఊపుచు వెడలిపోయెను భర్త. మరల జయలక్ష్మి తనకుమార్తెతో వంటశాలకేగి మధ్యాహ్నపాకములు తయారుగావించుచుండెను. భర్తకు చిక్కుడుకాయలన్న మహాయిష్టము. పెరటిలోనికివెళ్ళి కొన్నిచిక్కుడుకాయలు కోసికొనిరమ్మ అని సరళనుపంపెను. సరళజని అపూటకువలయు చిక్కుడుకాయలకోసితెచ్చి జననికిఇచ్చెను. చిక్కుడుకాయలు, ములక్కాడలు తరిగి శాకములు తయారుగావించెను. పెద్ద కుమారుడగు ప్రభాకరునకు కందిపప్పుయనిన యిష్టమని కందిపప్పు తయారుగావించెను. ఇంతలో బడిలోనుండి పిల్లలేతెంచిరి. కళకళమంటు గృహమున్నది. కొంతవడికి మాధవరావు ఆఫీసునుండివచ్చెను. జయలక్ష్మి భర్తకు పిల్లలకు వరసేసారివడ్డించెను. భర్తకు చిక్కుడుగింజలు యేరి వడ్డించెను. అదిజూచి సుబ్బారాయుడు అ ఆ నాన్నకు ఎక్కువగింజలు వడ్డించేవు అని అనెను. కాదురా యవియనిన వారికిష్టము. నీకు రేపుయెక్కువ వడ్డించెదనులే యని సమాధానముచెప్పినను వినినవాడు కాడు. నాన్నయెక్కువేంటి నాకు అన్నీపెట్టితేగాని నేను భోజనముచేయను అనెను. మాధవరావు సుబ్బారాయుని గడుసుదనమునకు చిరునవ్వునవ్వుచు తనకువడ్డించినవాటిలో కొన్ని సుబ్బారాయునకిచ్చెను. మజ్జిగ యీవేళ గొల్లది మంచిదియిచ్చినదికాదండీ యనుచు అందు నిమ్మకాయలరసంపిండుచు మహాత్ముడు నిమ్మకాయలను చాలాప్రేమిస్తాడు అంటు ఆచల్లని అమృతముగామార్చి అందరకువడ్డించెను. తృప్తిగాభుజించి మాధవరావు ఆఫీసుకువెడలిపోయెను. పిల్లలు బడికివెళ్ళిరి. చిన్నపిల్లవానికి నిద్రవచ్చుటచే వతనిని పరుపుపై పరుండబెట్టి కూతురును తానును భోజనముజేసి కొంతసేపు పరుండెదమని వసారలోచాపవైచి పరుండబోయి గంపంతపని యింటనుండ పోమరిపోతువలె పరుండుట యేమనిఅనుకొని కూతురు సాయమున కొంతసెనగపిండి విసిరి ఆఫీసులో అలసి పనిజేసివచ్చుభర్తకు ఫలహారముజేయుతలంపుతో త్వరితగమనమున కొన్నివడలు తయారుగావించెను. సాయంకాలము నాలుగైనది. పిల్లలు బడినుండియేతెంచినారు. వారికికొన్నిపెట్టి భర్తకుకొన్నితీసి సిద్ధముజేసి భర్తకొరకు ఎదురుజూచుచుండెను. వీధిలో సుబ్బారాయుడు తనయీడుపిల్లలను జేరదీసి

ఆవీధిలోనున్న పెద్దదూలమును తిరుగద్రోయుటకు ప్రయత్నించుచుండెను. ఇంతలో అతని చిన్నసోదరుడు ఆరేండ్లబాలుడు ఆదూలముపైకూర్చుండెను. ఇతరబాలు రెంత చెప్పినను లేవలేదు. ఈవినోదములన్నియు వ్యర్థములని తలపోయుతమ్ముని గాంచి ఉగ్రుడై సుబ్బారాయుడు వెంటనే దిగెదవా లేదా యని గద్దించెను. ఆ బాలుడు ఆదూలముమీదనే కొంతదూరము జరిగి కూర్చుండెను. సుబ్బారాయుడు ఇతరబాలురయెదుట తన పెద్దతనము గన్పరుప దూలముతిరుగద్రోయుమనెను. దూలముపైగూర్చున్న బాలుడు దిగినతన ఆత్మగౌరవమునకు లోపమువచ్చునేమోయని కాబోలు కదలక బిగిసికూర్చుండెను. అంతబాలురు తమశక్తికొలది ఆదూలమును తిరుగద్రోసిరి. దూలముదొర్లిపోయెను, బాలుడు వెనుకకుపడెను. తోడనేలేచి యేడుస్తూ గృహమున ప్రవేశించెను. జయలక్ష్మి భర్తకొరకెదురుజూచుచుండెను. ఇంతలో యీరోదనధ్వనివిని వీధిద్వారముచెంతకు వచ్చెను. జరిగినదంతయు నడిగి తెలుసుకొనెను. సుబ్బారాయుడు నచ్చటనేయుండుటచే బాలుడునంతయు తల్లికిచెప్పెను. జయలక్ష్మి సుబ్బారాయునివీక్షించి యిది నిజమేనా యని యడిగెను. ఆకొంటిపిల్లవాడు కాదమ్మా మేమాడుకొనుచుండ మామధ్యకువచ్చి మాయాటచెరిపి పైగాదూలముమీదనుండి మామీదకు దుమికి పడెను అని అనృతమాడెను. వీరిద్వరమాటలువిని సుబ్బారాయుని మాటలందు నమ్మకములేక బాలుని మాటలందు నమ్మకమున్నదని గ్రహించి యిద్దరిని లోనికితీసుకువెళ్ళి బాలునికి రెండుపడలు సుబ్బారాయునికి ఒకపడయునిచ్చి సుబ్బారాయునితో ఎన్నడు అనృతమాడవద్దు. అనృతమాడిన కష్టములపాలయ్యెదవు అని బుజ్జగించెను. ఇంతలో మాధవరావు గృహమున ప్రవేశించెను. సరళ పాదప్రక్షాలనకై నీళ్ళిచ్చెను. పాదప్రక్షాలనగావించుకొని వసారాలోనున్న నొకకుర్చీపై అబ్బాయనుచు నిట్టూర్పువిడుచుచు కూర్చుండెను. చిన్నబాలుడు "నాన్నా! నాన్నా!" యని చెంతకుజేరెను. జయలక్ష్మి లోనికేగి భర్తకు ఫలహారముదెచ్చి యుంచెను. అచ్చటనేయున్న నొకచిన్నబల్లపై నాసీనుడైన మాధవరావు ఫలహారమునుగాంచి ఓహో! యీరోజున క్రొత్తరకమువండేవేయని తినుట ప్రారంభించెను. ఇంతలో సుబ్బారాయు డెచ్చటనుండియొ పర్వెత్తుకువచ్చి నాన్న, అమ్మనాకు చాలాతక్కువబెట్టెను అనెను. ఆ నీకు తక్కువపెట్టినాయని నవ్వుచు వానికొకటి యిచ్చెను. ఇదివినుచుండిన జయలక్ష్మి యేమిరా! అల్లరిపిల్లవాడు, నీకు నేను తక్కువపెట్టినానా యని దగ్గరకుజేరదీసి బుగ్గలునులిమెను. ప్రభాకరుడు యేవోపుస్తకములు చదువుకొనుచు ఒకయెడకూర్చుండెను. సరళ జనకుడు సంపాదించినకదా మనమింత తినునది యని అనుకొను స్వభావముగలబాలిక. గుణములకుప్ప. ఎల్లప్పుడు జననికిచేదోడై యింటిపనులయందు కొంతభాగము నిర్వర్తించెడిది. పన్నెండేండ్లబాలిక. నావల గదిలో తమ్ములచొక్కాలు కుట్టుచుండెను. సూర్యభగవాను డస్తాద్రికేగుచుండెను. ఆసమయమున ఆగది యందు మాధవరావు జయలక్ష్మిమాత్రముండిరి. వారిట్లు సంభాషింపదొడంగిరి.

జ—ఏమండీ! అమ్మాయికి వివాహవయసు పైబడుచుండెను. వివాహప్రయత్నము జేయరేమండి?

మా—అప్పుడే తొందరేమి? చూడు. చిన్నతనములో వివాహముజేసినందువలన బాలవితంతువు లెందరుండిరో! పాపము వారిగతియేమియొుగదా? మనమ్మాయికి రజస్వలానంతర వివాహముగావించెదను. దైవమున్నాడు. వాని కెప్పుడుదోచిన అప్పుడే జరుగును. తొందరయేమి?

జ—ఏమండీ! దైవమందురేమి? మనము కార్యమందుదిగకున్న దైవమువచ్చి చేయునా?

మా—ఓపిచ్చిదాన! మనపూర్వజన్మార్జితపుణ్యపాపకర్మలకే దైవమనినామము. అది మానవుల మంచి చెడ్డలకు, సుఖదుఃఖములకు, అదృష్టదురదృష్టములకు గారణము. బండిచక్రమువలె కర్మబద్ధుడైన ప్రాణియు, పూర్వకర్మవాసననుబట్టి ఒకప్పు డున్నతస్థితిని, మరియొక్కప్పుడు నీచస్థితినిగాంచును. మనకు తెలియకుండగనే దైవ ముచ్చనీచస్థితులను దెచ్చిపెట్టుచుండును. మనగృహమునగల పంజరములోనున్నచిలుక మన

పెట్టుపోతలకులోనై చూచుచుండునట్లు దైవముగల్గించుచున్న సుఖదుఃఖములను, హృదయపూర్వకముగా తీసుకొని అనుభవించవలెను. తప్పించుకొన వశక్యముగాదు.

జ__నిజమేనండీ. దైవముపై భారమువేస్తూ మనప్రయత్నముండవలయును, కాదండీ.

మా__ఔను. నిజమే.

ఇంతలో సంజెచీకట్లు అలుముకొనజొచ్చెను. జయలక్ష్మి సరళతో లాంపులువెలిగించమని చెప్పి వంటశాలకేగి భోజనపదార్థములన్నియు నొకగంటకాలములో తయారుగావించెను. బాలుడు అమ్మా! అన్నము పెట్టవేయని తల్లిచెంతకుజేరెను. వెంటనే బాలురకువడ్డించి చిన్నపిల్లవానికి అన్నముతినిపించి పరుండబెట్టెను. పిమ్మట భర్తకు, మామకు భోజనమువడ్డించి తను యింతతిని వంటగృహమున అన్నియు చక్కబెట్టుకొని రాగి చెంబుతో జలముతీసికొని తమలపాకులపెట్టెతో శయ్యాగారమున ప్రవేశించెను. మాధవరావు యేవో ఆఫీసు కాగితములు వ్రాసికొనుచుండెను. జయలక్ష్మి నొకబల్లపైకూర్చుండి తమలపాకులకు సున్నము వ్రాయుచుండెను. మాధవరావు పనిముగించి భార్యచేయుపనివిజూచి చిరునగవుమోమున సంకురింప మంచినీరును అడిగెను. వెంటనే జయలక్ష్మి నీటిచెంబునిచ్చి విడియములు చేతికందిచ్చెను. అవి మాధవరావు నములుచు మనప్రభాకరుని స్కూల్ ఫైనల్ పరీక్ష చదివించవలయునన్నాడు. జయలక్ష్మి వాడెలాగును చదువుతాడుగాని మన సుబ్బారాయుడుమాత్రము బొత్తిగా బండవాడగుచున్నాడండీ అనెను. ఔను బొత్తిగా బండఅవుతున్నాడు. ఇక జాగ్రత్తగాఉండవలెను అని అతడు జయలక్ష్మికరముగ్రహించి "జయలక్ష్మీ" యని యూరుకొనెను. ఏమండీ అట్లూరుకొన్నారేమి? నాచేసైన తప్పావర్చ్చెనా? లేక గృహపరిపాలనయందు లోపమున్న క్షమించవలెను అనెను. ఆమాటలువిని మాధవరావు నవ్వుచు లేమియులోపములేదు. నీవంటియుత్తమురాలిని నేను భార్యగాబడయుభాగ్యము చేకూర్చినందులకు భగవంతునకు నాకృతజ్ఞతావందనములర్పించుచున్నాను. అని ఆమెను ప్రేమతో నెమ్మదిగాకొట్టెను. ఇట్లు జయలక్ష్మి దినములు హాయిగా వెళ్లబుచ్చుచుండెను.

## హృదయనైవేద్యము

శ్రీమతి ఎ. సీతారామమ్మగారు

శా. శ్రీసీతాసతి యంకసీమవరలన్, సింహాసనస్థుండవై
భాసిల్లన్, భరతాదిసోదరులు కొల్వన్, చామరచ్ఛత్రముల్
వాసింగైకొని, చెంత పావని పదాబ్జాతంబుపట్టంగ, సం
తోసంబొప్ప, జగంబునోము, నినుగొల్తున్ రామచంద్రప్రభూ!

మ. నను నీభక్తపదాబ్జరేణువను, దీనన్ వ్యాధిసంభగ్నగా
నొనరింపందగునయ్య, నేనుకవు భక్త్యోపాసనాగీతముల్
విన నీకిష్టముకాదొ, నాహృదయనైవేద్యంబు, వాక్పుష్పికా
ర్చనమున్ హృద్యముగావొ తెల్పుము, రమేశా! రామచంద్రప్రభూ!

మ. పదముల్ నీకు ప్రదక్షిణంబునొనరింపన్, హస్తముల్ మంగళా
స్పదమౌ నీపదమంట, జిహ్వ నిను సంప్రార్థింప, గన్నుల్ నినున్
ముదమొందం గనజాలకున్నను మనమ్మున్ సత్కృపన్ నావశం
వదముంజేసితి వంతెచాలు నిక దేవా! రామచంద్రప్రభూ!

# పతిభక్తియే విశ్వపతిభక్తి

శ్రీమతి వా. సరస్వతిగారు

సతిసలిపెడు పతిభక్తియే విశ్వపతిభక్తికి ప్రథమసోపానము. నరుడు తాను విశ్వమును దాటిపోవలయుననిన, యతడు సర్వశక్తిసమన్వితుడును, సర్వకరుణామూర్తియు నగు భగవంతునివైపునకు దృష్టిమరలించి వానిపాదములను యాశ్రయింపవలయును. భక్తితత్వముచే తానుసులువుగా భగవంతుని దరిచేరుచున్నాడు. అట్లే సతియు తాను భగవంతునిచేరవలయునన్న ప్రప్రథమమున పతియందు భక్తినిలిపి పతియే భగవంతుని భిన్నరూపమని తలంచి పతియందు భక్తిగలదై యుండవలెను. భక్తుడు భగవంతునియందు లీనముగాకున్న యతనికి భగవద్భక్తి యలవడలేదనియర్థము. భక్తిచే భక్తుడు భగవంతునియందు లీనమగునట్లు పతిభక్తిచే సతి పతియందు లీనమగుచున్నది. భక్తుడు తన స్వాస్థ్యమును భగవంతునిచరణములకు సమర్పింపవలయును. ఇది సతియొక్క పతిభక్తి, భక్తుని భగవద్భక్తివలె గన్పట్టుచున్నది. పతియేభగవంతుడనిదలచి వానిలో భక్తిద్వారా లీనమగుటకు నెంచుటచే సతి పవిత్రతజెందుచున్నది.

పతిభక్తి లేకపోయినయెడల వేయియుపవాసములుచేసినను, లక్షవ్రతములుచేసినను, కోటితీర్థయాత్రలుసేవించినను పుణ్యలోకములుగలుగుట కల్ల. పతిభక్తిగలిగియున్న పైజెప్పిన వానిలో నొకటేనియులేక పుణ్యలోకప్రాప్తిగలుగును. కావున సతులకెల్లరకు పతిభక్తి ముఖ్యమైనది. ఈపతిభక్తి నిశ్చలమైనదిగానున్న, నిజమైనదిగానున్న, మనస్ఫూర్తియైనదిగానున్న యుండవలయును. ఈభక్తి ఫలాపేక్షతోకూడియుండరాదు. భర్త్రప్రయోజనకారుడై, ధనార్జనపరుడై యున్నప్పుడు లేనిపోని వినయములుజూపుట భక్తిగాదు. ధనమునుగూర్చి ధనవంతునికి యనేకులు ప్రేమ, భక్తి, వినయ, గౌరవములను జూపుచున్నారు. అవి వానివ్యక్తికి సంబంధించినవికావు. అవి వానిధనమునకు సంబంధించినవి. నిజమైనభక్తి యట్లుండరాదు. అది నిజమైనభక్తిగాదు. భక్తిప్రేమలకు పాత్రుడగునతడు హీనస్థితియందున్నను, వానిప్రియుడు వానికి భక్తిప్రేమలంజూపవలయును. తండ్రియాజ్ఞనుపాలింప రాముడడవులపాలైనను, సీతకు రామునియందుగల భక్తిప్రేమలకు ఏమాత్రము భంగముగలుగలేదు. కావున నిజమైనపతిభక్తి యట్లుండవలయును. సీతకు రామునియందు భక్తిప్రేమలు గలయట్లు, పతిభక్తిప్రేమలు గలిగియున్న స్త్రీలను యార్యసంఘమున పెక్కండ్రగాంచనగును. రాధయొక్క పతిప్రేమయే భగవత్ప్రేమరూపమున పరిణమించినది. పతిభక్తిచే పెక్కండ్రు ఆర్యసతులు పెక్కువిచిత్రమైన ఘనకార్యములనుచేసిరి. సావిత్రి పతిభక్తిచే యమునిజయించి మృతుడైన పతిని బ్రదికింపగలిగినది. అనసూయ తన్నుపరీక్షింపవచ్చిన త్రిమూర్తులను బాలురుగాజేయగలిగినది. చూచితిరా పతిభక్తిలో ఎట్టిమాహాత్మ్యమున్నదో! కావున పతిభక్తివలన భగవంతుని కడుసులువుగాచేరగలరు.

లోకములో సతియైజన్మించినందుకు పతిభక్తియే తారకము. సంసారసాగరమును తరింపవలయునన్న పడతికి పతిభక్తియే నావ. విషయసౌఖ్యపిశాచములను దరుమవలయునన్న సతికి తనపతినామమంత్రమే ముఖ్యము. కలుషాంధకారముల నణగించుటకు పతిభక్తియే దివ్యమైనకాటుక. సతిజీవయాత్రకు పతిభక్తియే రాజబాట. సతి పుణ్యలోకముచేరవలయునన్న పతిభక్తియే ముఖ్యసాధనము. అత్రిముని తనసతియైన యనసూయ కీక్రిందినీతివాక్యము లుపదేశించెను:

గీ. "సత్కులజుడైన, మిగులదుర్జాతుడైన, రూపవంతుడైన, కురూపియైన,
భూతదయుడైన, సతినిరుపేదయైన, నీశ్వరుడు కాంతకపుడు ప్రాణేశ్వరుండె."

గీ. "పతియెదైవంబుగాను, పతిపాదతీర్థసేవనమె సంతతము తనజీవనముగ
ధవునిచింతనమె పరమమంత్రంబుగాగ కాంత తనలోకయాత్రను గడుపవలయు."

ఇకను విధవయైన యార్యసతివిషయమేమనిన. వైధవ్యమొందిన యార్యసతికి జగత్పతియే పతి. కావున యామెకు పతిభక్తియు, దాంపత్యప్రేమయు సహజముగా భగవద్భక్తిగా మారును. దైవమే తనచిత్తేశునిగాదలంచి యతనినే ప్రణయభాజనునిగానెంచి, సేవించుచు సతీధర్మమాచరింతురు. భగవంతునే పతిగా మదినిల్పి యార్యసంఘపుకట్టుబాటులను రీతినీతులనతిక్రమింపక సువాసినుల (పేరటాండ్రు) విధంబున పతిభక్తినలుపుచు, తద్వారా దైవభక్తి నభ్యసింతురు. ఇట్టివారు తాముయు తీర్ణులగుటయేగాక లోకములోని నారీమణులకు మార్గదర్శకులగుచున్నారు. పతి పరలోకమునకరగినపిదప దేవుడే పతియనితలంతురు. కావున పతిలేనివారు జగత్పతినే పతిగాతలంపనగు.

కావున పతిభక్తియే జగత్పతిభక్తికి తొలిమెట్టు.

## ఉదయము

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

౧

మేల్మిరంగులచీరలు మేనదాల్చి
ప్రాగ్దిశాంగన దనరెను ప్రభలతోడ
లోకరక్షకుడైన ప్రభాకరునకు
స్వాగతమునొసగుచున్నట్టి చందమొప్ప.

౨

అరుణరుచులతోడ నరుణోదయంబయ్యె
జ్ఞానసూర్యుడొప్పె గగనమందు
నిద్రజెందనేల నిన్ను నీవు మఱచి
వేగమేలుకొనవె వెఱ్ఱిమనస!

౩

మేలుకో జీవమా! వేగ మేలుకొనవె
అంధకారములోబడి యడలనేల
దివ్యజ్యోతియె యాత్మయైదేజరిల్ల
మఱచినిద్రించెదేలకో మహిమదప్పి.

# ఎవరిని మెచ్చుకొందురు?

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

౧

"లోకం అతిచెడ్డది. తమకు ఎట్టిసంబంధములేని విషయాలలోకూడా లేనిపోనిజోక్యం కలుగజేసుకొని అమాయకులగు మానవుల భావిజీవితానికి అడ్డుతగిలేదుర్జనులు లోకంలోఉన్నారు. భాగ్యవంతులు తమకు లొంగిఉండే బీదలను పెక్కువిధముల పరిహాసంపాలుచేస్తారు. అదేమి అన్యాయమోగాని పరాత్పరుడు ఎంత బీదవాడికైనా అభిమానమును గల్పించియున్నాడు. అభిమానమును చంపుకొని, పొట్టకూటికి ధనికులసేమాట లనుపడుతూ లోలోపలకుమిలి కుళ్ళిపోతున్నారు లోకంలో ఎంతోమందిబీదలు. ధనికులేమిజేసినా లోకం మాట్లాడదు. కులటనుతీసుకొనివచ్చి ధనికుడు గృహంలోఉంచినా స్వయంవరంవల్లజరిగిన క్రొత్తతీరువివాహమని లోకం సమర్థిస్తుంది; కవులు పద్యాలతో పొగిడేస్తారు. గర్భదరిద్రుడు మనసార ఒకయువతిని ప్రేమించి సక్రమపద్ధతిని వివాహమాడదలచినపుడు, ఆవిషయాన్నివిమర్శించి వారిపై నిందలుగల్పించి వారిసౌఖ్యానికి విఘాతముగలిగిస్తారు. లోకులు...అన్నీ చూస్తూనేఉన్నాడు పరాత్పరుడు; ఆయన పాదాలకడ బ్రతుకు వెళ్ళబోసుకునేభాగ్యం కలిగితేచాలు" అని తనలోతాను విసుగుచెంది కుర్చీలో వాలిపోయినాడు గోపాలరావు. హృదయంలో దుఃఖదావానలము చెలరేగినతరువాత ఎంతధీరుడైనా అసమర్థుడైపోతాడు. ధనికులసేపోటుమాటలు పడటంకంటె ఏవిషమోత్రాగి ఈలోకంవదలి వెళ్ళటమే సర్వోత్కృష్టమైనపని.

గోపాలరావు విద్యాధికుడు. అతనిహృదయ మెంత నిర్మలమో—అతని వదనమంత సుందరము. వత్సరమునకు ఐదారువందలు రాబడిగల ఆస్తికలవాడు. అతనికి చిన్నతనమందే వివాహమైనది; భార్యపేరు వకుళ.

చిన్నతనమందే వివాహంచేస్తే చెప్పినట్లువింటారు, పెద్దవాండ్లయినట్లయితే తమకు నచ్చినపిల్లనే తెమ్మంటారనే అభిప్రాయంవలననే మనహిందువులలో బాల్యవివాహాలు అభివృద్ధిలోనికి వచ్చినవని ప్రతీతి. గోపాలరావు తల్లిదండ్రు లట్టిఅభిప్రాయము కలిగియున్నవారు కాకపోయినా తమకుమారునికి పదేండ్లకే పెండ్లిచేశారు. నేడు నిజంగా విచారిస్తే గోపాలరావుహృదయంలో వకుళకు తావులేదు. ఆహృదయము నాక్రమించియున్నది వేరొకవనిత—ఆమె శ్రీలత. చిన్నతనంలో ఒకేబడిలో చదువుకొని, ఒకేచోట ఆడుకొని, ప్రతిబొమ్మలపెండ్లిలో గోపాలరావు పెండ్లికుమారుని తండ్రిగా శ్రీలత తల్లిగాఉండి, పసితనమునుండి ఒకరినొకరుప్రేమిస్తూ, తమజీవితమంతా ఒకేచోట వారు గడుపదలచిరి. కాని సరిగా జ్ఞానంకలుగకపూర్వమే, గోపాలరావు వకుళకు భర్తగామారిపోయినాడు. అది యొకబొమ్మలపెండ్లి అనుకున్నారు శ్రీలతాగోపాలరావులు. ఆపెండ్లిరోజు శ్రీలత పేరంటమునకువచ్చి, గోపాలరావు వకుళతో బంతులాడుతుంటే ముసిముసినవ్వులతో చూచినది...ముందేమిరానున్నదో గ్రహించలే దాపసికూన.

నేడు గోపాలరావు ఇరువదివత్సరముల యువకుడు; శ్రీలత పదునెనిమిదివత్సరముల యువతి. అజ్ఞానములో తాముండగా జరిగిన పొరపాటు ఇప్పుడు గ్రహించారాయువతీయువకులు. చిన్ననాటనుండి పెరిగి పెనవైచుకొనియున్న ప్రేమలతను త్రెంచి శ్రీలతను నిరాకరింపసాహసింపలేదు గోపాలుడు. తల్లిని, తండ్రిని వదలి కాపురమునకువచ్చిన భార్యయగు వకుళను వలదనలేదు గోపాలుడు. ఒకటి అలభ్యము—వేరొకటి అమూల్యము.

శ్రీలతకెన్నియో సంబంధములు వచ్చినవి—ఆమె పెడమొగము ద్రిప్పినది. స్త్రీలకు వివాహవిషయములందు స్వాతంత్ర్యములేదు. వరుడు కుంటివాడైనను, గ్రుడ్డివాడైనను, చెడుప్రవర్తనగలవాడైనను బాలికను ప్రశ్నించక తమకిష్టమైనంతనే పెండ్లిచేయు ఆలవాటింకను మనయందంతరింపకుండుట హాస్యాస్పదము. పెండ్లి ముచ్చటవస్తే పిల్లమంచిదేనా? అంటారుగాని పిల్లవాడిసంగతి కనుగొనరు. ఇట్టిపక్షపాతమే మనదేశకల్యాణమునకు, సంఘాభ్యుదయమునకు వేరుపురుగు. కొంచెము చదువుకొనినవారుగనుక శ్రీలతయొక్క తల్లిదండ్రులు ఆమెను ఈవిషయంలో శ్రమపెట్టలేదు; ఆమెకువచ్చినిదే వివాహంచేయదలపెట్టలేదు. తల్లిదండ్రులయొక్క విద్యుక్తధర్మమదియేకదా!

దినములుగడచినవి. మాసములు సంవత్సరములు గడచినవి. శ్రీలత వివాహమాడలేదు. గోపాలరావు వకుళను పెండ్లాడియుండి మరల వివాహమెట్లు చేసుకొనునని ఆమె కనుమానములేకపోలేదు, కాని ఆమె తన హృదయమును మార్చుకొనలేకపోయెను... తాను వకుళను వివాహమాడియుండి మరల శ్రీలతనెట్లు వివాహమాడగలనని అనుమానము గోపాలరావునకు లేకపోలేదు, కాని అతడు తనహృదయమును మార్చుకొనలేకపోయెను... గోపాలరావునకు శ్రీలతయందేమిగుల ప్రేమగలదని వకుళ గ్రహించకపోలేదు కాని ఆమె తన హృదయమునందలిఆశను మార్చుకొనలేకపోయెను. విద్యాగంధమెరిగినవారగుటచే వీరితల్లిదండ్రు లీవిషయమునం దెట్టిజోక్యమును కలుగజేసికొని యుండలేదు. లోకముమాత్రము ఈవిషయమెట్లు పరిణమించునోయని జాగ్రత్తగావేచియున్నది. పొట్టకూటికై గోపాలరావు ఒకజాగీరుదారుకడ గుమస్తాపనికి చేరాడు. అప్పుడే ఆజాగీరుదారు ఈవిషయాన్నిగురించి గోపాలరావుతో అనరానిమాటలన్నాడు. ఆగ్రామములో చాలామంది గోపాలరావును వెక్కిరించారు. 'నీబ్రతుకున కొకభార్యచాలు' అన్నారు కొందరు. 'ప్రేమపేరుపెట్టి కనుపించిన కులటను వల్లాకట్టుకుంటాడువీడు' అన్నారు మూర్ఖులుకొందరు. 'లోనవెలుగుచున్న పవిత్రప్రణయజ్యోతిని హృదయంచీల్చి, ఎల్లాలోకానికి చూపించగలను; తనకు సంబంధములేకపోయినా ఈపాపిష్టిలోకము అనరానివినరానిమాటలనుచున్నది.' అని తనలోతానే దిగులుపడిపోయినాడు గోపాలరావు.

ఇంతలో ఐరోపాసంగ్రామము వచ్చినది. దొరతనమువారు ప్రతిగ్రామమునందు విచారించి సైనికులను చేర్చుకుంటున్నారు. సమయమువచ్చినదని ఎవరితో చెప్పకుండా గోపాలరావు సేనలో చేరి యుద్ధానికి వెళ్లాడు.

మరునాడు గోపాలరావుచేసినపనికి అందరు ఆశ్చర్యపోయినారు. వకుళ స్మృతితప్పిపడిపోయినది. శ్రీలత జీవించునను ఆశలేదు.

౨

కాలం వడిగా గడచిపోవుచున్నది. గోపాలరావువెళ్ళిపోయి మూడువత్సరాలు దాటినవి. యుద్ధము పరిసమాప్తియైనది కాని అతడు తిరిగిరాలేదు. యుద్ధంలో చనిపోయినాడని వదంతిప్రబలిపోయినది. అతని తల్లి మంచముపట్టి కొడుకును తలచుకుంటూ ప్రాణాలువిడచినది. తండ్రి యిల్లుతాళంవైచి కొంతసొమ్ము తీసుకొని కుమారుని కనుగొనివస్తానని చెప్పి పిచ్చివాడిలాగా దేశమువెంటబడ్డాడు.

౩

అప్పుడే సూర్యుడు తూర్పుకనుమలనుండి తొంగిచూస్తున్నాడు. తెల్లపట్టుచీర ధరించి, చేతపళ్ళెము పట్టుకొని దేవాలయపుసోపానములనెక్కుచున్నది శ్రీలత. వాడిపోయిన చెక్కులు-ఎఱ్ఱబడియున్న కన్నులు, పాలిపోయినముఖము—ఆమె శోకదేవత రూపుదాల్చినది. ఆమె దేవాలయముచేరి దేవికి నమస్కరించి లేచు



'శ్యామసుందర్' అనుఫిల్మున కృష్ణపాత్రధరించిన
మాస్టర్ మోదక్

Courtesy: Famous Pictures.



'శ్యామసుందర్' అను ఫిల్మున రాధపాత్రధరించిన
సినీమానటి శాంత ఆప్టె కన్య

*Courtesy: Famous Pictures.*

నంతలో తటాలున మెడనున్న ముత్యాలహారము తెగిపోయినది. ఆమె హృదయము చివుక్కుమన్నది—వెనుదిరిగి వెడలిపోయినది.

పదినిముసములు గడచినవి. దేవాలయములోనికి వకుళ ప్రవేశించినది. మూడుసంవత్సరముల క్రింద ముడివైచియుంచిన కేశములు—కల్యాణశిష్టమైయున్న దేహము—ప్రపంచమునందలి దుఃఖమంతయు ఆమెయందే నిలచియున్నది. దేవాలయములోనికేగి దేవికి నీరాజనమొసగ పళ్ళెమున కర్పూరము వెలిగించినది. చేయిజారి పళ్ళెముక్రింద బడినది. కనులవెంట నీరుతిరిగినది—వెంటనే వెడలిపోయినది.

౪

"ఆకనుపించు రావిచెట్టువద్దనున్న మఠములో కూర్చునియున్న యోగికి మనవకుళ భర్తపోలికలున్నాయి సుమా!" అని నీలాటిరేవులో నీళ్లునుంచుకుంటూ అన్నది ఒకయిల్లాలు. "నేనుసరిగా చూడలేదమ్మా!" అంటూ జవాబుచెప్పింది తల్లో పూలుసవరించుకుంటూ వేరొకవనిత.

అప్పుడే ఈసంగతి ఊరంతా పాక్కిపోయింది. మఠంవద్ద జనలు గుంపులు గుంపులుగా మూగారు. మఠము వెలుపలిభాగంలో ఒకయోగి ధ్యానంలో కన్నులుమూసికొనియున్నాడు. చుట్టూ ఎంతచప్పడౌతున్నా అతడు కనులువిప్పలేదు. ఎన్నోగంటలవరకు వేచియుండి తుదకు విసిగిపోయి అందరు వెళ్లిపోయినారు. కొందరు గోపాలరావుకాదన్నారు, కొందరు ఔనన్నారు.

చీకటిపడినది. యోగిఇంకా జపముముగించలేదు. అప్పుడప్పుడు రావిచెట్టునుండి రాలిపడుచున్న పండుటాకుచప్పుడుతప్ప, అంతానిశ్శబ్దముగానేయున్నది. ఇంతలో అమఠమునందొకమూల మెల్లగా గాజులచప్పుడు వినవచ్చినది—ఆకటికచీకటిలో శ్రీలత మఠములోనికివచ్చినది. యోగినిసమీపించి, నమస్కరించి కుడివైపున కొంచెముదూరముగా నిలిచినది. యోగి కన్నులువిప్పలేదు. వినయముపెల్లుబికయ మెల్లగా శ్రీలత "హృదయేశ్వరా! చిన్ననాటనుండి తమ్మేదైవముగా నమ్మియుండి నేటివరకు అన్యునిబడయనొల్లక తమకై వేచియున్నదాసి శ్రీలత తమదర్శనమునకై వచ్చినది......" ఆమె ఇంకేమియో చెప్పవచ్చినది కాని దుఃఖమాపుకొనలేకపోయెను. యోగి ఏమియుమాటాడలేదు. తుదకు కన్నులనైనవిప్పలేదు. రాత్రిరెండుగంటలైనది. చెంతనున్నశ్మశానమున నక్కలకూతతప్ప మరేశబ్దము వినవచ్చుటలేదు. మెల్లగా మెట్టెలచప్పుడు మఠమున వినిపించెను. ఆయంధకారమున వకుళలోనికివచ్చినది. యోగికి నమస్కరించి ఎడమభాగమున నిలచినది. ఎదుటనిలచియున్న శ్రీలతను ఆమె చూడనేలేదు. శ్రీలత వకుళనూ చూడలేదు. ఇరువురికన్నులు యోగివైపునకేతిరిగియున్నవి. కొంతసేపునకు వకుళ "తమరాకకై నిరంతరము వేచియున్నదాసి, వివాహమున తాము భార్యగాబడసిన కాంత—వకుళ తమ్ముదర్శింపవచ్చినది." అని మెల్లగాబల్కెను. యోగిఎట్టిప్రత్యుత్తరము నొసగియుండలేదు. వకుళా శ్రీలతలట్లే నిలచియుండిరి. అప్పుడే తెల్లవారవచ్చుటచే కొంతతడవునకు వారు వెడలిపోయిరి.

మఱునాడు పురజనులెప్పటివలె గుంపులుగుంపులుగా యోగికడకు వచ్చియుండిరి. యోగికన్నులు విప్పనేలేదు; సమర్పించిన ఫలములనైన పుచ్చుకొనలేదు. మరల విసుగుచెంది వారందరు వెడలిపోయిరి.

చీకటిపడినంతనే శ్రీలత యోగికడకేగినది; ఎప్పటిస్థలమున మాటాడక నిలచినది. ఒకగంటగడచినంతనే వకుళ ప్రవేశించినది. ఈదినము శ్రీలత వకుళనుగుర్తించి చిరునవ్వునవ్వినది; వకుళ శ్రీలతను గుర్తించి కనులతో నమస్కరించినది.

దాదాపు రాత్రి పదిగంటలు దాటినది. ఎల్లెడనిశ్శబ్దము—యోగి ఒక్కసారికన్నులను విప్పినాడు. మరల వెంటనే ధ్యానమున మునిగినాడు. రెండుగంటలు దాటినది; వకుళా శ్రీలత లట్లే నిలచియున్నారు. ఇంతలో యోగికన్నులువిప్పి శ్రీలతనుగాంచినాడు—తలద్రిప్పి వకుళను చూచినాడు. మరలనిశ్శబ్దము. కొంత సేపునకు యోగి మెల్లగా "నాహృదయ మిపుడు త్రాసుచందమునమున్నది. ఒకభాగమునుండి కొంతతీసినచో రెండవభాగము క్రుంగిపోవును. రెంటిని సమస్థితియందుంచుటకు పాపిష్టిలోకము నన్నుచికాకుపరచి, భయ పెట్టినది—నేటితో ఈదీపము చల్లారును"అని పలుకుచు అత డాస్థలమునువదలి వడివడిగా వెడలిపోయెను.

శ్రీలత వకుళను సమీపించి ఆమె రెండుచేతులు పట్టుకొని హృదయముపై నిడుకొని ఏదియోచెప్పవచ్చి దుఃఖభారమున నేలగూలెను. వకుళ శ్రీలతపాదములపైబడి కనులకద్దుకొనెను. మరునిముసమున వారాస్థలము వదలిపోయిరి.

సమీపమున ప్రవహించుచున్న కృష్ణానదికడకేగినది వకుళ. మొలలోతు నీటిలోనిలచి ఏదియోధ్యానించు చున్నది. ఇంతలో పెద్దచప్పుడు—వకుళ భయపడి ముందునకుచూచి......"అదిగో శ్రీలత దారితీసినది—నేనేనిర్భాగ్యురాలను" అనుచు ఆమెతుదిసారి మునిగిపోయినది. ఏమియు ఎరుగనట్లు కృష్ణానది ఎప్పటివలెనే ప్రవహించుచుండెను.

※

తెల్లవారునప్పటికి రెండుకళేబరములు నీటిజాలునందు తేలియుండెను. కొందరు పడవవారు మిగుల శ్రమతో ఆకళేబరములను గట్టునకుతెచ్చిరి. వకుళా శ్రీలతలు విగతజీవులైనను వారి వదనములయందింకను చిరునగవు చిందులుద్రొక్కుచుండెను. గ్రామమున వార్తవ్యాపించినకొలది వేలకొలది ప్రజ లచ్చటకు వచ్చు చుండిరి. ఆప్రాంత మంతయు జనులతో నిండిపోయెను. ఎచట జూచినను గుసగుసలే. ఎచట విన్నను వింత సంభాషణములే.

ఇంతలో ప్రజలయందొక అలజడి ప్రారంభమయ్యెను. వేరొకకళేబరము నీటియందుకొట్టుకొని వచ్చు చున్నట్లు కానుపించెను. కొందరు ఒకచిన్న పడవతో బయలుదేరి ఆకళేబరమును ఒడ్డునకుజేర్చిరి. ఆకళేబరము గోపాలరావుదని గుర్తించినంతనే అచ్చటనున్న వారంద రొక్కపెట్టున ఏడ్చిరి.—పాడులోకమున కిప్పుడు కలిగినది పరితాపము!—

వకుళా శ్రీలతల కళేబరములను స్నానముచేయించి పసుపుచీరెలగట్టిరి. వదనములందు కళ్యాణపుబొట్టు నిడిరి. తల్లిదండ్రులొసగిన నగలెల్ల అలంకరించిరి. బుగ్గనకాటుకనిడిరి. గోపాలుని కళేబరమునుగూడ స్నానముచేయించి పెండ్లికుమారునకువలెయే శృంగారములన్నియుజేసిరి. గోపాలుని పరుండబెట్టి ఎడమవైపున వకుళను కుడివైపున శ్రీలతనుపరుండజేసిరి. వారిదేహములను మల్లెపువ్వులతో దట్టముగాకప్పిరి. మేళతాళ ములతో గ్రామమంతట నూరేగించిరి. ఈదృశ్యమునుగాంచి కంటనీరుపెట్టని కాంతలేదు. దిగులుపడని పురు షుడులేడు. ప్రేమయందలి పవిత్రతను లోకము నేడు గ్రహించినది.

...అదిగో మంటలెగయుచున్నవి. ఆపొగపొరలయందు సతీద్వయసమేతుడై గోపాలుడు ఈలోక మునువదలి పరలోకమున కేగుచున్నాడు. వేలకొలదిప్రజలు చితిచుట్టును తలలువంచినిలచియున్నారు. సూర్య బింబమున కింతలో కారుమేఘ మడ్డుతగిలినది—కాంతిపుంజము చీకట్లఁగలసిపోయినది.

పాఠకులారా! ఎవరిని మెచ్చుకొందురు? లోకమునకువెరచి తనసౌఖ్యమును లక్ష్యపెట్టక సర్వము త్యజించిన గోపాలరావునా? పవిత్రప్రేమవలన ప్రియుని పాదాంకములచెంత ఆత్మార్పణ మొనర్చిన శ్రీలతనా? భర్తయే దైవమునినమ్మి పరలోకమునం దాతనితో సౌఖ్యమనుభవింపజనిన వకుళనా?

# ఉషః ప్రబోధము

హారి రాధాకృష్ణమూర్తి గారు

అదె ప్రాభాతమరీచికానివహమం దాశాముఖోత్పన్న ప
క్షిదళంబుల్ నవమంగళధ్వనుల నాశీరర్థముల్ పల్కఁ గో
విదులున్ శిష్యగణాలి కాగమవిధుల్ వేడ్కన్ ప్రబోధింతు రో
ముదితా! సుప్తమనోరవిందశయనంబున్ వీడి రావేలకో?
చెన్నుదొలంగె ప్రాంగణము చిమ్మకయున్నను ధూళి, గుమ్మముల్
వన్నెనుబాసె ముగ్గిడమి వారిరుహాయతనేత్ర! గేహము
భ్యున్నతిలేమి కన్పడెను యోగము నీయదిరెయొక్కొ నీవు లే
కున్న రమావిలాసముల నొప్పవొ సంపదనోము సౌధముల్.
తొలికోడికూత నీవలనున కేతెంచి వీనులలో జొఱనూనదేమొ
శీతలానిలమునింజెనకి శరీరంబునకు తెల్వి నించుకంతయును నిడదొ
పలుగాకులైన పక్షులు కలధ్వనుల నిన్ కలతనిద్దురనుండి కదుపబోవొ
ఆకాశమంతల నావరించిన సంధ్య కంటి రెప్పలలోన గ్రమ్మబోదొ

అర్కకాంతంబులను మండునట్లుజేయు
భానుదీప్తులునీదు గవాక్షమునను
లోనికేతెంచి నిన్ను మేల్కొలుపవేమొ
తెలిసినిద్రింతొ! దిక్కులు తెల్లవారె.

అనుటయుకాదు కాంచు మతివా! నయనంబుల విప్పి పద్మినీ
వనితలు హంసయానపరివర్తితమందమరుత్తరంగ సం
జనితహిమాతిరేకమున జాలుబువారిన పూవుదేనచే
నినున కుపాయనంబిడి ప్రహృష్టతగాంచెదరమ్మ లోకమున్.
ఏరొలనాగ సూర్యుడుదయించెడివేళను నిద్రమాని రా
దాయెనొ ఆపెమోము నిలయంబగు జెష్టకనంచు ధర్మముల్
మ్రోయఁగ జూడలేదె యిదిమూర్ఖులలక్షణమానుకాదె క
న్యామణి తెల్విదాల్పు మిదె నాత్మశుభంబులు నిన్ను బొందెడున్.

## సమయస్ఫూర్తి

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

గోధూళికాసమయము. చల్లనిపిల్లగాలులు వీచుచున్నవి. ఆకాసము మేఘావృతమైయున్నది. చిన్నపిల్లమేఘము లాకాశమునందంతటను తిరుగాడు చుండెను. సగముకట్టుచున్నడాబాపై సుదర్శనం యేకాగ్రచిత్తతతో నిన్న వ్రాసివిడిచిన పటమును పూర్తిచేయుచుండెను. అతని మనస్సంతయు పటముపై ననేలగ్నమైయుండెను. పటముతప్ప వేరేప్రపంచ మాతనికి గానరాకుండెను.

నిశాదేవి తనవైరిని సంహరించి జయముగాంచితిననుహర్షముతో భానుం డస్తమింపగనే మెల్లమెల్లన తన రాజ్యమాక్రమించుచుండెను. సంజకెంజాయ లలముకొనుచుండెను. సుదర్శనునిపటము పూర్తియాయెను. అంత యాస క్తితో రచించిన తన పటమెట్లుండునో చూతమని సుదర్శనుడు పటముపైననే దృష్టినుంచి వెనుక కడుగులువైచుచు ఇంకను గోడపెట్టని డాబాచివరవరకు వెళ్లెను.

సుదర్శనునినౌకరు 'రాము' పటమువెనుక డాబాపై కూర్చుండి సుదర్శ నుని పాదరక్షలను శుభ్రపరచుచుండెను.

అకస్మికముగా రాము తలెత్తిచూచెను. తన యజమానుడున్న భయా నకస్థితి వానికి నయనగోచరమాయెను. సుదర్శనుడు పటముమీది యోచనచే రెండవది పరికింపక ఇంకను వెనుక కడుగులువైచుచు పోవదొడంగెను. అతడు మరొకడగు వెనుకకువైచిన అధఃపతితుడుగావలసినదే. రామునకుగోచరించిన స్థితిగతులిట్టివి.

పటమువద్దనే చిన్న పళ్లెములో పటమునకు వేసినరంగుగలదు. రాము తటాలున నారంగునంతను పటముపై బడవేసెను.

అంతయు రెప్పపాటుకాలమున జరిగినది. సుదర్శనున కాగ్రహామువచ్చెను. అంత యాశతోలిఖించిన పటమట్లుచెడుటచే గల్గిన నిరాశాగ్రహాములొక్క సారి ఉదయింప సుదర్శనుడు ముందునకుబరువిడీవచ్చి రామునిగొట్ట చేతులెత్తెను. "ప్రభూ! మీరు నన్నుకొట్టినకొట్టుడు. ప్రాణములు నిల్పినవది యేచాలు" ననెను రాము. సుదర్శనునకు తెలివివచ్చెను. రెప్పపాటుకాలమున జరిగినది తెలుసు కొనెను. వానిసమయస్ఫూర్తి కెంతయు సంతసించి తటాలున వానినాలింగనము చేసుకొని "రామా! నీ ఋణం నే నెన్నటికీ తీర్చుకోలే" నంటూ ఆనందబాష్పాలు విడిచాడు సుదర్శనం.

# వేముగంటి బొజ్జెమ్మ

మన్నేపల్లి రామకృష్ణరావుగారు

ఈమహాపురంధ్రి పేరుప్రతిష్ఠ లెరుగనివారు నెల్లూరుప్రాంతముల నుండరు. ఈమె వేముగంటి వేంకటరావుపంతులుగారి భార్య. ఈమె పుట్టినిల్లు అనంతపురముజిల్లా తాటిపత్రి. పుట్టినింటివారి పేరు కానులవారు. ఈమె తలిదండ్రులపేర్లు తెలియలేదు. ఈమెకొక చెలియలుండినది. ఈమె పెద్దబొజ్జెమ్మ, ఆమె చినబొజ్జెమ్మ యని యింటివాడుక పేర్లుండినవి. లోకమున కీయమ "బొజ్జెమ్మ" యనియే వాడుక. వీరి పుట్టినింటివారిది కర్ణాటకమధ్వసంప్రదాయము. భర్తగారిది దేశస్థమధ్వసంప్రదాయము. బొజ్జెమ్మగారి జననకాలము స్పష్టముగ తెలియలేదు. ఈమె 1880-వ సంవత్సరమున స్వర్గస్థురాలయినటుల దెలియుచున్నది. అప్పటి కీమెకు 97 సంవత్సరములట. దీనిబట్టి జననకాల మూహ్యమగుచున్నది. ఈమె చిన్నప్పటినుండియు దైవబ్రాహ్మణభక్తిగలిగి తలిదండ్రులయెడ వినయవిధేయలతోడను, శ్రద్ధాభక్తులతోడను వర్తింపుచు ఇరుగుపొరుగునను యందరికి ప్రీతిపాత్రమై యుండినది. ఈమె తండ్రిగారు కుంఫిణీబహదర్ వారి దివాణములో కడపతాలూకా ◆శిరస్తదారుగనుండిరి. వేముగంటివారిది చాల పేదకుటుంబము. ప్రథమములో వీరికుటుంబము మైసూరురాజ్యములో రాజకీయోద్యోగమున నుండిరనియు హైదర్ టిప్పుసుల్తాన కల్లోలములలో వీరికుటుంబము మైసూరురాజ్యమున నుండ వలనులేక కొంతకాల మచటనచట ప్రచ్ఛన్నముగానుండి కుంఫిణీప్రభుత్వ మాప్రాంతముల వ్యాపించినపిదప అజ్ఞాతవాసము వదలి సంచరింపగలిగిరనియు తెలియుచున్నది. వేంకటరావుగారితండ్రి రామదాసుగారు-తల్లి *రిందమ్మ. వేంకటరావుగారు పసితనమునుండియు చురుకుదనమును స్వాశ్రయబలమునుగలవారు. కుటుంబభరణము కష్టముగనుండగ వీరు పిల్లవాండ్రాడుకొను †పుట్టచెండ్ల సాగనుగట్టి దానిపైన నందముగ రంగులదారములతో పువ్వులనమర్చి వాని నమ్మి వచ్చిన పైకము తల్లిగారియొద్ద నిచ్చుచుండెడివారు.

కొంత పెద్దవారయిన పిదప వేంకటరావుగారు కుంఫిణీసర్కారు యుద్యోగమును సంపాదించు కోరికతో కడపతాలూకాలో పైనజెప్పిన తాలూకాశిరస్తదారుని ప్రాపున ఉమ్మీద్వారిగ (వాలంటీయరు) జేరిరి. ఆకాలమున తాలూకాశిరస్తదారునకు అధికారమును, పలుకుబడియు ఇప్పటికంటె హెచ్చుగ నుండినవి. "పురాహి సిద్ధాన్యుపలక్షితాని" యనినటుల వీరు వేంకటరావుగారి తెలివితేటల నుపలక్షించి వీరికి కచ్చేరిపనుల జక్కగ నేర్పుచు వీరియెడల విశేషప్రీతి గలిగియుండిరి. ఆకాలమున నొకకుంఫిణీసేన యెటనుండియో వచ్చుచు పెన్నదాటి కడపజేరవలసి యుండినది. తాలూకాకు తాఖీదులువచ్చినవి. తెల్లవారు నప్పటికి తహసీల్ దారు మొదలు తలారివరకు సిబ్బందియంతయు యేటియొడ్డునజేరి నదీతరణమునకు వలయు సంభారోపకల్పనముల నందించుచుండిరి. సేనయంతయు దాటినది. సేనానాయకులును జిల్లాకలెక్టరువారును యెక్కిన ‡యరిగోలపై పుడప్పి ప్రవాహమునబడి సాగరోన్ముఖమయినది. గట్టుమీది యుద్యోగస్థులు అర్థాత్ తటస్థులయి భ్రాంతులై ఒకరిమొగము నొకరు జూచికొనుచు ఏమిచేయుటకును తోచక చిత్రార్పితులవలె నిలిచిరి. ధీరులును కార్యశూరులునగు వేంకటరావుగారు నడుముగట్టి నీటదుమికి సంద్రపుత్రోవంబట్టిన యాబుట్టనుబట్టుకొని దానిని సురక్షితముగ గట్టుజేర్చిరనియు, ప్రాణరక్షణబొందిన ఆప్రభువులు వారిని మెచ్చి యుద్యోగమునకు సిఫా

---

(◆) ఈయుద్యోగమున కిపుడు తాలూకాబోర్డుహెడ్డుఅక్కౌంటెంటు అనిపేరు.

(*) ఇది బృందావనశబ్ద వికృతి. దీనికి బ్రిందమ్మయను రూపాంతరమును కలదు.

(†) లబ్బరు (Rubber) చెండ్ల నెరుగని యాప్రాతకాలము గచ్చకాయకు గుడ్డపేలికల గుండ్రముగ జుట్టి పైన రంగులదారములతో పూలనుతీగెలను కుట్టుచుండిరి. పుట్టచెండు-పుట్టము (గుడ్డ) + చెండు.

(‡) వెదురుతో గాని పేముతో గాని పెద్దపెద్ద బుట్టలనల్లి వానిపై తోలుకుట్టి ఆబుట్టల కొన్నిచోట్ల పడవలుగ వాడుదురు. వీనినె యుర్కాలుఅనియు, పుట్టీలుఅనియు జెప్పుదురు.

రిమ చేసిరనియు అంతట వేంకటరావుగారికి కడపయందే గుమాస్తాగిరి మొదలు తహసీల్దారువరకు పదవిక్రమక్రమముగ లభించినదనియు వారి కుటుంబమువారు చెప్పెదరు. వీరు కడపతాలూకాలో నుండగనే ఉదాహృత శిరస్తాదారుగారు శ్రీమతి బొజ్జమ్మగారినిచ్చి వీరికి వివాహముచేసిరి. పెండ్లిఅయిన కొలదికాలముననే బొజ్జమ్మగారు గృహిణీధర్మనిర్వర్తనమునకై భర్తృసంసారమున చేరిరి. వేంకటరావుగారు కడపయందుండగనే వీరెరిగిన యధికారియొకరు తిరుచనాపల్లికి బదలాయింపబడిరి. ఆకాలమున శ్రీరంగములో తెంగలి వడగలి కలతలుపొసగి ఆయల్లరులనణుప సమర్థుడగు తహసిల్దారు కావలసివచ్చినది. పైనచెప్పిన జిల్లాఅధికారి వేంకటరావుగారి ధైర్యస్థైర్యములనెరిగినవాడై వారినటకు తహసిల్దారుగ తెప్పించుకొనిరి. వీరచటికేగి యాగజకచ్ఛపుసంగ్రామంబున బ్రవేశించి అల్లరినణచి యచిరకాలమున శాంతిగలుగజేసిరి. వీరు అచటనుండగనె ఆమాండాలికాధికారి విశాఖపట్టణమునకు మార్చబడినారు. ఆజిల్లాయందలి మన్యములలోని (agency-tracts) కోయిదొరలు, భిల్లులు పూర్తిగ లోబడక అంతటంతట చిన్నచిన్నయుపద్రవముల కల్గించుచుండెడివారు. వానినణగ ద్రొక్కుటకయి వేంకటరావుగారు విశాఖపట్టణమునకు పంపించబడిరి. అచట చేరినకొలది కాలముననె కోయీలభిల్లుల నణంచుదలజేసి వారిపితూరీల నణచివేసిరి. వీరచటనేయుండి హెడ్డుశిరస్తాదారు పదవినొందిరి. తరువాత కొంతకాలమునకు వీరు నెల్లూరుజిల్లా కలెక్టరు హెడ్డుశిరస్తాదారుగ బదలాయింపబడి ఇచటనే పెద్దయిల్లు కట్టించుకొని స్థావరమేర్పరచుకొని ఇచటనే ఆయుద్యోగమునుండి పెన్షను బుచ్చుకొనిరి. వీరి పెన్షను నెలకు రు 350 లని తెలియుచున్నది. వీరు మహారాష్ట్రభాషలో కవిత్వము చెప్పుచుండిరనియు; మహారాజా శివాజీఛత్రపతివారిచరిత్రమును, తమ జీవితవృత్తాంతమును ఆభాషలో వ్రాసియుంచిరనియు కొందరు చెప్పెదరు. అట్టి వెచటను లభింపలేదు.

వేంకటరావుగారు విశాఖపట్టణమున నుండగ నొకరాత్రి శ్రీమతి బొజ్జమ్మగారికి తులసీమహాదేవి ప్రత్యక్షమయి వీరుండిన ఇంటిదొడ్డిలో నొక పెంటదిబ్బలో తులసికోటయొకటి యున్నదనియు, దానినిదీయించి శుభ్రపరచి కళావాహనాదులుజేయించి దాని నారాధించుచుండుమని యాజ్ఞాపించినదనియు, మరునాటియుదయమున నాదిబ్బను త్రవ్వించగ దానియందు దారుమయమగు తులసికోట దొరకినదనియు, దానిని మహాప్రసాదముగ గొని యానాటినుండియు యామె దాని నారాధింప మొదలిడినదనియు నప్పటినుండియు వారికి తతోధిక సంపదయు సంతానసౌభాగ్యము లుప్పతిల్లుచుండినవనియు తెలియుచున్నది. బొజ్జమ్మగారి చిత్తవృత్తియంతయు నిరంతర మాముష్మికసాధనములమీదను ఇతరుల కుపకారముచేయుటయందును వ్రాలియుండినది. ఆకొనినవారి కన్నముపెట్టినది—భర్తతో సకలసంపదల ననుభవించి పుణ్యసంపాదనకై కడంగి యాగామి సంచితవాసనల నిర్మూలముచేయగల సత్యధర్మవర్తనలం దుత్సాహముకలిగి యుండినది. ఆమె జరిగించిన గొప్ప ధర్మము లనేకములు గలవు-కొన్నింటిని చేర్కొనినజాలును.

(1) మాధ్వులకు వ్రతానుష్ఠానములందాసక్తి యెక్కువగగలదు. విశాఖపట్టణమునందుండగ ఏకాదశీసోమవారవ్రతమాచరించి తదంగముగ నుద్యాపనము జరిగించి నూటయెనిమిది ప్రత్యేక సవత్సగోదానముల జరిగించి భూరిదక్షిణలతోడను యన్నదానములతోడను పరమేశ్వరప్రీతిగ భూరితృప్తిజేసినదని ప్రసిద్ధిగలదు.

(2) విశాఖపట్టణముననే మార్కెట్టు సమీపమున నొకగుడికట్టించి అందు ముఖ్యప్రాణదేవరయగు శ్రీహనుమంతుని ప్రతిష్ఠించినది. ఆదేవాలయమున పూజానైవేద్యములు జరుగుచున్నవని తెలియుచున్నది.

(3) నెల్లూరి సంతపేటలో శ్రీఆంజనేయస్వామివారి వీథినుండి పినాకిని స్నానమునకుబోవు చాతుర్వర్గ్య క్షేత్రమ్ముగ నేటియుద్దుననే యొక దేవాలయమును గట్టించి దానియందు వీరాంజనేయప్రసన్నాంజనేయ మూర్తుల రెండింటిని ప్రతిష్ఠజేసినది. ఈదేవాలయమునందు నిత్యనైవేద్యపూజాదికముల నామె వంశస్థులోకరు జేయుచున్నారు.

(4) ఈ దేవాలయము వెందలుకొని యుత్తరమున రంగనాయకుల పేటలో నిపుడు మునిసిపల్ బాలుర బడి కట్టబడియుండు నివేశమువరకు ఏటియొడ్డుననే నానావృక్షశోభితమగు ఆరామము నొకదానిని నెల కొల్పినది. దానియందామె *ధాత్రీ సమారాధనలు సంతర్పణలు జరిగించుచుండినది. ఈ వనముయొక్క యుత్తరపుకొన పైనజెప్పిన మున్సిపల్ స్కూలు ప్రక్కయందు హైరోడ్డువరకు వ్యాపించియుండినది. ఈకోనభాగమున గొప్ప మామిడితోపుండినది. రంగనాయకస్వామివారి తిరునాళ్ళకు వచ్చువారును, ప్రాయికముగ తిరుపతికి బోవు యాత్రికులును ఈతోపున విడిసి చెట్లనీడల మార్గాయాసక్రమముల దీర్చుకొనుచుండిరి. ఈ పెద్ద యారామమున చాలభాగము బహుధాన్యసంవత్సరపు (1874 అక్టోబరు) వెల్లువలో ఏటగలసినది. అవశిష్టము కాలగతిచే నశించినది. మామిడితోపుండిన ప్రదేశమున ఇప్పుడు మునిసిపల్ స్కూలును, మరియు మేడిండ్లును యేర్పడినవి. బొజ్జమ్మగారివనము బాగుగనుండిన కాలమున ఎండపొడపడకుండ దట్టముగ రమ్యముగను యుండినది. అచటనచట కపిలబావులు ఉద్ధులు యేర్పడియుండినవి. ఈ పెద్దతోట యాద్యంతముల దాదాపు మూడుఫర్లాంగులుండినది.

(5) నెల్లూరు రంగనాయకుల పేటలో రాజవీధికి పడమటివైపున పెద్దసత్రమొకదాని నీమె గట్టించినది. ఇది కాశీరామేశ్వరములబాటలో నుండుటచే యాత్రికులకత్యంతోపయోగముగనుండినది. ఇది పయినజెప్పిన మామిడితోపునకు దక్షిణమున కొలదిదూరమునయున్నది. సత్రము చాల శిథిలమైనది. కొంతభాగమున్నది. దానిని ఈమె సంతతివారొకరు కాపాడుచున్నారు. ఈసత్రము నీమె సంతతివారు జీర్ణోద్ధారముజేసిన కీర్తిగ నుండగలదు. ఈసత్రపుటావరణమున బొజ్జమ్మగారొక యరుగును వేయించిరి. బ్రహ్మోత్సవకాలమున శ్రీరంగనాయకస్వామివారాయరుగుమీద వేంచేయునటుల యామె యేర్పాటుజేసినది. ఇది ఇప్పటికిని జరుగుచున్నది.

(6) శ్రీరంగనాయకస్వామివారి దేవాలయమునకు పడమటి యేటియొడ్డున నీమె యొకపెద్దయరుగును గట్టించి దానిమీద నొకబృందావనమును స్థాపించినది. సన్నిధిరేవున స్నానములకుబోవువారిని సంధ్యావందనాదులు జేసికొనువారికిని ఈయరుగు బహూపయోగముగనున్నది.

(7) ఈపవిత్రురాలు నిర్వహించిన సత్కార్యములలో నవిచ్ఛిన్నముగను యనూనముగను యనన్యానముగను జరుగుచుండునది చిలుకుద్వాదశిగరుడోత్సవము-ఈ యుత్సవమునకు బొజ్జమ్మగరుడోత్సవమను పేరు రూఢియైనది-ఈద్వాదశినే క్షీరాబ్ధిద్వాదశీవ్రతాంగముగ యేకాదశ్యుపవాసము జరుపుటయు బ్రాహ్మణ బ్రాహ్మణీసహితముగ ద్వాదశిపారణ జరుపుకొనుటయు ఆరాత్రి శ్రీరంగనాయకస్వామి దేవేరులతోడ గరుడ వాహనారూఢుడయి బొజ్జమ్మగారియింటికి వేంచేయుటయు అచటస్వామివారికి సమస్తరాజోపచార దేవోపచారములు జరిగించుటయు గలదు. శ్రీరంగనాయకస్వామి తమయింటి యల్లుడనియు అల్లుడాడుపడుచులతో కూడ నత్తగారియింటికి వచ్చుటయను నొకభక్తి కల్పనజేసికొని శ్రీస్వామివారికి భూషణాంబరముల నామె యిచ్చుచుండినది. ఇప్పటివారు భూషణముల సమర్పించుచున్నారో లేదో తెలియదుగాని నూత్నవస్త్రముల జదివించుచున్నారు. ఈ గరుడోత్సవము యథావిధిగ జరుగుచున్నది.

(8) అనుదినమును శ్రీతులసీమహాదేవిపూజ కల్పోక్తప్రకారము ఆమె జరుపుచుండినది. (ఈయాచారము నిప్పటికిని ఆయింటియాడువారు శ్రద్ధాభక్తులతో అనుష్ఠించుచున్నారు.)

(9) ఈయమ బాహ్యాంతరంగికప్రవృత్తులలో నంతయు నుత్తమోత్తమ మయినది పతిభక్తి. పత్యుః పూర్వం సముత్థాయేత్యాదికులస్త్రీ పాతివ్రత్యలక్షణములెన్నిగలవో వానినన్నిటిని నిర్వర్తింపుచుండినది. ఈ యిరువురి యన్యోన్యము నిరతిశయప్రక్రియ నుండినది.

(*) కార్తికమున (ధాత్రి) యుసిరిక చెట్లుగల యారామమున సమారాధనముజేయుట సంప్రదాయము.

ఈమెకు నలుగురు కొమారులును అయిదుగురు కొమారితలును గలిగిరి. లోకముతో పాటీమెయు గర్భశోకము ననుభవించినది. ఈమె నిర్యాణకాలమునకు ఒక్క పుత్రుడు ఇద్దరుపుత్రికలును మాత్రముండిరి. పౌత్రదౌహిత్రాది సంపదనుగూడ జూచినది ఈమెసంతతి తామరతంపరలయి వర్ధిల్లుచున్నది. మనినంతకాలము సమస్తసంపదల నోలలాడి మితిలేని దానధర్మములజేసి సౌమంగల్యసౌభాగ్యమున వెలసి పుత్రపౌత్రాది ముద్దుమురిపెముల నానందించి నిండుపయోధరమున యర్ధాంగమూర్తియగు భర్తగారి యంకమున తలనిడుకొని తులసీ మహాదేవి ధ్యానము గావించుచు "హానుహోగిబర్తెను" యను చరమసూక్తముల యజమానునియొద్ద సెలవుబొంది 1880 సంవత్సరమున ననాయాసముగ శ్రీతులసీమహాదేవి నిత్యసేవకా సాధ్వీశిరోమణి తరలిపోయినది. అప్పటి కీయమకు 97 సంవత్సరములని చెప్పిరి. భర్తగారికి 102 నట. ఈయమ కడపటిపలుకుల విన్నంతనే యాజరత్కారువు "నన్నొదిట్టిపోగితివా" యని బహువిధముల విలపించిరి. బోజ్జెమ్మగారు కనుమూసిననాడు నెల్లూరు ప్రజయంతయు మాతృహీనమయినట్టుల విచారము నొందినది. దేహము వెంటవచ్చిన పసుపు కుంకములు పూలు తమలపాకులు చెవియాకులలోనగు సౌమంగల్యవస్తుప్రకరము చితిపరకును త్రోవలనిండినవి. క్రిందరాలినవానిని మహాప్రసాదముగ పలువురుస్త్రీలు గొంపోయిరి. ఆమెగట్టించిన ఆంజనేయస్వామి దేవాలయమునకు నుత్తరప్రక్కన ఆమెజ్యోతికచిహ్నము సకలములగు నైదువుమరియాదలతో నంతిమ సంస్కారము బొందినది. ఈదుఃఖముతో కృశించియావల రెండేండ్లకీమె భర్తగారును పురుషోత్తమ స్థానము జెంది వియోగవిషాదమును పోనాడిరి. ఈదంపతుల చరిత్రలకు దినవారాదిసంఖ్యానము లభించలేదు. వేంకటరావుగారు దాదాపు 35 సంవత్సరములు పెన్షను బుచ్చుకొనిరట. వీరుచనిపోవునప్పటికి వీరికి 104 ఏండ్లట. అట్లగు వెడల వీరిజననము 1778 ప్రాంతములనుండును. ఈవిధమునే బోజ్జమ్మగారి జన్మకాలమును యూహ్యము కాగలదు. ఈ జాయాపతులకు వయోభేదము అయిదేండ్లుగనుండును. ఇందేమియు విపరీతములేదు. సరి ముదుసళ్ళను బిరుదమును గొప్పియుండిరి. వేంకటరావుపంతులుగారు స్థూలదేహులు, దీర్ఘకాయులు, ఒడ్డుపొడవు గలవారు. బోజ్జమ్మగారు మేలిమిబంగారువన్నెగలిగిన దేహకాంతిగలవారు. కురచయాకృతి నాతిస్థూల నాతికృశ దేహయష్టిగలవారు, విశాలఫాలము. వారియిండ్లతీరు ననుసరించి ముదుసలితనమునను జడవేసికొని చుట్టచుట్టుకొనువారు. మరియు బుగడలు, ముక్కుపోగు సదాధరింతురు. ఒక్కొకప్పుడు ముక్కుపోగును కమ్మ చెవికి దగిలించుకొనుటయు యొకవిలాసముగనుండెడిది. ఈయమ ఏకాదశి శుక్రవారములోనగు దేవోత్సవదినములందు ముఖ్యముగ శ్రీరంగనాయకస్వామి దేవాలయమునకు వచ్చుట యెల్లరకు దెలిసియుండి పిల్లలు పెద్దలు ఆదినములందు ఈమెరాక నిరీక్షించుచు బండియగుపడగనె పిల్లలు "బోజ్జెమ్మవచ్చుచున్నది, బోజ్జెమ్మవచ్చుచున్నది" యని ఎగురుచు కేకలువేయుచుండ అందరును కిటికిలోనికివచ్చి ఈమెదర్శనముజేసికొని పోవుచుండిరి. ఈమె యొకయొంటియెద్దుబండిమీద వచ్చుచుండినది. బండితోలువాడొకమాధ్వబ్రాహ్మణుడు. భర్తగారి పేరునకంటెను ఈమె పేరునకు ప్రఖ్యాతిఅధికముగ గలదు. ద్రవ్య మాయన యార్జనమైనను "బోజ్జమ్మగారి యిల్లు, బోజ్జమ్మసత్రము, బోజ్జమ్మదేవళము" ఇత్యాదినామములే యూర్జితములయి నిలిచియున్నవి. దేహము నశ్వరము ఆత్మ నిత్యుడనినట్టుల ద్రవ్య మవరమును సంకల్ప ముత్కృష్టమును అయినవి. ఈమెజేసిన సత్కార్యముల నన్నిటను సంకల్పమీమెది. అయినను భర్తగారి సమ్మతామోదపురస్సరముగ నవి జరిగినవి యని కారయిత్రీత్వ మీవిధమున వీరియందనుక్తముగ ననుమేయమగుచున్నది. తథాపి.

"రామస్త్వత్సంగ్రహాద్దేవి దేవలోకేషుచ శ్రుతః
సీతాభర్తేతిమాన్యోభూన్నృణాంభువి విశేషతః."

అను ప్రాచేతసోక్తి కిచట లక్ష్యమున్నదన్న కీర్తిమూర్తులగు వేంకటరావుపంతులుగారియెడ నపచార దోష మాపాదింపకుండుగాక!

—సుబోధిని.

# అపాత్రదానఫలము

సీరిపి ఆంజనేయులు గారు

(*కెంపులపతకము)

కేలఁగ్రాలెడు కడవనుబోలు చెంబు,
చంక విస్తరి, ముసుపుల సన్నవల్లె,
ముండనపుఁదల, మిక్కిలిగుంటుబోత
మెఱుఁగుననాల్వలు మెయినొప్ప మెలఁతయోర్తు
పుడమిపయి నల్లనల్లన నడుగులిడుచుఁ,
జన్నియంబళ్ల ప్రొద్దునఁ దన్నునోరులు
గాంచనివిధాన, స్వాతంత్ర్యగరిమ వెలయఁ,
జేరె గేహాంతరంబు మచ్చికఘటిల్ల
అచట 'శ్రీహరియేసమ' యనెనో లేదో
చాన, బహుళకార్యాంతరాసక్తయగుట
గృహిణి యక్కాంతసడిని గుర్తింపలేదో
యేమిచిత్రంబునడచెనో యెఱుకపడదు
పూజ్యరాలైన యాయింటిపూర్ణవృద్ధ,
చేరువనె గోడయోర వసించియుండి,
చొచ్చియిలు, భిక్షురాలు నిల్చుటయెఱింగి
తనమనుమరాలి కాయుదంతంబు దెల్పె.
అతిథియభ్యాగతులయెడ, నధికభక్తి
భావము వెలార్చు నాగృహపరమసాధ్వి,
బిచ్చమును దోయిలింగొనివచ్చిచూచి,
యచటభిక్షార్థిని యదృశ్యయగుట తెలిసి
ఏయెడనుయాచ్నకై మొండివేయఁజాలు
నతివ; యటనిటుమటుమాయమౌట కేమి
హేతువో, యది తనకు నూహింపరాని
దగుటఁ, దనపితామహికి నప్పగిదిఁ దెలిపె
"అనుదినము రానువేఁడు నర్థసకోకపు
వెలితి లవమేనిఁగలిగింపఁ దలఁపఁబోము
పోలఁతినేఁడిటు నిర్దయఁబూననేమి
కారణమొ" యంచు నావృద్ధకాంతవగచి
తనగృహావరణముఁజొచ్చి, మనసునంద
యొకనిమేషంబు కలఁగ, వేఱొక తలంపు
మదికిరాఁబిల్చె యావృద్ధ, మనుమరాలి
నడిగె, మఱచితివో దేనినైన ననుచు.
ఆవిడ యొకింత యోచించి, "ఔనె, యవ్వ!
వేకువను దానమాడెడువేళ నిచట
వస్త్రతతిడించి, కెంపులపతకమొకటి
యుంచి, యిందాఁక నే విస్మరించియుంటి
"కట్ట! గుడ్డలఁగొనిపోవు నట్టితఱిని,
నెట్టొ చాకిఁత తనపొట్టఁ బెట్టికొనియె;
నేమిసేయంగనగు నదియెట్లుదొరకు"
నంచు, నాముగ్ధ యాత్మఁ జింతించెమిగుల
అంత నాయవ్వ వెలుపలికరిగి, వీథి
నభిజవముమీఱఁ జను భిక్షురాలిఁ జేరి,
తకపికలుసేయఁజూచు నాతక్కులాడి
యొడినడఁచుకొన్న పతకంబు నొడిచికొనియె.

ఆంధ్రగృహలక్ష్ములార! సమాదరమున
మీర లీకథాంశమ్ము విన్నారుగారె?
కల్పితముగాదు లవము; నిక్కంపుసుద్ది
యిది; యపాత్రదానఫలంబుగద తలంప?

---

* అనంతపురమున 30-వ జనవరి 1932 న జరిగినది.




—గోధుమపిండిలడ్డూలు—

అరశాకుగోధుమపిండిని జల్లించిపట్టవలెను. పొయ్యిమీద తపాళపెట్టి దానిలో కొద్దిగ నెయ్యివేయవలెను. అది కాగినపిమ్మట ఒకపలము జీడిపప్పును వేయించి తీయవలెను. అరశాకుపంచదార అజీడిపప్పును మెత్తగ దంచవలెను. జల్లించినగోధుమపిండిని బాగ వాసన వచ్చేవరకు వేయించితీయవలెను. ఈపిండిని ఆపంచదార జీడిపప్పునువేసి కలుపవలెను. ఒకగిన్నిలో కొంచెమునెయ్యిపోసి కరుగపెట్టవలెను. కరిగిన పిమ్మట ఆపిండిలోపోసి లడ్డుపట్టవలెను. ఇది పూరీ లడ్డువలెఉండును. లడ్డురానియెడల నెయ్యిపోసి పట్టవలెను.

—పి. పద్మావతీదేవి.

—ఉర్లగడ్డగారెలు—

ఒకసవాసేరు (10పలములు) ఉర్లగడ్డలను (బంగాళాదుంపలను) తెచ్చి వాటినినీళ్ళలోవేసి ఉడకబెట్టి వార్చి పైతోలువొలిచివేయవలెను. నాలుగైదు ఎండుమిరపకాయలు, కొద్దిగాఉల్లిపాయలు, అల్లం, కొత్తిమెర, ఇష్టపడిన కొద్దిగా వెల్లుల్లిరేకలు, దాల్చినచెక్క, లవంగాలు, యాలకాయలు, గసగసాలు, జీడిపప్పు, వేయించినశనగపప్పు, ఇష్టపడిన కొద్దిగా సోపు, వీటిని దుంపలకుతగినట్లుగావేసి మెత్తగానూరి ముద్దచేయవలెను. దుంపలలో ఉప్పు, పసుపువేసి పైముద్దను చేర్చి మెత్తగాజిగురువచ్చువరకు రుబ్బవలెను. (పొయ్యిమీదకళాయిపెట్టి 5 పలములు (సవాసేరులోసగము) నెయ్యిగాని నూనెగానిపోసి బాగాకాగినవెనుక మసాలాలుకలిపి రుబ్బినముద్దను చిన్ననిమ్మకాయలంతేసి ఉండలుచేసి వాటిని బిళ్ళలవలెతట్టి కాగుచున్నచమురులోవేయవలెను. ఒక్కొక్కతడవకు మూడునాలుగుకంటె ఎక్కువవేయగూడదు. అట్లువేసిన విడిపోవును. ఎఱ్ఱగావేగినవెంటనే తీసివేయవలెను. ఇటులనే అరటికాయలు, కంద కూడచేయవచ్చును.

—ఎస్. వేదపల్లి తాయారమ్మ.

—పరోటా—

అప్పుడేవిసరిన కొంచెము మెరుముగానున్న గోధుమపిండిని తీసుకొనివచ్చి కొంచెముఉప్పుకలిపిన నీళ్ళతో ముద్దగాచేసి, పిమ్మట చిన్నఉండలుగాచేయవలెను. కొంచెము చేతికి నెయ్యిరాసి ఆఉండలను చేతితోచిన్నబిళ్ళలుగాచేసి, అప్పడాలకఱ్ఱతో వత్తి, కొంచెముబరిపిండితో ముంచవలెను. కాలుచున్న పెనముమీద, ఈవత్తినగోధుమపరోటాలనువేసి కొంచెముకాలినతరువాత దానిమీద నెయ్యి రెండుప్రక్కలనువేసి బాగుగా ఎఱ్ఱగాకాలినతరువాత తీసివేయవలెను. దానిని పరోటాఅందురు. చాలరుచిగానుండును. ఎక్కువబలమును కలుగచేయును. దీని నెక్కువగా ఉత్తరహిందూస్థానములో వాడుదురు.

—గంటి కామేశ్వరమ్మ.

—సీయాళము—

ఒకగిన్నెతో బియ్యము, కందిపప్పు, పెసరపప్పు, మినపపప్పు, శనగపప్పులను సమానముగకొలిచి నా

పెట్టి దానిని వెనుక మెత్తగ రుబ్బవలెను. రుబ్బునపుడు దానికితగినయుప్పు, కొంచముజీలకఱ్ఱ, పచ్చిమిరపకాయలును వేసి రుబ్బవలెను. ఒకపాత్రలో సగమువరకు నీళ్ళుపోసి పైనగుడ్డకట్టి పొయ్యిమీద పెట్టి రుబ్బిన పిండిని ఆగుడ్డపైన కొంచముపలుచగ పెట్టి మూతపెట్టవలెను. కొంతకాలమైనవెనుక మూతతీసి పిండి ఉడికినరొండల దానినితీసి ఒకపళ్ళెములోపెట్టి కత్తితో చిన్నముక్కలుగ కోసుకొనవలెను. ఉల్లిగెడ్డలను పలుచని రేకులవలె తరిగి పచ్చిమిరపకాయలనుకూడ తరిగి పొయ్యిపై బాణలిపెట్టి అందు జాస్తిగ నూనెపోసి మినపపప్పు, జీలకఱ్ఱ, ఆవాలు, కరివేపాకును వేసి వేయించి దానిలోతరిగిన ఉల్లిగెడ్డముక్కలు పచ్చిమిరపముక్కలువేసి బాగుగవేయించవలెను. ఉల్లిగెడ్డముక్కలు బాగుగ నూనెలో ఉడికినతరువాత దానికి తగిన ఉప్పు, కారము, పసుపు (కొంచెముఎక్కువగ) వేసి కలిపి కొంచెమునీళ్ళుపోసి నీటితో ఉడికిన తరువాత కోసిపెట్టుకొనిన రొట్టెముక్క అందువేసి బాగుగా కలియబెట్టి కొంతవరకువేయించి దించు నప్పుడు నిమ్మకాయలరసముపిండి దించిభుజించిన రుచిగనుండును. —తాయి రత్నమాల.

— ఢిల్లీ దర్బార్ —

సేరుమైదాపిండితెచ్చి అందులోవెన్న, పాలమీగడ, పెరుగుగెడ్డ ఈమూడును తగుమాత్రము వేసి ముద్దగా కలిపి 5 ఘంటలసేపు నానబెట్టవలెను. తర్వాత అరపంపుజీడిపప్పు, అరపంపుచారపప్పు, అరపంపు బోసపప్పు యివన్నియు బార్లీమూకుడిప్రొయ్యిమీద పెట్టి అందులోనెయ్యిపోసి మరిగినపిమ్మట పైనచెప్పిన పప్పులువేసి బాగుగావేగినపిమ్మట ఒకపాత్రలోతీసి యుంచవలెను. నానబెట్టినమైదాపిండి మెత్తగాకలిపి ఈవేయించిన పప్పుదినుసులను ఆపిండిలోవేసి బాగా కలుపవలెను. కలిపినపిమ్మట చిన్నచిన్నబిళ్ళలుచేసి యుంచుకొనవలెను. ఒకపీకెపంచదార లేతపాకము పట్టియుంచుకొనవలెను. తర్వాత బార్లీమూకుడును ప్రొయ్యిమీదపెట్టి అందులోనెయ్యివేసి బాగుగామరిగినపిమ్మట ఈవేసియుంచినబిళ్ళలు మరిగిననేతిలో వేసి వేగించవలెను. బాగుగావేగినపిమ్మట ఆబిళ్ళలు తీసివేసి, తయారుగాయుంచిన పంచదారపాకములో వేయవలెను. బాగుగా చల్లారినతర్వాత ఆబిళ్ళలుతీసి భుజించవలెను. —మరకాని తాయారమ్మ.

— పులావ్ —

మొదటనూనె ½ పావును, నెయ్యి ½ పావునుకలిపి సలసలకాచవలయును. కాగుచున్నసమయాన అరతులము లవంగాలు, అరతులము యాలకపండ్లు, అరతులము దాల్చినచెక్క, కొంచెము కరివేపాకు, అర్ధసేరు నీరుల్లిపాయలు మొదలగునవికలిపి నూనెలోపడవేయవలెను. తరువాత పోపుసామానంతయు వేగినచో నూనెలో ఒకసేరు బియ్యము పరిశుభ్రముగాకడిగి పోయవలయును. బియ్యముపోసి ఉడుకుపట్టినతరువాత కొంచెముగా పెసరపప్పు, బంగాళాదుంపలు కూడవేయవలయును. పైసామగ్రి అంతటిలోను 1 సేరు బియ్యమునకు 2 సేర్ల చొప్పున నీరుపోయవలయును. ఇవిఅన్నియు ఉడుకుచున్నసమయానే కొంచెము చింతపండును, కొంచెము పసుపువేసి ఉడుకనీయవలెను. అదియే "పులావ్" అనిపించుకొనును.

—చదలవాడ రాఘవమ్మ.

— శంకరపాళాలు —

సెనగలు విసిరినపిండి ఒకసేరున్ను, గోధుమలు విసిరినపిండి ఒక అర్ధసేరున్ను కలిపి తగినంతఉప్పు, కారము, జీలకఱ్ఱ వేయవలయును. నేయివేసి ముద్ద అగునట్లు బాగాకలిపి, ఉండలుచేసి పీటమీద పూరీ వలె దళముగావత్తి, ముక్కలుగా కోయవలెను. తరువాత నెయ్యి బాణలిలోపోసి పొయిమీద పెట్టవలెను. (నెయ్యి అంతలేకపోయిన నెయ్యి, నూనె సమానముగా కలిపిఅయిన పెట్టవలెను). బాగా కాగిన తర్వాత ఈముక్కలను కాగుచున్న నేతిలో వేసి, బాగా వేగినపిమ్మట తీసి భుజించిన చాలా రుచిగానుండును. వేడిగానుండగానే భుజించవలయును. —పిండిప్రోలు కొండయాంబ.




# మనోరమ కన్య: (విన్నీ స్టూఅర్టు)

యం. అప్పన్న, డీ. వి. కృష్ణయ్య గార్లు

హిందూదేశమునందు ఫిల్ముసామ్రాజ్యము అనేక మంది సౌందర్యవతులకు నటీశిరోమణులు లభించుటవలన ఉన్నతస్థితికివచ్చుటకు అవకాశముకలిగెను. వారిలో గొప్ప పేరెన్నికగాంచినది మిస్ మనోరమ. ఈమె అసలునామధేయము మిస్ విన్నీ స్టూఅర్టు. ఈమె తొలుదొల్త నటించినఫిల్ములలో మిస్ కమల యను నామధేయముతో నటించెను.

ఈమెకు చిన్నతనమునుండియు ఫిల్ములనిన బహు అభిలాషగలిగియుండెడిది. ఎన్నటికైన ఫిల్ముకంపెనీలలో చేరవుదొరుకునాయని చూచుచుండెడిది. ఈమె అక్క సినీమాకంపెనిలో నట్టువరాలు (Actress)గా ప్రవేశించగనే ఈమెకుగూడ సినీమాకంపెనీలో ప్రవేశించవలెనను నభిలాష తీవ్రముగ గలిగెను.

ఎట్టుదుదకు తీవ్రముగ ఈమెకు మంచిదినములు వచ్చుటవలన ఈమె కోరికప్రకారము "యంగు ఇండియా పిక్చర్సు" (Young India Pictures) ఫిల్ముకంపెనీలో తావుదొరకెను. తరువాత ఈమె యాకంపెనీ విడిచిపెట్టి శారదాఫిల్ముకంపెనీయందు ప్రవేశించెను. ఇందులో "రాజపుట్ కెవలీయరు" (Rajput Cavalier) "జ్యూయల్డుఏరో" (Jewelled Arrow) "గార్డియన్ ఏంజెలు" (Guardian Angel) "నోబుల్సు ఒబ్లైజి" (Nobles oblige) "మార్టియర్సు ఆఫ్ లవ్" (Martyres of Love) "వైపర్సు" (Vipers) మొదలగు ఫిల్ములలో ప్రధానపాత్రలదాల్చి నటించెను. పిమ్మట ఇంపీరియల్ ఫిల్ముకంపెనీలో ప్రవేశించెను. ఈకంపెనీలో నీమె యాఖరుఫిల్ము "హెల్సు పేరడైజు" (Hell's Paradise) తరువాత సాగరుకంపెనీలో ప్రవేశించి ప్రపంచకమున పేరెన్నికవహించిన "ఇండియన్ డగ్లసు" మాస్టరు వితలుగారితో కలసి "అరుణోదయము" (Rising Sun) "స్లేవు" (Slave) యను ఫిల్ములలో ప్రధానపాత్రలనుదాల్చి నటించెను.

ఈమె నటించిన ఫిల్ములు పేర్పడసిన డైరక్టరులచే డైరక్టుచేయబడెను. వారిలో ముఖ్యులు "మిశ్రా" (Misra) "భేవు" (Bhave) "ఘరేఖాన్" (Ghare khan) "ఆల్తేఖరు" (Altekher).

ప్రకృతిసౌందర్యమంతయు ఈమెచే వరించినదో యనునటుల ప్రకాసించు వనితాలలామ. ఈమె కలకత్తానగరమునందు దున్నతకులమునకు చెందినయువతి. ఆంగ్లోయిండియన్ శాఖనురాలు. స్వతస్సిద్ధమైన సౌందర్యముగలది. మృదువైన శరీరముగలది. మనోహరమైన కనుబొమలును, విశాలమైన ఫాలతలమును, కించిత్ వక్రతమమైయొప్పు నాసికయును, నునుపారు గుండ్రని చెక్కిళ్ళును, పొడవై నల్లనైన కేశపాశములును, విశాలమైన నేత్రములునుగలిగిన మిక్కిలి సౌందర్యవంతురాలు. ముఖమునకు మరింత తేజోవికాశమును గలుగచేయు ముంగురులును, తెల్లనిశరీరచ్ఛాయయునుగలిగి ముత్యాలహారములనైనను ధిక్కరించు పలువరుసచే ప్రకాసించు నీనారీమణి అమెరికా ఫిల్ముకంపెనీలలో నటీశిరోమణియైన మేరీఫిల్బిను (Mary Philbin)కు సమానురాలని చెప్పవచ్చును. ఈమెవయస్సు ప్రస్తుతము సుమారు ఇరువదియొక్క సంవత్సరములు.

---

ఇక పైమాసమున సినీమానటి డి. ఆర్. ముత్తులక్ష్మిచరిత్ర ప్రచురింపబడును.

# కృష్ణాష్టమి

శ్రీకృష్ణభగవానుడు శ్రావణబహుళాష్టమీదివసమున జనించెను. హిందూదేశము ప్రతిగృహమునందును ఈయుత్సవము జరుపబడుచున్నది. ఈయుత్సవదినము జన్మాష్టమి, కృష్ణాష్టమి, కృష్ణజయంతి, గోకులాష్టమి అనుపేళ్ల బరగుచున్నది. శ్రీకృష్ణుడు శైశవమున గొల్లలయిండ్లలో పెరిగి పెరుగును, పాలును, వెన్నయు ముచ్చిలిన బాల్యక్రీడలను తలపించుటకు ఈనాడు వీధులలో నుట్లుపెట్టి వాటిని జనులచే కొట్టించుసంబరములు జరుగుచున్నవి.

—హిందువులపండుగలు.

శ్రావణే బహుళే పక్షే కృష్ణజన్మాష్టమీవ్రతం
నకరోతినరోయస్తు సభవతి క్రూరరాక్షసః.

—భవిష్యపురాణము.

# కృష్ణజననము

మ. మహితశ్రావణమేచకాష్టమినిశామధ్యంబునం బ్రస్ఫుర
ద్గ్రహముల్ ప్రోచ్చగృహంబు లందయిదు విభ్రాజిల్లఁబుత్రున్ యదూ
ద్వహుఁ బుణ్యాంగనగాంచె విశ్వజగదాధారోదయున్ ధర్మని
ర్వహణారంభధురీణు నిత్యవిభుతావర్ధిష్ణునిం గృష్ణునిన్.

వ. అప్పుడు.

క. అవ్వృష్టివీరుఁ డాత్మజు నావిర్భావము నెఱింగి యంతర్గృహమున్
వేవేగఁజొచ్చినకురే యావనజాప్తుండు దోడిచినట్లుండంగాన్.

మ. నెఱులై యొప్పు వినీలకేశములు నున్నిద్రాననాబ్జంబు నే
త్రైల నూత్నాంబుదతుల్యకాంతియును నై దివ్యప్రభావంబునం
గలయున్ మాఁగును లేక పుట్టిన శుభాంగం బద్భుతాపాదియై
నెలయుంగన్నులు విచ్చి చూచు తనయున్ వీక్షించి మోదంబునన్.

తే. పాపకర్ముఁడు కంసుఁడీపట్టెఁబట్టి మొగ్గనేయంగ నకట! యేనెట్లుసూతు
నెవ్వరునుగానకుండంగ నిపుడకొనుచు నరిగి యొంటుచో డాఁచెదనని తలంచి.

తే. నందగోపునింటికిఁ జని నవ్యసూతి యయ్యశోదను విష్ణుమాయావిమూఢ
యగుటనొండెఱుంగకయున్కి నాతడచటగొడుకుఁబెట్టి యాయమగన్న కూతుఁగొనియె.

వనజాక్షునిఁ దెచ్చుటయును దనసుతఁ గొనిపోవుటయును దానెఱుఁగక మూఁ
గినిద్రఁజొక్కి యుండెను వనజాక్షి యశోద రేయి, వసుధాధీశా!

—హరివంశము.

## శ్రీకృష్ణుడు: యోగమాయ శిశువులు



—చిత్రకారులు: యస్. యస్. శర్మ, మదరాసు.

ఈపటమునందలి పాత్రలు:

1. యశోద: నవప్రసూత, నిద్రావివశ.
2. వసుదేవుడు: శ్రీకృష్ణుని యశోదకడనిడి యోగమాయను గొనిపోవుచున్నాడు.
3. శ్రీకృష్ణుడు: బాల్యరమణీయమును, అనంతతేజమును అలరుచున్నాడు.
4. యోగమాయ: యశోదకుపుట్టి వసుదేవునిచే దేవకీదేవికడకు గొనిపోబడుచున్నది.

# శాంతమతి

కీ. శే. ఆలూరు వాసుదేవయ్యగారు

"ఈజగంబునఁ గాసుకుఁ బేరమాడి కోటికిఁ బడగనెత్తిన మనవైశ్యకులసముద్రంబున విషంబుపుట్టినట్లు హా! నాకడుపునఁబుట్టుటేల? పుట్టిబోఁ గుట్టుగఁగులగౌరవంబునకు వన్నెఁబుట్టింపక దిట్టతనంబునఁ గట్టెదుటనిల్చి చెవులకింపొందనిపల్కులుపల్కవచ్చునే? పల్కెనుబో! రాఁబోవుకాలంబునకుఁ బదిగురుకులజులలోఁ జుల్కఁదనంబునొందక నిల్కడఁగల కీర్తినొందునే? పొందెబో! నేనంతవఱకుండి, కనుదోయింజూడఁగలనె? ఔరా! ఏమి యీవింతకాలము. పుత్త్రికయై యీలాగునుండుటకుఁ గారణంబేమియుండు? కాని యిద్ది నాకుఁ బుత్త్రికాదు. శత్రురాలు. దీనిగర్వపుమార్గం బొక్కింతమాచెదఁగాక" అని తనకుఁదాన శాంతమతిపై వచ్చినకోపావేశమున మాటాడుకొనుచుండుసమయంబున భార్యయగు భద్రవతివచ్చి యిట్లనియె.

"ఆత్మేశా! ఏమికోపముగదుర నేమేమోయనుచున్నారు? ఎవరిని?" అనియడుగ నా కోపమున నిట్లనియె. "కాంతా! నీవింతవఱకు నాచెంతనిలిచివినియుండినచో, నంతయుఁదెలిసియుండును. అయిన నావింతకథఁ గొంతయొఱింగింతువినుము. శాంతమతిని, ప్రశాంతునుని నేనుజెంతకురావించి సంతోషంబుతో మనవైశ్యకులంబున నెంతధనంబుండినను, మఱెంత ధైర్యసాహసౌదార్యగుణంబులుండినను, ఎంతదానధర్మపరోపకారములుచేసినను, గర్వాతిశయంబున, నన్నియునావలననయినదనియు, నాకుసమానమెవరున్నారనియు, నావలననన్ని కార్యంబులగుననియుఁజెప్పరాదు. ఎవరెంతదూషించినను భూషించినను సమయోచితంబుగ వారితో మాటాడవలయునుగాని గోపమును సంతోషంబునుజూపరాదు. మఱియు ధనము సంపాదించి యొకరికి నప్పొసంగినను, గొంతధనము ప్రాణాపదకును, గొంతధనము దానధర్మంబులకును, గొంతధనము వ్యాపారాదులకును పెట్టుకుని యప్పిచ్చినధనమునందు రాఁబడినవడ్డిని యేర్పాటుగ జీవనంబునకుపయోగించుకొనవలయు. నావడ్డిరాకలు చాలనిపక్షంబున వ్యాపారంబునరాఁబడినలాభములోఁ గొంతయెత్తుకుని యన్నపానంబులకువ్యయపెట్టుకొనవలయు. లేనిపోనికార్యంబులకు వృథాసెలవొనర్పరాదు. ఎవరుగాని ధనముండువారింగనుంగొన్న పక్షమున నించుకయుడఁగి భయంపడుదురు. "కలిమి కులమునకుఁ గీర్తియన్నట్లు" కలిమి యుండినచోఁ గులముతక్కువగనుండినను గీర్తింబొందుదురు. కులమెక్కువై యుండి, కలిమి లేకుండినచోఁ గేవలహీనులని తలంతురు.

క. "దాసికొడుకైనఁగానీ కాసులుగలవాఁడెరాజు ఘనుఁడననొప్పున్."

అనునట్లు కొంతధనంబుండెనేని యెక్కాలంబునంగాని గౌరవమేగల్గుచున్నది. ధనం బున్నదని విఱ్ఱవీఁగి లేనిపోనిసెలవులిడుకొనరాదు. కట్టకడ "నాకులుకట్టి యమ్మటగాని, యుప్పు మొదలగునవియమ్మిగాని, కాసుకుఁగాసుచేర్చి పెట్టెయలోనిడవలెను. మనవాంధ్రులో

స్త్రీగాని పురుషుఁడుగాని కాలమువృథాగడపి, చేతఁగలధనమువ్యయముచేసుకొని జీవించుట లేదు. రంకుతనము, దొంగతనము, మించినమాటలు లేకుండ నన్యుల కనడఁగియుందురు. మఱియు స్త్రీగడించినధనము పురుషుఁడుతీసుకొనక, దానినొకసొమ్ముచేసి యీవలెను. స్త్రీని కేవలముగఁబిలువక గౌరవముగఁబిలువవలెను. పురుషుని స్త్రీ యదేవిధంబుగఁ బిలువవలయు, నెవరేనియొకవస్తువు కావలెననియడిగినప్పుడు, చేతఁగానున్న దాలేదాయని గ్రహించియుండినచో నడిగినవస్తువీయవలయును. లేనిచో నడిగినవస్తు వింకెక్కడయినం బోయి తీసుకొనుమని మంచిమాటలుచెప్పి పొమ్మనవలయును. మఱికొన్ని కార్యంబులకు నెవరైన మాటాడవచ్చిరేని వారిమాటలన్నియువిని సమయమునకుఁదగినమాటలు చెప్పిపంపవలయును. లేక మనవాండ్రుగాని యన్యులుగాని యేదైననడిగిరేని యింటనుండునో యుండదో తెలియదనియుఁ, జూచిచెప్పెదనియు ననవలయు. లేక మావాండ్రనడిగి చెప్పెదనని చెప్పవలయుంగాని తెగించి యేకార్యముగాని చేయరాదు. మించినమాటలు మాటాడరాదు. ఇదియునుంగాక స్వగురు, పురోహిత, రాజవర్యుల నెపుడు గౌరవించవలయునని యిట్లనేకనీతులు చెప్పి కట్టకడ మనకింతధనంబున్నదనియు, నీధనంబెల్లనెవరిదనియు, నెవరియదృష్టమువలన నింత ధనముకల్గెననియు, వేఁడుకగనడిగినందులకు, బ్రశాంతుఁ డేమియుఁజెప్పకుండె. శాంతమతిమాత్ర మీలాగనియె. 'తండ్రీ! కోపములేక వినుండు.

శ్లో. నహాయనైర్న పలితైర్న విత్తేనబంధుభిః
ఋషయశ్చక్రిరేధర్మం యోనూచాన స్సనో మహాన్.

అనునట్లు జనులకేండ్లుమీరుటచేతను, వెండ్రుకలుదెల్లనగుటచేతను, ధనముండుటచేతను, బంధువులుండుటచేతను గొప్పవారుకానేరరు. నిజజ్ఞానమెఱింగినవారే మహాత్ములని మునులుధర్మముచెప్పియుండుటచేత.

శ్లో. ధన్యానాముత్తమందాక్ష్యం ధనానాముత్తమంశ్రుతం
లాభానాంశ్రేష్ఠ మారోగ్యం సుఖానాంతుష్టిరుత్తమా.

అనునట్లు మనకుఁగావలసినవానిలో శక్తి మిక్కిలి శ్రేష్ఠమయినది. అందుఁజదువత్యంతశ్రేష్ఠమయినధనము. అందుత్తమంబయినది దేహారోగ్యము. అన్నిటికంటెఁ దృప్తిజెందియుండుట నదమలసౌఖ్యము. కాబట్టి విద్యాధనంబును, సమయోచితజ్ఞానంబును, ధైర్యంబును, పరితృప్తియును, సదాచారసంపన్నత్వంబును, దుష్కార్యవిముఖత్వంబును, సత్వగుణపరత్వంబును, భూతదయయును, నిగర్వంబును, యశోధనసమాదరణంబును, బంధుజనప్రీతియును గల్గియుండవలయునుగాని, "కఠినచిత్తంబున విత్తమునందుఁ బేరాశయిడి, రేయింబగలు ధనంబుగడించు నుపాయంబులుతడవి, ధనంబుఁగూర్చి, యింతదనుక చెప్పిన గుణంబులువదలియుండుట పాడిగాదు. అన్నిటకు విద్యయు సమయోచితజ్ఞానంబు నాకుండినంజాలుగాని నీధనంబునాకక్కఱలేదు. నీధనంబనుభవించువాఁడు నీకుమారుండుగాని నేఁ

గాను, నాయదృష్టము నాతోనుండును. నీవిత్తమును నీయదృష్టంబును నీతోనుండును. కల్లు ద్రాగినవానింజూచినమాత్రానఁ జూచినవానికిఁ గైపెక్కుటంగలదే? యట్ల ధనవంతుఁడగు నిన్నుఁజూచినమాత్రాన నాకు నీధనంబెట్లురాఁగలదు? గుఱ్ఱంబునకుఁ దోఁక పొడవుగనుండినచోఁ దనదేహమునకు విసరుకొనుంగాని మఱియొవరికేనిలాభమున్నదే? మఱియుఁ బామునకుఁ దలయందుమణియుండినను దనకుపయోగంబుగాని, యితరులకేమి ప్రయోజనము? అట్లు నీధనము నీకును, నీకుమారునకును బ్రయోజనము. నేను గుమార్తెనైనను, నేనిప్పుడు భర్తస్వాధీనురాలగుటంజేసి భర్తధనంబునొందుదాన, నికారణంబున నీధనమనుభవించునదృష్టము కుమారునిదిగాని నాకెట్లులభించును? కాఁబట్టి యదృష్టప్రకారంబు జరుగు. నీవిందులకూరకలేనిపోని బూతునీతులేలచెప్పెదవు?' అని దృఢంబుగఁబల్కుటంజేసి నాకుఁగడుకోపంబుగల్గి యట్లమాటాడుచుంటి. కానిమ్ము దీనియదృష్టమెట్టిదో చూడవలయు"నని భార్యతో మఱల నిట్లనియె.

"భద్రవతీ! రుద్రుఁడడ్డపడినను దయార్ద్రహృదయుఁడనై యీక్షుద్రురాలిని ధనాఢ్యునికిచ్చి వివాహముచేయుటలేదు. కేవలదరిద్రునికిచ్చి వివాహముచేసి నిద్రవోదును. నీవీ విషయంబునఁబ్రవేశింపకుము. ప్రవేశించితివేని యింటనుండితోలఁగింతు. ఔరా! కడుపునఁ బుట్టినబిడ్డకు నిట్టిదుర్గుణముపట్టుపడినదిగదా! కసవుండుచోట నావునుగట్టవలెనని పెద్దలు చెప్పినట్లు రసికుండును, ధనికుఁడును, విద్యాధికుండును, సుందరాంగుండును, సద్వంశసంజాతుండును, శ్రేయోభివృద్ధిగలవాఁడును, సద్గుణయుతుండునగు వరునికిచ్చి పెండిలిసేయ నెంచినందులకు ఎక్కువగఁజెఱువులునిండినను గుక్కకుగతుకుమానదన్నట్లు కేవలదరిద్రదశ ననుభవించునట్లు బ్రహ్మవిధించియుండఁగా నాతలంపేమిజరుగు?" అనిచెప్పుటంజేసి భద్రవతి కోపోద్రేకుడై యుండు భర్తవచనంబులకు నెదురాడఁజాలక, శాంతమతిని దగ్గఱకుఁజేరి "తండ్రికెదురాడనగునే"యని యనేకనీతులుబోధించెనుగాని శాంతమతివిని, "అదృష్టవిషయమునకేను మాటాడకమాన"ననియె. అందులకుఁ దల్లియగుభద్రవతి, శాంతమతియందుఁ గోపించి "బుద్ధిఃకర్మానుసారిణీ యనునట్లు నీకర్మ నీవనుభవించు"మని, యసూయపడి లోనికేగె.

ఇవ్విధంబుండ నొకనాఁడు వీధిలో నొకఁడు విస్తరాకులమ్ముకొనుచు వచ్చుచుండె. శాంతమతితండ్రి వానింజూచి మేడమీఁదనుండిదిగివచ్చి వానింజూడఁగా, నించుమించుగ నిరువదేండ్లప్రాయముగల్గి, శ్యామలవర్ణసుందరదేహముగలవాఁడై, స్వకులజుండుగనుండె. అంత వానింబిలిచి విస్తరాకులుబేరమాడునెపంబున గృహంబులోనికిరమ్మని యొకతిన్నెపై గూర్చుండఁబెట్టుకుని బేరమాడుచుండి యిట్లనియె:

"నాయనా! నీవేకులజుఁడవు? నీయూరిపేరేమి? నీపేరేమి? నీకుఁ దలిదండ్రులుగలరా!" యనియడుగుటంజేసివాఁడువినియిట్లనియె. "అయ్యా! నేనువైశ్యకులజుండ, నాయూరు జయపురము. నాపేరు భానుగుప్తుఁడనియందురు. నాతలిదండ్రులు కడుబీదవారై యుండి నాకుఁ

పండ్రెండవసంవత్సరవయసున్న వారుకాలగతినొందిరి. నాకెవరుగానిలేరు." అనఁగా శాంతమతితండ్రియగు నచ్యుతగుప్తుండు మఱల నిట్లనియె.

"నాయనా! నీగోత్రమేమి? నీవేమయినఁ గొంతచదువుకొనియున్నావా?" అనఁగా భానుగుప్తుఁడు "అయ్యా! నాతండ్రి యిక్ష్వాకులగోత్రమని చెప్పుచుండఁగా వినినవాఁడను, నాకుఁ బేళ్లు వ్రాయఁ దెలియునుగాని యెక్కువుగఁ జదువురాదు. చదువువచ్చి లెక్కలుపక్కలు దెలిసియుండినచో నొకచోట నేదైననొక్కయంగడిపెట్టుకుని జీవింపనే? కాఁబట్టి నాకుఁ జదువురాదు. ధనములేదు. నిలుచుటకిల్లులేదు. నాగతింగనిపలుకరించువారులేరు. కడకొక్కపూఁటపస్తుండినం బ్రియంబున నన్నడుగువారులేరు. నాకీబీదతనంబునందుఁ బెండ్లియగునని తలంచలేదు. పసుచునిచ్చువారెవరు?" అనఁగ నచ్యుతగుప్తుండు మనంబున నిట్లుతలంచె: "ఏమిది? కాకతాళన్యాయంబుగ, శాంతమతివివాహంబునకు నేఁదలచినట్ల వరుఁడింటికే వచ్చెను? వీఁడు సత్కులసంజాతుండుగనుండుటగాక బాల్యదశతో సుందరాంగుఁడుగనున్న వాఁడు. మఱియుగోత్రంబులు సమకూడినవి. శాంతమతిని నిట్టిధనవిహీనునికిచ్చి పెండ్లి చేసి కొంతకాలము వీరిద్దఱియదృష్టముచూడవలయును, గష్టపడుచుందురేని యపుడు దగ్గఱచేర్చి ధనంబిచ్చి జీవనంబుసేయుఁడనిచెప్పుదము." అనినిశ్చయించి యాభానుగుప్తునితో నిట్లనియె.

"భానుగుప్తుఁడా! నాకుఁజదువురాదనియును, బసుచునిచ్చి పెండ్లిసేయువారులేరనియు, ధనవంతుఁడుకాననియుఁ జెప్పితివిగదా! కానిమ్ము. నీకు నాకుమార్తెనిచ్చి వివాహముచేసెదను. నీయిష్టమెఱింగింపు"మనఁగ నాభానుగుప్తుఁడువిని "అయ్యా! సరిసరి! బాగుగఁ జెప్పితిరి. ఏనుఁగెక్కడ యెనుబోఁతెక్కడ? సింగంబెక్కడ తోఁడేలెక్కడ? బంగరుకొండయెక్కడ ముండ్లురాలుగలగుట్టయెక్కడ? ఆహా! యేమిది! మహాధనసంపన్నులగు మీకును నిర్ధనుండగునాకును సంబంధంబుగల్గుటెట్లు? ఊరక నాతోఁ బరిహాసంబుగఁజెప్పుచున్నారా యేమి? మఱియు ధనికులు దరిద్రులంజూచి గేలిసేయుట నైజముగదా! ఈమాటలతో నాకేమిప్రయోజనములేదు. మీరు విస్తళ్లెత్తుకొనుచున్నారా! లేకయెత్తుకొనరా! యెత్తుకొనునట్లయిన దాని క్రయధనమిచ్చిపంపుఁడు. నన్నూరకయిందునిలువఁబెట్టకుఁడు. నాకు రిత్తకోరికలేలపుట్టించెదరు?" అనిచెప్పుటంజేసి యచ్యుతగుప్తుం డిట్లనియె.

"భానుగుప్తుఁడా! నేనిపుడు నీతోఁజెప్పినమాట నిజముగాని పరిహాసంబుగఁజెప్పినది గాదు. నాకుమార్తెను నీకిచ్చుటకు నిష్టపడియున్నాను. కల్లమాటలని తలంపకు"మనిన నాభానుగుప్తుండు మనంబున "ఏమిది యాశ్చర్యము! ఇతఁడు గొప్పధనాఢ్యుఁడై యుండి, కుమార్తెను ధనికుని కీకుండ నాకునిత్తునని చెప్పుటకు హేతువేమో తెలియకున్నది. యోచింపఁగాఁ గుమార్తెకేదైన నంగవైకల్యముండునో? లేక కుమార్తెకు నేండ్లుమీరినందున నెవరుగాని వివాహమాడకయుండుటంజేసి ఈరీతి నాకుఁజెప్పువాఁడో? అయినంగానిమ్ము. కుమా

ర్తనిత్తునని చెప్పుట కడుశుభంబని చెప్పగావినియున్నాముగదా? కాఁబట్టి వివాహంబునకు నొప్పుకొంద”మని తలంచుచుండఁగా నచ్యుతగుప్తుఁ డిట్లనియె.

“నాయనా! ఏలయూరకయాలోచించెదవు? హరిహరాదులుసాక్షిగఁ గుమార్తెనిచ్చి వివాహముచేయుటనిశ్చయము. నీవిఁక వి స్తళ్ళమ్ముటకునేగకు. రమ్మిలోనికి నని పిలుచు కునిపోయి రత్నకంబళముమీఁదఁ గూర్చుండఁజేసి భార్యకడకేగి భద్రవతీ! శాంతమతికిఁదగిన వరుని నియమించినాను. నీవాతనిఁజూడుము” అనఁగా నామెవచ్చిచూడఁగా, శాంతమతికిఁ దగిన వరుఁడై యుండుటకు మనంబునసంతసించి ధనికుఁడుకాఁడనితోఁచినను, దానందులకు నేమియుఁచెప్పుటకులేక భర్తతో “మీరిష్టపడితెచ్చినవరునియందు నేనొకదోషముచెప్పుట పాడిగాదు. మీయిష్టమునకు నేనొప్పుకొనియున్నదాన” నని చెప్పుటంజేసి యయ్యచ్యుత గుప్తుండు తత్క్షణమ తనపురోహితుండగు పశుపతిశర్మగారిని రావించి సమర్యాదపూర్వకం బుగఁగూర్చుండఁజేసి యిట్లనియె. “స్వామీ! నాకుమార్తెయగు శాంతమతికి వివాహమెప్పు డగునో జాతకముచూచి చెప్పుఁడు?” అని ఫలపుష్పదక్షిణతాంబూలంబులతో జన్మపత్త్రిక నొసంగుటంజేసి, యాతఁడాజాతకము బాగుగఁజూచి యచ్యుతగుప్తునితో నిట్లనియె.

“అచ్యుతగుప్తుఁడా! యీజాతకమునందు నెట్టిదోషములులేవు. ఈజాతకము పార్థివ సంవత్సరశ్రావణశుద్ధయేకాదశీశుక్రవారము పూర్వాషాఢానక్షత్రము సింహమాసమేడవ తేది సూర్యోదయాది-౨౧-ఘడియలకు మేషలగ్నమునందుఁబుట్టినందున నిపుడు సూర్య దశయందు రాహుభుక్తిజరుగుచున్నది. ఈభుక్తిలో నిపుడు వివాహమగుటకు సందియము లేదు. పిదప నీజాతకురాలికి మహదైశ్వర్యమనుభవించు నదృష్టమున్నది. భర్తృభావము బాగుగనున్నది. ఇంతయేల? ముహూర్తముగూడ నిపుడే నిశ్చయించిచెప్పిపోయెద. నమ్ము హూర్తంబునకు వరనిశ్చయముచేసి వివాహంబు బాగుగజరుపుఁడు” అని చెప్పుటంజేసి యచ్యు తగుప్తుండు “విప్రోత్తమా! వరనిశ్చయంబుచేసితి, నిదిగో వరుండు. చూచితిరే? యితనిపేరు భానుగుప్తుఁడు. కనుక ముహూర్తము మీయిష్టప్రకారము నిశ్చయించిచెప్పుఁ”డనఁగ నా విప్రుండు తారాబలచంద్రబలయుక్తంబగు సుముహూర్తంబొండుచూచి నిట్లనియె: “అచ్యుత గుప్తుఁడా! నేఁటికి నాల్గవనాఁడు, పగలుపండ్రెండుఘడియలకుమీఁద వృషభలగ్నమునందు బాగుగనున్నది.” యని చెప్పుటంజేసి యాధనికుండుసంతసించి పురోహితునకు బసదనంబిచ్చి పంపి, యాతత్క్షణమ, తనబంధుమిత్రాదులకు వివాహపత్త్రికలనుబంపి, యాదినము భాను గుప్తునితోఁడంగూర్చుని భుజించి వివాహమునకువలసిన పదార్థంబులందెప్పించి, భద్రవతితో నిఁక నాలస్యముసేయక పెండ్లిపనులుచేయించుమనిచెప్పి తాను బందిరులుమున్నగునవి వేయించుచుండె. ఇట్లుండఁగా శాంతమతి భానుగుప్తుని ముఖంబాలోకించుటంజేసి మనంబున

శ్లో. సహిసర్వేషుభూతేషు జంగమేషుధ్రువేషుచ
వసత్యేకోమహానాత్మా ఏనసర్వమిదంతతం.

అనునార్యోక్తివలె భగవంతుఁడొక్కఁడు, లోకంబులం జరాచరవస్తువులందంతట వసించుచున్నాఁడు. మఱి యతఁడు సర్వోత్కృష్టుఁడు, దీనజనాధారుండనియుఁ జెప్పఁబడుచున్నవాఁడు. అట్టిసర్వేశ్వరుని సంపూర్ణదయ నాయందుండినపక్షంబునఁ దలిదండ్రులును, మఱెవ్వరైనను, దురుద్దేశ్యముదలంచినచో, నది సదుద్దేశ్యముగాకమానునె? ఆహా! జగంబున జనంబులకుఁగామము, కోపము, జంతుహింస, అత్యాశ, గర్వము, తిరస్కారస్వభావము, నిర్దయ, అసూయత, దుస్సాంగత్యము, నిజాత్మజ్ఞానరహితము, ఇట్టిసడవళ్ళు ముఖ్యముగ జన్మదినమునుండి కలుచున్నదిగాని, సద్గుణములురావు. కాఁబట్టియుగదా? కన్నతండ్రి నిర్దయచిత్తుఁడై నిర్హేతువుగఁగోపంబుదెచ్చుకుని, నాయదృష్టమును బరికింప నేమేమో దుస్సంకల్పంబుసేయునె? చేసెఁబో! క్షేత్రంపురుషకారస్తుఁ దైవంబీజముదాహృతం అనునట్లు పురుషప్రయత్నము పొలమువంటిది. దైవయత్నము విత్తనమువంటిది. ఈరెండునుజేరినచోఁ బైరగుచున్నది. ఆబాగు దనప్రయత్నంబునకు దైవంబు దోడ్పడకుండెనేని యేకార్యంబుగాని కానేరదుగదా! ఇపు డీతని దుష్ప్రయత్నంబునకు దైవముదోడ్పడక, నాయందు దయగలవాఁడై పాలులోఁ జక్కెరపడినట్లు మంచిగుణవంతునిగానే భర్తనొసంగె. మఱియు నీతనిముఖముఁజూడఁగ నెంతయుశాంతత్వమును, దయయును గలవాఁడుగ నుండుటఁగాక, రూపవంతుఁడుగనున్నవాఁడు. ఎక్కువచదువులేకపోయినను, ధనహీనుఁడై యుండినను భగవంతుఁడిచ్చినభర్తను గాపాడుట ధర్మంబు. అందుపై నదృష్టప్రకారము జరుగు"ననితలంచె. భద్రవతిమాత్రము భర్తపోయినస్త్రీవనుండె.

అంత నచ్యుతగుప్తుండు కేవలదరిద్రుండు పెండ్లిచేసినట్ల, ముహూర్తదినంబున శాంతమతిని భానుగుప్తునికిచ్చి వివాహంబొనర్చి, వచ్చినబంధుమిత్రాదుల సగౌరవంబుగనంపి యల్లునింజూచి యిట్లనియె.

"అయ్యా! ఇఁక నీభార్యనుబిలుచుకుని యెందేనిపొమ్ము. నాగృహంబున నిఁక నరక్షణంబు శాంతిమతియుండందగదు. దానికిఁ దలిదండ్రులగు మేముసేయుకార్యమెంతమట్టుకో యంతయుఁజేసియైనది. శాంతమతి నీతోనుండఁదగినది." అనిచెప్పుటంజేసి భానుగుప్తుఁడు తనమనంబున నిట్లుదలంచె.

"ఔరా! యీయచ్యుతగుప్తునిపట్టుదల యిపుడుదెలిసె, శాంతమతియందు నేదియో రొకమచ్చరంబిడుకొని యీలాగుచెప్పుచున్నాఁడు. కాఁబట్టియగదా, వీధింబోవుచున్న నన్నుఁబిలచి కుమార్తెనిచ్చి వివాహముచేసెదననివచించె? అట్టిహేతువులేనిచో, నితఁడు గొప్పధనికుఁడయ్యుఁ గుమార్తె కొకసొమ్ముగాని యిడక, యొకమంచిచీరగాని యొసంగక, డంబముగ నృత్తగీతవాద్యంబు లేదియు లేకుండ, నుల్లాసంబుగవచ్చిన బంధుమిత్రాదులకునైన విందుసేయక, కేవలవడ్డపెండ్లినలెఁజేసినవాఁడు. కానిమ్మితఁడిట్లుచేసినను, భార్యకూడ యితనికంటెఁ గృపణస్వభావముగలదియై యుండునట్లున్నది. శాంతమతితమ్ముఁడు బాలకుండు

గనుక వానిసంగతి యెంచదగదుగదా? మఱియు శాంతమతియందు నేదైనదుర్గుణంబుండునని తలంచినచో, నీనాఁటిదనుక దానిచదువునువింటిని, దాని నీతివచనంబులాలించితిని, దాని రూపమునకుఁదగిన విద్యావినయోచితజ్ఞానంబులున్నవి. పరికింప నెట్టిదుర్గుణహేతువును దెలియఁబడలేదు. ఏదెట్లువోయిననేమి నిర్ధనుండనగు నేను కేవల మొక కసవుపోఁగుతోఁగూడ సమముకాకయుండినను, దేవుఁడు నింతదయఁజూచినందున నిమ్మెయివివాహంబయ్యె. అహా! దేవునిమహిమ నేమనివర్ణింపనగు? అతఁడెల్లలోకములందు, నన్నిభూతములందు వ్యాపించి యెల్లప్రాణులకు నాశ్రయుఁడై, జీవరూపుఁడై, గుణాతీతుఁడై, యన్నింటిచూచుచుం బ్రపంచంబునకు, మఱుఁగుగనుండి రక్షించుచున్నాఁడనుటకు సందియంబుగలదే? ఆయనదయలేనియెడ నేకార్యంబుగానియగునే? అట్టిమహానుభావునికృపనేఁక బరమసుఖం బనుభవింపఁగలమనుటకు సాధనభూతంబుగ శాంతమతిలభించినందున నాదరిద్రసముద్రంబిఁక నింకఁగలదు" అని తలంచుచుండె.

ఇవ్విధంబుండఁగా భద్రవతి భోజనంబునకులెండని చెప్పుటంజేసి స్నానాదికృత్యంబులు నిర్వర్తించి యంద ఱానాఁడు భుజించిరి. మామచెప్పినయట్ల భానుగుప్తుఁడు ప్రయాణసిద్ధం బయియుండె. భద్రవతి కుమార్తెకుఁ బసపుఁగుంకుమదొసంగి యల్లునివెంట నంపించునపుడు మనంబున నించుక దుఃఖంబుగల్గెనుగాని, యచ్యుతగుప్తుండుమాత్రము కఠినాత్ముఁడై, యల్లునితోఁ బోయిరమ్మనిచెప్పె. శాంతమతి తల్లికినమస్కరించి తండ్రియొద్దకువచ్చి నమస్కరించుటంజూచి యతం డిట్లనియె. "శాంతమతీ! నీయదృష్టం బెట్టిదోచూచువఱకు నిన్ను గమనించుటలేదు. నాయింటికి నీవిఁక రాఁగూడదు. పొ"మ్మని కఠినోక్తులాడుటంజేసి శాంతమతి "తండ్రీ! తీండ్రంపుబల్కులు పల్కినందు నొకప్రయోజనములేదు.

శ్లో. యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే
యస్యమస్సర్వభూతేషు జీవితం తస్యశోభితే.

అనునట్లు గర్వంబెవనికిలేదో, మనస్సెవనికినిర్మలమై యున్నదో, యెవఁడన్నిజంతువుల యందు సమానబుద్ధికల్గినవాఁడో, వానిబ్రతుకు బాగుగఁబ్రకాశించును గాఁబట్టి యూరకనిర్దయోక్తులేలయాడెదవు? కాలం బిదేరీతినుండునని తలంపకు. నీవాడినమాటలు మఱచుటలేదు. సత్యమేజయతే నానృతమ్ అనునార్యోక్తివలె సత్యము జయించు, నసత్యము జయించదు. పల్లముంకుచోట నీరునిల్చును. మెట్టయందునిలువదు. ఈవచనంబులు మనంబునందిడుకొని భవిష్యత్కాలమును బరికించుము. బాణమువలనికల్గినగాయము మానునుగాని, కఠినపుఁ బల్కులచేత మనంబునంగల్గినవ్రణము మానదు. కాఁబట్టి నాయదృష్ట మీరు గమనింపఁబనిలేదు. నన్నెఁదుఁగలదని స్వప్నమునందైనం దలంపకుము. నీకు నేగుమార్తెగాను. నాకు నీధనంబెపుడుగాని యీఁబనిలేదు. తొల్లి యేదోఋణముండి మీకడుపులంబుట్టితి. నా ఋణంబువాయుటకు నిదిగో మఱల నమస్కరించుచున్నాను." అని మఱలఁ దలిదండ్రులకు

గనుక వానిసంగతి నెంచదగదుగదా? మఱియు శాంతమతియందు నేదైనదుర్గుణంబుండునని తలంచినచో, నీనాఁటిదనుక దానిచదువునువింటిని, దాని నీతివచనంబులాలించితిని, దాని రూపమునకుఁదగిన విద్యావినయోచితజ్ఞానంబులున్నవి. పరికింప నెట్టిదుర్గుణహేతువును దెలియఁబడలేదు. ఏదెట్లుపోయిననేమి నిర్ధనుండనగు నేను కేవల మొక కసవుపోఁగుతోఁగూడ సమముఁగాకయుండినను, దేవుఁడు నిండుదయంజూచినందున నిమ్మెయివివాహంబయ్యె. అహో! దేవునిమహిమ నేమనివర్ణింపనగు? అతఁడెల్లలోకములందు, నన్నిభూతములందు వ్యాపించి యెల్లప్రాణులకు నాశ్రయుఁడై, జీవరూపుఁడై, గుణాతీతుఁడై, యన్నింటిఁజూచుచుం బ్రపంచంబునకు, మఱుఁగుగనుండి రక్షించుచున్నాఁడనుటకు సందియంబుగలదే? ఆయనదయలేనియెడ నేకార్యంబుగానియగునే? అట్టిమహానుభావునికృపచేఁ బరమసుఖం బనుభవింపఁగలమనుటకు సాధనభూతంబుగ శాంతమతిలభించినందున నాదరిద్రసముద్రంబిఁక నింకఁగలదు" అని తలంచుచుండె.

ఇవ్విధంబుండఁగా భద్రవతి భోజనంబునకులెండని చెప్పుటంజేసి స్నానాదికృత్యంబులు నిర్వర్తించి యందఱానాఁడు భుజించిరి. మామచెప్పినయట్ల భానుగుప్తుఁడు ప్రయాణసిద్ధం బయియుండె. భద్రవతి కుమార్తెకుఁ బసపుఁగుంకుమయొసంగి యల్లునివెంట నంపించునపుడు మనంబున నించుక దుఃఖంబుగలిగెనుగాని, యచ్యుతగుప్తుండుమాత్రము కఠినాత్ముఁడై, యల్లునితోఁ బోయిరమ్మనిచెప్పె. శాంతమతి తల్లికినమస్కరించి తండ్రియొద్దకువచ్చి నమస్కరించుటంజూచి యతం డిట్లనియె. "శాంతమతీ! నీయదృష్టమెట్టిదో చూచువఱకు నిన్ను గమనించుటలేదు. నాయింటికి నీవిఁక రాకూడదు. పొ"మ్మని కఠినోక్తులాడుటంజేసి శాంతమతి "తండ్రీ! తీవ్రంపుబల్కులు పల్కినందు నొకప్రయోజనములేదు.

శ్లో. యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే
యస్యమస్సర్వభూతేషు జీవితం తస్యశోభితే.

అనునట్లు గర్వంబెవనికిలేదో, మనస్సెవనికినిర్మలమైయున్నదో, యెవఁడన్నిజంతువులయందు సమానబుద్ధికల్గినవాఁడో, వానిబ్రతుకు బాగుగఁబ్రకాశించును గాఁబట్టి యూరకనిర్దయోక్తులేలయాడెదవు? కాలం బిదేరీతినుండునని తలంపకు. నీవాడినమాటలు మఱచుటలేదు. సత్యమేవజయతే నానృతమ్ అనునార్యోక్తివలె సత్యము జయించు, నసత్యము జయించదు. పల్లముండుచోట నీరునిల్చును. మెట్టయందునిలువదు. ఈవచనంబులు మనంబునందిడుకొని భవిష్యత్కాలమును బరికించుము. బాణమువలనికల్గినగాయము మానునుగాని, కఠినపుఁ బల్కులచేత మనంబునంగల్గినవ్రణము మానదు. కాఁబట్టి నాయదృష్ట మీవు గమనింపఁబని లేదు. నన్నెఁడుఁగలదని స్వప్నమునందైనం దలంపకుము. నీకు నేగుమార్తెగాను. నాకు నీధనంబెపుడుగాని యీఁబనిలేదు. తొల్లి యేదోఋణముండి నీకడుపునంబుట్టితి. నా ఋణంబువాయుటకు నిదిగో మఱల నమస్కరించుచున్నాను." అని మఱలఁ దల్లిదండ్రులకు

నమస్కరించి, భర్తకడకుంబోయి, "యింక నిందుండి వెడలుదముర౦"డని నుడువుటంజేసి, భానుగుప్తుఁడు లేచి వీథిగుమ్మముపదలిపోవుచుండ శాంతమంతి "తలిదండ్రులారా! మీయదృష్టంబును రక్షించుకొనుఁ"డని చెప్పి భర్తవెనువెంటంబోయె. పిదప భద్రవతీయుచ్యుతగుప్తులు కూఁతునల్లులెందేగిరనికూడచూడక వీథిద్వారముపఱకువచ్చి నిలిచిచూచి గృహంబునకేగిరి. ఆహా! ధన మెంతకఠినమానసముగఁ జేయుచున్నదో చూచితిరా? —కొదువ.

# నిర్వేదము

అంబటిపూడి నరసింహశర్మగారు

క. తనుగోరు సాళ్వజననాథునిచే నవమానమొంది, తోరపుదుఃఖ
ముమ్మున నంబ భీష్ముజేరియు నను నిట్టుల రోషదీపితాత్మికయగుచున్.

ఉ. "పీసరవోక నాకనులవెంటస్రవించెడి బాష్పబిందువుల్
దోసిటనెత్తిపోయునెడ దుర్భరశాపజలాయితమ్ములై
నీసకలార్థసంపదల నిల్వగనిచ్చునె, రాతిగుండెవయే
బ్రాసివి, నాదుజీవనప్రభాతమునన్ విషవాయువైతివే.

క, కొలకొల నిరతము నాకన్గొలకులస్రవియించు బాష్పజలధారలు నీ
తలవాకిట బ్రవహింపుచు గలుపవె నిన్విలయవీచికానివహమునన్.

ఉ. గాసి నవీనజీవనసుఖమ్ములబాసి, యజస్రవేదనా
యాసత నార్చు నాదుహృదయాగ్నిని నెఱ్ఱగ క్రాగువేడిని
శ్వాసపరంపరాహతి విషమ్మటు నీతలకెక్కిపోదె, గం
గాసుత! యేమెఱుంగనియొకర్తుక నీగతిగాసిపెట్టెదే.

చ. విమలనవీనకాంతు లొదవించెడు నాదగుజీవనప్రసూ
నమును ధగద్ధగజ్వలదనంగ హుతాశనరోచులందు హా
మమునొనరించెదే కరుణమాలి, నిరంతరబ్రహ్మచర్యతా
పమున రసమ్ముగోల్పడినవాడు సుమచ్ఛవి నేమెఱింగెడిన్.

క. ఈకుంజోడగుభర్తను గూడియు ప్రాపంచికపుసుఖోన్నతిగననో
చేడియ వెతలంబెట్టంగూడునె ధర్మముజెప్పు వాడేలేడే.

చ. అరిభటకోటిపైని సమరాంగణభూమిని బల్మిజూప నా
కలికుదనమ్ము చేలయుగుకాంతపయిన్ బరగింప జూచు నిన్
సరియగువీరులెవ్వరు ప్రశంసగొనెదరు, సౌకుమార్యవి
స్తరమగుపూవుతీవ నసిధారలకున్ బలిసేయజూచెదే.

క. పలుధర్మశాస్త్రములనుం దిలకించెదుగా వియన్నదీజాత! యెటన్
కలకంఠికంటకన్నీరొలికిన సిరియుండదనుట నొగిజూడవొకో?"

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## వనలక్ష్మి

చేబోలు సుబ్రహ్మణ్యశర్మగారు

ఏమేమిటాతోట?
అరటీలతోట.
ఎట్లాంటిదాతోట?
యిట్లాంటితోట.
వేసేమురాతోట
వేసంగితోట

మంచీదిరాతోట
మామంచితోట
లేతాదిరాతోట
పువ్వుల్లతోట
పీపీలురాతోట
పిందిల్లుతోట

కాయాలిరాతోట
కదళీలతోట
పండాలిరాతోట
భాగ్యంపుతోట
చూడాలిరాతోట
చోద్యంపుతోట.

౨. పాటలు

## పిల్లలపాటలు

తులసి లక్ష్మీనారాయణమూర్తిగారు

చింతపువ్వు చింతపువ్వురాలంగ
చిమ్మిలిబొట్టూ బుల్లిచెంబు
దండేవేళ్లేను నామఱిది
దండలుతెచ్చాడు నామఱిది
గోలకొండపంపించి
గోటూరవికలు తెప్పించి
కుమ్మరాళ్ళింటికి పంపించి
కుమ్మరిమట్టీ తెప్పించి

బొమ్మారిళ్ళూ వేయించి
బొమ్మారింట్లో బిడ్డనికంటే
అత్తా తలకీ ఆముదంలేదు
మామా తలకీ మడ్డీలేదు
అల్లవారింటికీ చల్లకెడితే
అల్లవారికుక్కొచ్చి బొంయ్‌మంది
పుట్టలో నాగన్న గుంయ్‌మన్నాడు
నాకాళ్ల గజ్జలు గల్లుమన్నాయి.

3. కథలు

## తెలివిగలమనుమడు

శ్రీమతి కూచిభొట్ల గంగమాంబగారు

అనగనగా ఒక బ్రాహ్మణునకు ఒక కొడుకుండేవాడు. కొడుకంటే ఆయనకెంతో ప్రేమ. కాలంగామరి! కొన్నేళ్ళకు తండ్రి ముసలివాడయాడు. కొడుకు పెద్దవాడయాడు. ఆస్తిమీద అధికారం కొడుకు చేతులో పడింది. తండ్రీ,తనూ ఒకేయింట్లోవుంటే తనయిష్టమువచ్చినట్లుగా ప్రవర్తించటానికి వీలుకలిగిందికాదు. పెద్దవాడు గనుక యేదోహితవుమాటచెప్పేవాడు. అట్లాచెప్పించుకోటమే గౌరవానికి భంగమనుకున్నాడు

కొడుకు. సరే! తండ్రిని గొడ్లదొడ్లో ఒకపాకవేసి ఆపాకలో వుండమన్నాడు. ఒకమూకుడు కొనియిచ్చాడు గంజితాగటానికి. ఏంచేస్తాడు పాప మాముసలిబ్రాహ్మణుడు. అట్లాగే పాకలో వుంటూవుండేవాడు. రోజూవేళకువెళ్లి గంజిపోయించుకుని త్రాగేవాడు. తనఖర్మాన్నిగురించి చింతించేవాడు. ఇట్లాకొంతకాలం జరిగింది. ముసలిబ్రాహ్మణుని కొకమనుమడు పుట్టాడు. వాడు పదేళ్లవాడయ్యాడు. ఓరోజున తలవనితలం పుగా తాతగారిస్థితి చూచాడు. చాలావిచారపడ్డాడు, తనతండ్రిచేసిన ఘోరం తలుపునకు తెచ్చుకొని. ఆవేళ తాతతో ఆలోచించాడు యేమిటో. మరునాడు తాతగారి దగ్గరకెళ్లి "తాతా! తాతా! నీవు యివాళ్ల గంజికి యింటికివచ్చినప్పుడు మానాన్న చూస్తుండగా మూకుడు క్రిందపడేటట్టుగాపడేయి. తరువాతపని నే చేస్తాలే" అని అన్నాడు. అట్లాగే చేశాడు తాత. ఇంతట్లో కుర్రాడు ఒక పెద్దకర్రతీసుకువచ్చి "నీకెంతఅదిరిపాటూ: మిడిసి మిణ్ణాగులు అయిపోతున్నావే! మూకుడుక్రింద యెందుకుపడేశావు. అది పగిలిపోయిందిగదా! రేపుప్రొద్దున మళ్లీ మానాన్నకు ఎవరుకొంటారనుకున్నావు? దీన్తోనేకాలం గడుపుదామని నేననుకుంటే"అని గదమాయించాడు. కుర్రాడితండ్రీ యిదంతావిన్నాడు. పాపం నిర్జీవయిపోయినాడు ఆమానవుడు. మనసుమనసులోకి వచ్చింతరువాత ఆయన తండ్రికాళ్లమీదపడి క్షమించుమని వేడుకున్నాడు. మళ్లీఅందరూ కలిసేవుంటున్నారు. కుర్రవాడి తెలివికి అందరూసంతోషించారు. కథ కంచికి, మన మిక్కడే!

# శ్రావణభాద్రపదాలు

శ్రీమతి బసవరాజు వేంకటరాజ్యలక్ష్మమ్మగారు

ఒకవూళ్లో ఒకబ్రాహ్మణదంపతులుండేవాళ్లు. బ్రాహ్మడు చాలాగడుసువాడు. భార్య వుత్తఅమాయకురాలు. ఒకరోజు బ్రాహ్మడు వూరికివెడుతూ "ఒసే శ్రావణభాద్రపదాలొస్తున్నవి. సామానులన్నీ జాగ్రత్తపెట్టూ" అని చెప్పివెళ్లినాడు. ఆయన వెళ్లిన కాసేపటికి వాకిట్లోనుంచి పిళ్లసంభాషణవింటూన్న యిద్దరుదొంగలు లోపలికొచ్చి "అమ్మా! కొంచెము మంచినీళ్లిస్తారా?" అనిఅడిగారు. 'ఎవరు? నాయనా!' అనిఅడిగిందాబ్రాహ్మణి. "మేము శ్రావణభాద్రపదాలము" అని చెప్పారుదొంగలు. ఆబ్రాహ్మణి సంతోషపడి వారిని చాలామర్యాదచేసి 'మాయిల్లు పావనంచేశేరా?' అంటూ పిండివంటలతో భోజనంపెట్టి ఇంట్లో శ్రావణభాద్రపదాలకోసం మొగడు జాగ్రత్తపెట్టినసామానంతా వారికిసమర్పించి నమస్కారంజేసి "మీరుదయవుంచి అప్పుడప్పుడు వస్తూండవలె" నని చెప్పి వాకిలిదాకా సాగనంపి వచ్చింది. మొగుడు వూరినుంచి వచ్చినతర్వాత భార్యని "ఏమిటే నేనువెళ్లినతర్వాత విశేషాలు?" అనిఅడిగాడు. "విశేషాలకేం, చాలావున్నవి. మీరువెళ్లగానే శ్రావణభాద్రపదాలొచ్చారు. వాళ్లని చాలామర్యాదచేసాను" అనిచెప్పింది బ్రాహ్మణి. "నేనువెళ్లగానే శ్రావణభాద్రపదాలు రావటమేమిటే? ఏదోనాకొంపముంచావు. తర్వాత సంగతిచెప్పు"మన్నాడాతురతతో బ్రాహ్మడు. దాని కాబ్రాహ్మణి "ఏమీలేదండీ, మీరు శ్రావణభాద్రపదాలకోసం జాగ్రత్తపెట్టినసామానంతా వాళ్లది వాళ్లకప్ప జెప్పేశాను. ఇన్నాళ్లనుంచీ దాచటం ఎంతో కష్టంగావుంది. ఇప్పుడు వాళ్లకిచ్చేశాను" అనిచెప్పింది. ఆబ్రాహ్మడు నెత్తీనెత్తీ బాదు



# స్త్రీహితైషిణీమండలి, బాపట్ల

జూలై 15, 16, 17 తేదీనిజరిగిన మండలి ప్రథమవార్షికోత్సవసందర్భమున తీయబడిన ఛాయాచిత్రము.

స్త్రీలలో విద్యావిజ్ఞానములను పెంపొందించి ఆధ్యాత్మికచింతను, సాంఘిక సేవానురక్తిని, పరస్పర సహకారమును, ఐకమత్యమును వర్ధిల్లజేసి స్త్రీసంఘమును సర్వవిధముల ఉన్నతికి తేవలయుననెడి ముఖ్యోద్దేశముగలిగి బాపట్లపురమునందలి కొందరు సోదరీమణులు ఒక స్త్రీసమాజమును నెలకొల్పవలయునని యుద్దేశించి తదభిప్రాయానుసారముగా గుంటూరువాస్తవ్యులగు శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మ బి. ఏ. గారిని రావించి వారిచే ప్రజోత్పత్తినామసంవత్సర నిజాషాఢ శుద్ధద్వాదశి భానువారము (1931 జూలై 26) న మండలిని స్థాపింపజేసిరి. గ్రంథపఠనము, పత్రికాపఠనము స్థానికమహాశయులవలనగాని, ఇతరప్రదేశముల నుండివచ్చినవారివలనగాని ఉపన్యాసములిప్పించుట, జాతీయములగు పండుగలు వర్ధంతులు మహాపురుషుల జయంతులు మున్నగునవిజరుపుట ఈమండలి ఉద్దేశసాఫల్యమార్గములు. మొట్టమొదట వారమునకొకమారు మండలిపక్షమున సమావేశములు జరుగుచుండుటకును, గ్రంథపఠనము, పత్రికాపఠనము ఉపన్యాసములు మున్నగు కార్యక్రమముజరుపుటకు నిశ్చయింపబడెను. ఆయేర్పాటుప్రకారము ప్రతిఆదివారము మండలి సభ్యురాండ్రు సమావేశమై కొంతసేపు రామాయణమును కొంతసేపు పత్రికలు మొదలగునవి చదువుటగాని ఉపన్యాసములిచ్చుటగాని జరుగుచుండెను. కాని ఒకేదినమున గ్రంథకాలక్షేపము, పత్రికాపఠనము మొదలైనవిజరుగుట దుస్తరముగానున్నందున వారమునకు రెండు సమావేశములేర్పరచి ఒకదినము శుక్రవారము కేవలము రామాయణముమాత్రమే జరుపుటకును, ఒకదినమున సోమవారము పత్రికలు, ఇతరగ్రంథములు చదువుట, ఉపన్యాసములిచ్చుట మొదలగు కార్యక్రమమునడుపుటకు నిశ్చయింపబడినది. అప్పటినుండి అటులనే జరుగుచున్నది.



రాధాకృష్ణులు

కొని "శ్రావణభాద్రపదాలంటే మనుష్యులుగారే! శ్రావణభాద్రపదం వర్షపునెలలే! వర్షాకాలంకోసం జాగ్రత్తపెట్టాను సామాను! మనసంభాషణ చాటునుంచీవిని నీ తెలివితక్కువ కనిపెట్టి నేవెళ్లగానే మనకొంప ముంచారెవరో" నని పెళ్లాం తెలివితక్కువకు చాలావిచారించాడు.

# కోడిగ్రుడ్డంత ధాన్యపుగింజ

శ్రీమతి వడ్లమూడి వేంకటరత్నమ్మగారు

ఒకానొకప్పు డొకనదీతీరమున నాడుకొనుచున్న బాలుర కొక కోడిగ్రుడ్డుపరిమాణముగల ధాన్యపుగింజ దొరకెను. వెంటనే దారినిబోవుచున్న యొకబాటసారి దానింగాంచి యచ్చెరువంది యేమైనదియు దెలియలేక చివరకు ఏమైననుగానీ, దీనిని మనమహారాజుగారికిఁ జూపించిన నాకుకొంతద్రవ్యమివ్వగలరనితలంచి, యాబాలుర కొకయణాడబ్బులనిచ్చి దానినారాజుగారియొద్దకు దీసికొనివెళ్ళి, కొంతధనమునుసంపాదించుకొని తనయింటికివెళ్ళెను. అంతట నానృపపుంగవుండత్యాశ్చర్యసంభ్రమాకలితుడై తనమంత్రులనందఱ రావించి దానింజూపి యయ్యదియేమివస్తువని ప్రశ్నింప నెవ్వరును దెలుపలేకుండిరి. అంత నాగింజ నొకగవాక్షమునందుంచ దానినొకకుక్కుటము తనముక్కుతో బొడిచి బెజ్జముగావించెను. దానింగాంచినమంత్రు లప్పుడది యొకధాన్యపుగింజయైయుండుననియు, కాకున్న కోడి దానింబొడుచుటకవకాశముండదనియు సెలవిచ్చిరి. పిదప నానరనాథుం డాయననగరమునందున్న విద్వాంసులనందఱబిలిపించి యియ్యది యేధాన్యమైయుండును? మఱియే దేశమున నేకాలమునబండుచుండెడిదో తెలుపుడన నావస్తుశాస్త్రపరిశోధకులు సమస్తఖగోళ, భూగోళశాస్త్ర సిద్ధాంతగ్రంథములనెల్ల ద్రిప్పిచూచి గ్రహింపజాలక మహారాజుగారితో అయ్యా! మాపుస్తకములనెక్కడను దానిజాడగానమనిఁ దెలియపఱచిరి. పిమ్మట నొకరైతుంబిలిపించి యిట్లడిగెను. ఓయీ! ఇదిగో; దీనిఁగైకొనుము. మఱియు నియ్యదియేధాన్యమైయుండునో దెలుపుమన, నారైతు 50 ఏండ్లకు దక్కువవాడయ్యు వెలసిన వెండ్రుకలతో, ఊడినదంతములతో, వంగినగూనుతో, రెండుహస్తముల రెండుచేతికఱ్ఱలనుబుచ్చుకొని గడగడవణకుచు బధిరత్వమున గాబోలు దేమి యేమిటియని మఱిమఱిప్రశ్నింపుచు, చత్వారమున గానలయు దాని ననేకభంగుల నటుయిటుద్రిప్పిచూచుచు, చివరకు, నేనీలాంటిదెన్నడు చూచియెఱుంగ నయ్యా! మఱియెన్నడు క్రయమునకుదెచ్చి గూడాయెఱుంగను. నేనీసాధారణధాన్యములనుమాత్రమే యెఱుంగుదుననియు, నాతండ్రిగారి కేమైన దెలిసియుండునెడల వారినిటకురావించి యరసికొనుడనియు తనదారినితాబోయెను.

రాజంతట నాతనితండ్రిని బిలిపించెను. ఆయనచేత కేవల మొక్కకఱ్ఱమాత్రము సహాయార్థముగానుండెను. అంధబధిరత్వములును లేనట్లు ఆయన వైఖరియే తెలుపుచుండెను.

రాజు:—(దానింజూపి) ఓకర్షకాగ్రేసరా! ఇయ్యదియేమిధాన్యము? దీనిమూల్యమునకుదెచ్చిగాని, లేకనీభూములబండించిగాని యెఱుంగుదువా? యనిప్రశ్నించెను.

రైతు:—రాజేంద్రా! దీనినేనెన్నడు కని విని యెఱుంగను. ఖరీదునకుకొంటివా యనియడుగుచుంటిరేమో? మాకాలమున నేమీనాణెములనెఱుంగము. ఏవస్తువునైనను ధాన్యముతోకొనుచుండెడివారము. మఱియు మాకాలమున గింజలుమాత్రము దీనియంతపరిమాణముగనుండకున్నను, ఇప్పటిధాన్యముకన్న పెద్దధాన్యమని నేను నొక్కివక్కాణింపగలను. ఈవిషయము నరసికొన మీకత్యావశ్యకమని తోచినయెడల నాతండ్రిగారినడిగి తెలిసికొండని తానుగృహోన్ముఖుడాయెను.

తదనంతర మామనుజనాథుండు ముసలిరైతుంబిలువనంపించెను. ఆవృద్ధకర్షకుండు నెవ్విధముగులాఠీని చేతఁదీసికొనక నిగనిగలాడు మొగముతో-దళతళలాడుకన్దోయితో-శరీరదార్ఢ్యమున వలరారుచు- మహారాజు సమక్షమునకేతెంచి నమస్కరించి నిలువంబడియె. అంత రాజు దాని నాతనిచేతికిచ్చి యాయిర్వురిబృచ్ఛించిన భాతినే మఱలబ్రశ్నించెను.

రైతు:—(హస్తమునబుచ్చుకొని శిరఃకంపనమొనర్చుచు, స్వామీ! నేనీధాన్యమును బహువాళ్ళనుండి రెఱుంగుదును. (చవిచూచి) ఆహా! సరిగా నయ్యదియే.

రాజు:—సరే దీని నెప్పుడెక్కడజూచియుంటివి? దీనిపుట్టుకయేద? లేక నీపొలములబండించితివా? నిశ్చయముగానెఱింగింపుము.

రైతు:—మాకాలములో నెల్లయెడల నెల్లప్పుడందఱు దీనినేబండించుకొనుచుండిరి. నేనీధాన్యములఁ దినియే పెరిగిపెద్దవాడనయితి.

రాజు:—కాని మీరు వాటినెక్కడకొనితెచ్చుచుండిరి.

రైతు:—(చిఱునవ్వుతో) మహారాజా! ఆసమయములో క్రయవిక్రయవ్యవహారములొనరించిన పాప ములో పోయినవారు ఎవరునులేరు. మేమీనాణ్యములనుగూడా కనివినిరెఱుంగము. ఎక్కడజూచినను ముత్యములబోలిన ఈధాన్యరాసులే కుప్పతిప్పలుగానుండెడివి.

రాజు:—మీభూము లెక్కడ?

రైతు:—పరమాత్మునిచే సృష్టింపబడిన యీమహావిశ్వమునందెవరికెంత నేలగావలయునన్నను-నెవరే భూమిఁగోరినను వారివారి ఇష్టానుసారముగా-సేద్యము చేసికొనుచుండెడివారు. ఈభూమియంతయు నొకరిది కాదు. అందఱును స్వార్జితధనముతో సకలసౌఖ్యముల ననుభవించుచుండిరి.

రాజు:—ఆకాలములో ఇంత పెద్దధాన్యమగుటకు కారణమేమి? ఈకాలమున నెందువలన నగుటలేదు? అదిగాక నీపౌత్రుడు రెండు చేతులలో రెండులాటీలను ధాల్చినవాడై మిగుల వార్ధక్యమునమున్నట్లు గోచరించెను. మఱియు నీపుత్రుడు అతనికన్నమిన్నయై చేత నొకచేతికఱ్ఱమాత్రము సహాయార్థముతీసి కొని యిటకేతెంచెను. కాని నీవన్నన్నో దంతములూడక నెంద్రుకలునెఱియక ప్రస్ఫుటావయవములతో పరి పూర్ణబలముతోనుంటివి. ఇదియేమికారణము?

రైతు—స్వామీ! మాకాలమునందు-మేము పరధనాపేక్షలేక కల్లకపటములెఱుగక స్వార్జితధనమునే స్వంతసొత్తుగాదలంచుచు మనకెల్లకష్టపడి జీవించెడివారము-కాని యిప్పుడో, ఒకరికంటెనొకరు-సోమరిపో తులై, మోసగాండ్రై, జూదరులై కూటసాక్ష్యములతో, జారచోరాదిదుర్వృత్తులవలంబించినవారై, పరధనా పేక్షచే వరుసర్తించుటయందే ప్రొద్దుబుచ్చుచు-కష్టమనునది రెఱుంగక-నవనాగరికతయనుబంధమునజిక్కి- విషయులోలురై దుర్బలులై, నానాటికి క్షీణించిపోవుచున్నారు. యదార్థమిదియ.

## నీతి కథ

శ్రీమతి మున్నా కోటీశ్వరమ్మగారు

"మీరేల మీసతితోగూడి గృహస్థధర్మమునునడపరైరి?" అనిప్రశ్నింపగా శ్రీపరమ హంసులవారిటు జవాబుచెప్పిరి. "కార్తికేయుడు ఒకదినము పిల్లినిగిల్లినాడట. ఇంటిలోనికి పోయినప్పుడు తనతల్లిచెంపగీచుకొనిపోయియుంట్లగాన్పించినది. దానినిచూచి అకుమార

స్వామి "అమ్మా! నీబుగ్గమీద యీగాయమెట్లుకలిగినది?" అనిఅడుగగా "ఇదినీవ నియే. నీగోటిగీతయె యిది" అని ఆజగజ్జనని ప్రత్యుత్తరమిడినది. కార్తికేయుడు వెఱగుపడి "అదెట్లమ్మా! నేను నిన్ను రక్కినజ్ఞాపకములేదే!" అనెను. "బిడ్డా! యీయుదయమున నీవు పిల్లినిగిల్లినమాట మఱచిపోతివా?" అని తల్లిఅడిగినది. "అవునమ్మా! నేనుపిల్లినిగిల్లితిని. అయిన నీబుగ్గమీదగాయముపడుటెట్లుతల్లీ? అని అడిగినాడు. "ముద్దులబిడ్డా! యీ జగమున నాకు వినా ఏమియులేదు. సృష్టియంతయు నేనే! నీ వెవరినిహింసించిననూ నాకేహింస కలుగును." అని తల్లిచెప్పినది. ఈ పలుకులాలకించి కుమారస్వామి అత్యాశ్చర్యముచెంది, తానువివాహమాడరాదని నిశ్చయించుకొనెనట! అత డెవరిని భార్యగాగ్రహించగలడు? అటుల స్త్రీజనమునందెల్ల మాతృభావమునుగఱచిన కుమారస్వామి పెండ్లియాడుటకుజంకినాడు. నేను కార్తికేయునిబోలియున్నాను. నేను ప్రతిస్త్రీని నాజగజ్జననిగ భావనచేతును."

## సవతుల సఖ్యము

ముద్దా విశ్వనాథముగారు

మైత్రేయిని పరిణయమగుటను గుఱించి ప్రస్తావించుచు—

యాజ్ఞవల్క్యమహర్షి:—ఏమీ! ఇందులకు నీ కభ్యంతరమే లేదా?

కాత్యాయని:—ఎంతమాత్రములేదు. అటులు జరుగు అదృష్టమే అబ్బుచో, నాఆనందమునకు మేరయుండఁబోదని ఈవఱకే మనవిచేసుకొని యుంటినిగద! తామీ యుద్దేశమునుండి విరమింతురేని నాజీవితము దుఃఖముపాలే.

యా:—ఆమెను చూచి నీకు కడుపుమంటగ నుండు నేమో?

కా:—మన మీఁదులాఁడు ప్రేమసాగరతత్త్వము ఎఱుఁగని దానినైనచో, మీర నినటులే. ప్రకృతపరిస్థితులు పరికించినచో, అట్టి అసూయకు కవకాశము కనఁబడదు.

యా:—ఆమెపై నాప్రేమ క్రమశః అభివృద్ధినొందదని నీవు నిశ్చయింపఁగలవా?

కా:—ఆమెపట్ల తామెట్లు చరింపఁబోవునదియు, నాకు విప్పిచెప్పియుంటిరే?

యా:—కాలక్రమమున మతము మాఱిపోవచ్చును. అనురాగ మధికముకావచ్చును.

కా:—అటువంటిమార్పు నాకు హితకరమే. నిశ్చయముగ సంభవించుచో నేను పొరపడితినేయని పరితపింపను. ఆమె అధికముగ ప్రేమింపఁబడుటకు అర్హయే. ఇంతకును వారిని వీరిని ప్రేమించుట వ్యక్తులను పురస్కరించుకొని కాదుకద! తెలుదు తాము సెల విచ్చినటులు, 'ఆత్మ'కొఱకు. కనుక, ఆమెను నన్నుకంటె ఎక్కుడుగ ప్రేమింపఁజాలరని నా దృఢవిశ్వాసము.

యా:—(చిఱునగవుతో) కానిమ్ము; మనోజ్ఞమగు నీవిశ్వాసము చాలా లోఁతుగ పాదుకొన్నటులున్నది. కావలెనన్నను, దానిని నేను కదలుపలేను.

—పండిత సీతారామ తత్త్వభూషణులు.

## ఆంధ్రస్త్రీలు: వస్త్రధారణ

శ్రీమతి శంకర రామాయమ్మగారు

ప్రస్తుతము ఆంధ్రవనితలు ధరించెడి వస్త్రధారణమును, వస్త్రంబులును యనేకరకములుగా వెలయుచున్నవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనియెడు నాల్గుజాతులుగదా! ఈజాతి యొక్కొక్కదాని యందనేకజాతులు విభజింపబడియున్నవి. కావున జాతిభేదముల ననుసరించి కొందరును, దేశాచారముల ననుసరించి కొందరును, శీతోష్ణపరిస్థితుల ననుసరించి మరికొందరును, ఇప్పటి నవనాగరికతావిధానము ననుసరించి మరికొంతమందియును, పూర్వాచారము ననుసరించి యింకకొందరును, వృత్తులనుబట్టియు, తమతమవీలు ననుసరించియును, ఇట్లెన్నియో కారణములుండుటచేత, వస్త్రముధరించు విధాన మొకతీరుగా నుండుటలేదు. మరియు, ఘోషాపద్ధతుల కనుకూలించువిధమున కొందరు వస్త్రముల ధరించుచున్నారు.

వైశ్యజాతియందు గోచీచీరకట్టుముఖ్యము. బ్రాహ్మణజాతియందు రెండురకములపయ్యెద ధరించువారును, మూడురకముల కట్టుగట్టెడివారునుగలరు. క్షత్రియులలో పరికిణీలును, పల్లెలుధరించువారును, చీరెలు ధరించువారును, పయ్యెదయు రెండువిధములు ధరించువారును గలరు. బ్రాహ్మణులలో పదిపదునారేండ్ల బాలికలు సహితము పరికిణీలు ధరించువాడుకగలదు. పరికిణీపల్లెలేగాక, పైటపరికిణీలుగూడ ధరించుచుందురు. తక్కినజాతులలో గూడకట్టుముఖ్యము. వైశ్యజాతియందును రెండుతరగతులవారు గలరు. వీరిలో మొదటి జాతివారు గవరకోమట్లనియు, రెండవజాతివారు కళింగకోమట్లనియు పిలువబడియెదరు. కొంతమంది కాశ పోసి కచ్చగట్టుకొందురు. మరికొందరు గోచీచెంగువెనుకకు వ్రేలవైచి కుచ్చెళ్ళచీరెయు గట్టుకొనుచున్నారు. ఇక శూద్రజాతియందనేకజాతులవారు లెక్కకుమిక్కిలిగానున్నారు. వీరిలోకొందరు కుడిపయ్యెదను, మరికొందరు యెడమపయ్యెదయును ధరించెదరు. కొందరు లంగాలు, మరికొందరు చీరెలును ధరించెదరు. ఇప్పుడు నవనాగరికతననుసరించి పరికిణీలుగట్టి పైనవాణీలు వేసికొనుచు, జాకెట్లనుదొడిగి, లోనకశ్యాను దొడుగుచున్నారు. కాపువారు, తెలగవారు, తెలుకులవారు, గొల్లలు, గవర్లు, గమళ్లు, సాలీలు, జంగాలు, జాలర్లు, కుమ్మర్లు, ఉప్పర్లు. ఇందులో తెలగవారిలో కొందరుతప్ప తక్కినవారును కుడిపయ్యెదయే ధరింతురు. చాకలిస్త్రీలును, మంగలిస్త్రీలును, భోగపుస్త్రీలును యెడమపయ్యెదను ధరించెదరు. కాని పైనిచెప్పినవారు మరికవస్త్రములను, భోగపుస్త్రీలు పలుచనివి ధరింతురు. భోగపుస్త్రీలు లంగాలుగట్టి పైన వాణీలు పయ్యెదగను; జాకెట్టుగాని, రవికెగాని పైభాగమునకును దొడుగుదురు. చీరెలు గూడకట్టుగట్టుకొనుటయు వీరికి చాలనభ్యాసమేయైయున్నది.

వైష్ణవస్త్రీలు కొందరు కట్టువిధానము వేరుగానుండును. ఆకట్టును అయ్యంగారిస్త్రీలు గట్టుకొనియెదరు. ఈచీరెకట్టుకు మూరచాలజాస్తిగా నుండవలయును. మూర చాలయధికమైనను కట్టినతరువాత చీరెకు మూరయెక్కువయని తెలియరాదు. కట్టుమాత్రము యందముగాను, చాలపొందికగాను ఇమిడియుండును. ఇట్టి కట్టుగట్టుకొనినయెడల నెట్టియిబ్బందియుగల్గక గాలి విస్తారము వీచుచున్నను ఏమియు తొలగనేరదు. ఇక తక్కినకట్లు గాలి మిక్కిలిగా వీచుచున్నయెడల, ఇటునటుతొణుకుచు, పైకెగయుచు చికాకుగల్గించి బాధించును. కావ కట్లన్నిటిలోను ఈకట్టు సమంజసముగానుండును. ఈకట్టుగట్టువారుకూడ కుడి, యెడమ పయ్యెదలు రెండును ఉపయోగింతురు.

గంజాం, విశాఖపట్టణముజిల్లాలయందలి బ్రాహ్మణ, వైశ్యస్త్రీలుపయోగించు వస్త్రములును, గోదావరి జిల్లాలోనున్న కాకినాడ, సామర్లకోట మొదలగు కొన్నిస్థలములయందునుగల బ్రాహ్మణవైశ్యస్త్రీలుపయో-

గించు వస్త్రములును చాలపలుచగను, పూరతక్కువగను ఉండును. గోదావరిజిల్లాలోనుగల తక్కినప్రాంతములనుగల యాంధ్రవనితలలో బ్రాహ్మణ, వైశ్యస్త్రీలుపయోగించు వస్త్రములు మిక్కిలిపలుచగా నుండవు. పూరియును మిక్కిలితక్కువగాదు. గంజాం మొదలు కాకినాడ, సామర్లకోటవరకును యుపయోగించు వస్త్రములకన్న బాగుగ నేయుండును. గంజాం మొదలు సామర్లకోటవరకును ఉపయోగించు వస్త్రములేవి యనగా:—అర్ణీచీరెలు, జామారుచీరెలు, పుప్పొడచీరెలు, కలకత్తాబొంబాయి, గ్లాస్కో, మజిలిన్, యుమిటేషన్, వాయిలుచీరెలును, శ్రీకాకుళం, పొందూరు, రాజాం, శిగడాం, బొంతలకోడూరు మొదలైనగ్రామములలో నేయువస్త్రములును, సాధారణముగా నందరును ఉపయోగించుచున్నారు. కాని యీ నేతవస్త్రములు సాధారణమైన వారుపయోగించుట తక్కువయేయైయున్నను, పైని తెలిపినవస్త్రము లందరు వాడుచున్నారు. ఈక్రింద తెలిపిన గ్రామములలో నేయువస్త్రములు కొంతవరకు ధనవంతులు ధరించుచున్నారు. ఇక్కడ పాటి నూలువస్త్రములు నేయుదురు. కాని పైజెప్పినవి విదేశవస్త్రములే యైయున్నవి. శ్రీకాకుళం, పొందూరు, బొంతలకోడూరు, శిగడాం, రాజాం మొదలైనగ్రామములలో నేతపరిశ్రమకును, ఇందులో గొన్ని ప్రదేశములు రంగులు వేయుటకును చాలకాలమునుండియు ప్రసిద్ధిబొందియున్నది.

స్వదేశోద్యమము ప్రారంభమైనప్పటినుండియును, స్వదేశాభిమానులు గొందరు రాట్నములతో నూలు వడికించి, వస్త్రములు నేయించుచున్నారు. ఆయుద్యమము దినదినమును వృద్ధిబొందించుచు ప్రశస్తమైన స్వదేశవస్త్రములు తయారుచేయించి మనయాయాంధ్రదేశమున కంతటికిని యెగుమతిచేయించుచున్నారు. కాన నిచ్చటిస్త్రీలలోని స్వదేశాభిమానులు ఇచ్చటి స్వదేశవస్త్రములను ధరించుచున్నారు. కొంతమంది స్త్రీలు స్వయముగా రాట్నములపై నూలువడికి నేతనేయించుకొనుచున్నారు.

గోదావరిజిల్లాయందుగల మిగతనున్న భాగములయందలి యాంధ్రనారీమణు లందరును కృష్ణాజిల్లాయందలి యాంధ్రనారీమణులును, సాధారణమైన వారుపయోగించువస్త్రము లేవియనగా:-(1) బందరు కలంకారి చీరెలు, (2) బందరు యద్దకపు పువ్వులచీరెలు, చుక్కలచీరెలు, (3) పెడనచీరెలు, గువ్వకన్నుచీరెలు, మొదలైనవి. వీరుకూడ పైజెప్పిన వారివలెనె పలుచనివస్త్రములును పూరతక్కువయు నుపయోగించక, సాధారణమైనవస్త్రంబు లుపయోగించెదరు. వీరుపయోగించెడి వస్త్రముయొక్క పూర పదమూడు మొదలు పదునైదువరకు నుండును. గంజాంజిల్లా మొదలు సామర్లకోటవరకు నుపయోగించు స్త్రీల వస్త్రముయొక్క పూర పండ్రెండు మొదలు పదమూడుమూర చీరెకట్టుకును, పది మొదలు పదకొండుమూర కాశబోసి కచ్చగట్టుకొనుటకును ఉపయోగించెదరు. కాని నాగరికతగల కమ్మ, రెడ్డి, క్షత్రియ, వెలమవారును, దేశీయ క్రైస్తవులును, గంజాం మొదలు గుంటూరుజిల్లా యాఖరువరకును యొకతీరుబట్టలనే ధరించుచుందురు. వీరు పరికిణీలును, వల్లెలును ధరింతురు. వీరిలో కొద్దిమందిమాత్రమే పలుచని విదేశీసిల్కులు పైనవల్లెలు ధరించుటకును, లోనజాకెట్లుగాని రవికెలుగాని దొడిగికొనుటకును ఉపయోగింతురు. ఈవస్త్రములేగాక మజిలిన్, వాయిల్ మొదలగు తెల్లచీరెలనిమిత్తమును, వల్లెలనిమిత్తమును, జాకెట్లు, బాడీలు, రవికెలనిమిత్తమును, ఉపయోగించుటయును గలదు. కొందరు వీరిజాతులలోగూడ ధనవంతులైనను వడుకునూలు వస్త్రముల ధరించుచున్నారు. కేవల స్వదేశాభిమానులుగాకయున్నను, విదేశవస్త్రము లుపయోగించునప్పుడుగూడ వడుకునూలు రాట్నముపైవడికి, వస్త్రముల నేయించుకొని యుపయోగించుచున్నారు.

గుంటూరిజిల్లాయందలి యాంధ్రనారీమణులు సర్వసాధారణముగా నుపయోగించు వస్త్రములేవన:— బందరులో తయారైన వస్త్రములుగాక, బందరులో రంగుమాత్రము వేయుదురు. బట్టమాత్రము విదేశపుదే. పెడనచీరెలు, మధురచీరెలు, డైమనుపట్టుచీరెలు, రేషంచీరెలు, బెంగుళూరునుండివచ్చు నూలుచీరెలు, సేలం,

నూలుచీరెలు తెండలైనవి ధరించుచుండిరి. ధనవంతులగు బ్రాహ్మణ, వైశ్య, శూద్రులలో కొలదిమంది పట్టు చీరెలను ధరించుచున్నారు. అప్పుడప్పుడు కథలకు, కార్యములకును ఉపయోగించువా రనేకులున్నారు. కాని దినదినమును పట్టువస్త్రములు ధరించువారు చాలతక్కువ. స్వదేశోద్యమము వృద్ధిబొందినతరువాత కొంతమంది స్వదేశవస్త్రంబులు ధరించుచున్నను, ఎక్కువమంది విదేశవస్త్రములను ధరించుచునేయున్నారు. స్వదేశవస్త్రముల విలువను దెలిసికొని వారుకూడ విదేశవస్త్రములనువిడనాడుట దేశక్షేమము.

## కొత్తపాట

శ్రీమతి చావలి బంగారమ్మగారు

౧

చెట్టెక్కికోవెలాపిట్ట గూయును
పాపాయిపాటవిని పక్కున్ననవ్వె
పాపమ్మనీపాట బాగున్నదమ్మా
నీపాటవింటేను నాకుసిగ్గౌను
నీముందునేనింక పాడలేనమ్మా
నాదారినేబోయి పాడుకుంటాను
నీవునేనూకలిసి పాటపాడితే
ఈపేటవారలకు ఇకపాటలేవి
పాటలెరిగినమనము పాడుతూనుంటే
మాటలెరిగినవారు మాటాడగలరా
మాటల్లుమనకేల పాటలేగాని
పాటలెరిగినవార్కి మాటలేలమ్మా
పేటవారలమాట పాటించకమ్మ
పాటమెరిగినపాట పాడవోయమ్మ
మనపాటలకునేడు మాధవుడుబలుకు
మనవారిమాటలకు మనకేలవులుకు.

౨

మామామిడీచెట్టు మహామంచిదమ్మా
ఆమంచిఆకుల్లు అవిజూడరమ్మా
అంతకన్నాలేత వాచిగుళ్లమ్మా
అవితినేఆకోవె లటుగూయునమ్మా
ఆకూతవింటేను అతిమధురమమ్మా
అతిమధురమైనట్టి ఆకూతవింటే
అమ్మాయిపాటవలె అదిదోచునమ్మా
అమ్మాయిపాడితే అదిహాయిగాదా
కోవెల్లగూసితే ఇదిహాయిగాద.

## సీతాకోకచిలుక

గరిమెళ్ల సత్యనారాయణగారు

సీతాకోక చిలుకనుచూడు
పతాంలాగ ఎగురుతుఆడు
పోతూపోతూ పూవులుమేయు
లేతాకులపై నిద్దరతీయు. సీ.
చుక్కాచుక్కల పరికిణికట్టు
ముక్కునఅందపుముత్తెముపెట్టు
తొక్కుడుకాళ్లతో తూలుతులేచి
ఎక్కడపడితే అక్కడకెగిరే. సీ.
పురుగులాగ అది పుట్టును పిమ్మట
తెరలలాగ రెక్కలువిలసిల్లును
సరినున్ననినూగుంకుమేనిపై
చెరిగిపోవునుచేయివైచినను. సీ.
పట్టుకొనగపాపలు పరుగిడితే
గుట్టమీదుగాఎగిరిపోయి, ఒక
చెట్టుకొమ్మపై కూర్చొని పండ్లు
పెట్టుయెండలో నవ్వుతువుండే. సీ.

## వైశాఖపూజ

హరి రాధాకృష్ణమూర్తిగారు

జైత్రయాత్రకు వెడలిన చైత్రుగూడి
లలితగతివచ్చు వైశాఖలక్ష్మి! నిన్ను
క్రొన్ననల క్రొవ్విరుల చాలకుదుటబరచి
చివురుటాకుల జాలగై సేసిచిలుక
పలుకులను నిన్ను ధ్యానించి అళికులమ్ము
వలన నీకు స్వాగతమంపి కలితక్రమ
శీతలోదకముల నీదు సేదతీఱ
అర్ఘ్యపాద్యంబులెత్తి నిష్యందమాణ
నవరసావిష్టమాధ్వీకణముల స్నాన
మొనరగావించి పుష్పవసనమునొసగి
వేష్టితావల్లియజ్ఞోపవీతమీగి
ప్రసవరజమున గంధపరాగమలది
సురజపాపుష్పములను కుంకుమనొసంగి
వివిధకాంతుల వెదజల్లు విరులచేత
మనసిజునినామములను పూజనముజేసి
దోహదముకొఱకగు ధూపధూమములను
ధూపమునొసంగి మంకెనపూవవిరుల
దీపకళికలనొసగి సంతృప్తిదసర
విమలచూతఫలాల నైవేద్యమిచ్చి
మానితంబగు మధువున పానమిచ్చి
నవ్యపల్లవములను విన్నాణమొసగ
విడెమొసగి అర్కకాంతదీప్తినికపురపు
టారతినొసంగి మల్లికాహారవితతి
మంత్రపుష్పాంజలినొసంగి మత్తకోయి
లలను నీదు సద్గుణగీతములనుబాడి
షోడశోపచారముల నింపొక్కజేసి
నిన్నుపాసించి ప్రకృతి నిర్నిద్రయగుచు
శరణుజొచ్చెను కనుము వైశాఖలక్ష్మి!

## 'నాకొండ!'

శ్రీమతి మల్యాల వేంకటరత్నమ్మ గారు

ఆరాత్రి సుదర్శనం పండువెన్నెలలో రాజిని పక్కలోబెట్టుకొని పవ్వళించింది. మలయానిలుడు తనఇంద్రజాలవీచికలదండుపంపి, ఒక్కత్రుటిలో మేనులుమఱపించాడు.

రాత్రి మూడుగంటలయింది. రాజికి మెలకువకల్గింది. తనకోమలహస్తములచే పక్కలోని తల్లినితడిమింది. లేచికూర్చుంది. నలుగడలపరికించింది. ఆకాశంకేసితలయెత్తిచూచింది. బంగారుబంతివలెనున్న చందమామను 'ఆ... గో! పాప, అబ్బాయ్'అని వ్రేలితోచూపింది. 'దా! దా!' అనిపిలిచి ముఖం కొండంతచేసుకొని పక్కనసవ్వినది.

పిదప తల్లి కడుపెక్కి ఒక్కనిముసంపండుకొంది. మరల అప్పుడేలేచి అక్కడనేకూర్చుంది. తనముఖం తల్లిముఖంతోజేర్చి 'అ...మ్మ, అ ..మ్మ' అని వదనమంతా చొంగలుకార్చింది.

తిరిగిలేచికూర్చుని 'అమ్మ! అమ్మ!' అని తనమృదులకరములచే గర్భముపై బాదినది. వ్రేళ్లు తల్లినాసికారంధ్రముల జొనిపి కిలకిలమని మందహాసం చేసింది.

సుదర్శనం గాఢనిద్రాపరవశయైయున్నది. కాని ముక్కునవ్రేళ్లుబెట్టినపుడు చికాకుపడి రాజి వ్రేళ్లుత్రోసివేసినది. రాజికి తనవిలాసచేష్టలకు భంగము కలిగినపుడు తల్లిపై కోపంవచ్చింది. సుదర్శనంముంగురులుపీకడం మొదలుపెట్టినది. అప్పుడు ఆమె మేల్కొంచినది, నయనములు విప్పిచూచింది.

గర్భముపై తన'ముద్దులరాజి'నిగాంచినది. సుదర్శనం తనకరద్వయముతో ఆమెను ముందునకులాగికొని 'నాకొండ! నన్ను మేల్కొల్పేవా!'అని కౌగిలించుకొని తనివితీర ముద్దాడింది.

# పుట్టినిల్లు

శ్రీమతి తాయి రత్నమాలగారు

మాపుట్టినింటిలో ఎన్నో బొమ్మలున్నాయి. నేనూ చెల్లాయి వెన్నెలలో గుజ్జనగూళ్ళు వండుకుని బొమ్మలుపెట్టుకుని ఆడుకుంటూంటే ఎంతో సర్దాగా వుండేది. ఇక్కడెవరున్నారమ్మా ఆడుకోటానికి బొమ్మలూ లేవు ఏమీ లేవు?

మాపుట్టినింటిదగ్గిర మంచిచెరువున్నది. రోజూ సాయంత్రం చెరువుఒడ్డున కూర్చుని నేనూ చెల్లాయి మాయింటిదగ్గిర అమ్మాయిలు కబుర్లుచెప్పుకుంటూంటే ఎంతబాగుండేది? ఇక్కడ చెరువూ లేదు. ఏమీ లేదు.

మాయింట్లోవుండగా వెన్నెలలో మంచంమీద నాన్న పడుకుంటే నాన్న పక్కలో కూచుని ఎన్నో కథలు చెప్పేదాన్ని. నాన్నకూడా క్రొత్తక్రొత్త కథలు చెప్పేవారు. ఇక్కడెవరున్నారు? పోనీ ఒకనాన్నన్నా లేరు.

మాయింట్లో తద్దిపండుగ వచ్చిందంటే గోరింటాకుపెట్టుకుని చీకటితోనే లేచి అన్నంతిని పిల్లలమంతాకలిసి ఆటలాడుకుని ఉయ్యాలలూగేవాళ్ళం. అప్పుడెంత సంతోషంగావుండేది? ఈపట్నంలో తద్దిపండుగ చెయ్యరట. ఇదేమి పట్నమమ్మా?

మాయింట్లో అమ్మతో జడవేయించుకునేటప్పుడు ఒదులుగా వెయ్యమని చెప్పి వేయించుకొనేదాన్ని. ఇక్కడ మాఅత్తగారు జడవేస్తూంటే ఆమాటే అనకూడదు. అంటే ఇదేమిపిల్లమ్మా ఇంతచిన్నతనంలో ఇంతషోకు? ఇక పెరిగి పెద్దదయితే మాబాగాచేస్తుంది కాపరం అంటూ విసుక్కుంటుంది. మాఅమ్మ ఏమీ అనేదేకాదు.

ఏమోబాబు నాకిక్కడ ఏమీబాగుండలేదు. మాపుట్టినింటిలో హాయిగా వుండేది. చెల్లాయి, తమ్ముడూ, నాన్న, అమ్మా అందరూ అక్కడేవున్నారు. నేను ఎప్పుడు వెడతానో? మళ్ళీ అందరినీ ఎప్పుడుచూస్తానో? శ్రావణమాసంలో వచ్చి తీసుకువెడతానన్నారు. శ్రావణమాసం త్వరగావస్తే బాగుండును.

ఇవ్వాళ లక్ష్మీదేవికి దణ్ణంపెట్టుకుంటా నాన్న త్వరగావచ్చి తీసికెళ్ళితే నాలుగుటెంకాయలు కొడతానని.

# అపరాధము

శ్రీమతి పాకనాటి శ్రీలక్ష్మీ రాజేశ్వరిగారు

పద్మ మాతృవిహీన, విశేషించి బాలవిధవ. దశవర్షప్రాయపుది. ముక్కుపచ్చలారనట్టి, లోకజ్ఞాన మిసుమంతయైన నెరుగనట్టియు, ఆటపాటలయందే కాలముగడుపునట్టియు పద్మను దశవర్షములైన నిండకముందే సంఘము తన నిరసన దృష్టులతో జూడదొడగెను. శారదాచట్ట మామె కురిత్రాడై తుదకు వైధవ్య రూపముగా బరిణమించెను.

నాడు శ్రావణశుక్రవారము. వివాహితలగు బాలికలందరూ శుభ వస్త్రాలంకృతలును, పుష్పాలంకృతులునై లక్ష్మీకళ నుట్టిపడు నావీథులలో నోము నోచుట కటునిటు సంభ్రమముతో తిరుగుచుండిరి.

పద్మ వీథిలోనిలువబడి తనతోడి బాలికలజూచుచు తానెందుకు నోము నోచరాదని మోదింపసాగినది. కొంతవడికి పద్మ తన యౌవనాపూరితవదనం పైకెత్తి, వీథిని తిరుగుచున్న తనహితురాలగు లక్ష్మినిచూచి ఆమె జడలో నున్న పువ్వులగాంచి తానును పువ్వులనలంకరించుకొన బుద్ధిపొడమి తోట కరిగి మల్లెపూవులగ్రుచ్చి తనజడ నలంకరించెను. పద్మకు పూవులధరించుటకు తా ననర్హురాలనుమాట గ్రాహ్యముకాలేదు.

బాలిక పూవులధరించి నిలువుటద్దములో తనసౌందర్యమును చూచుకొని ఉప్పొంగుచున్నది. వెనుకనుండి పద్మ సవతితల్లియు, క్రూరరాక్షసియునగు జానకి పుష్పాలంకృతయగు పద్మనుచూసి ఆమెజేసిన అజ్ఞానాపరాధమునకు కోపానలముచే దగ్ధయగుచు సమీపమునున్న కొరవితో పద్మవీపున చురక పెట్టి తలలోనిపూవుల పీకివైచి "విధవవగు నీవు పూవులపెట్టుకొనుటయా?" అని గద్దించివైచెను. పద్మ కొరవిచురకతో నేలబడి స్మృతివిహీనయయ్యెను. ఆ బాలికకుతానుచేసిన యపరాధ మిప్పటికిని గ్రాహ్యముకాలేదు.




డాక్టర్ యస్. శేషగిరి రావు గారు, యల్. ఐ. యమ్.

గాయములు హఠాత్సంభవములగు వ్యాధులలో అతిప్రమాదకరమైనవి. క్రీడాచపలమగు బాల్యమున గాయములు తరుచుగలుగును. నెత్తురును అరికట్టుటకు; గాయమును చీముపట్టకుండ, మఱి ఇతరరీతుల ప్రబలముకాకుండ చూచుటకు మంచి మెలుకువకావలయును. ఈవిషయికమగుజ్ఞానము స్త్రీలకు ముఖ్యముగ కావలసినది. పల్లెలలోనివారికి ఆసుపత్రులు అందుబాటుననుండవు. వారికి క్రిందియోగములు యథాకాలమున ప్రయోగింపబడుటచే మంచి ఫలమునీయగలవు. ఇందలిద్రవ్యములన్నియు పల్లెలయందు సులభముగలభించునవి.

దుష్టపు ఆకునూరికట్టిన గాయములను శుభ్రపరచి మాన్పును.

పసుపు చిక్కగ కలిపిననీళ్ళతో పూసిన గాయములు మానును.

పెరుగుతో టకూరాకునూరికట్టిన గాయముమానును.

పొన్నగంటిఆకుపసరుపోసిన గాయముమానును.

బొక్కెనాకునునూరి గాయములకువేసిన రక్తప్రవాహముకట్టును. గాయమునుమాన్పును.

బలురక్కెసి పచ్చనిపాలు పైనపూసిన గాయములు మానును.

క్రొత్తగఅయిన గాయముపైని మిరపకాయలగుండ పోసి అందుపైన నూనెపోసిన గాయము నొప్పిచేయక శీఘ్రముగమానును.

గాయములకుపైన సున్నముపూసిన నిమ్మళించును.

వస్త్రము మెత్తగనలుగగొట్టి రక్తము కారు గాయమునకుపెట్టిన రక్తముకట్టును.

వస, ఓమము, పసుపునీళ్లతోనూరి నూనెలో ఉడికించికట్టిన గాయములునొప్పి తీసిమానును.

కసివిందఆకునూరికట్టిన గాయములు మానును.

ఆగాకరకాయలను రెండేసిముక్కలుగకోసి నువ్వులనూనెలోవేసి కొన్నిదినములవఱకు నూనె ఊరబడువరకు ఎండలోనుంచితీసి ఆనూనెలో దూది తడిపి గాయములపైనవేసిన శీఘ్రముగమానును.

కచోరముగంధములో పటికి కలిపిపూసిన స్వల్ప గాయములు మానును.

గాయపాకు రసముగాని నూరినముద్దగాని గాయములను మాన్పును.

గోరింటఆకునూరికట్టిన గాయములు మానును.

పచ్చిజిల్లేడుపాలు ఉప్పుతోగలిపి పైనపూసిన స్వల్పగాయములను హరించును.

తుత్తురిబెండయాకు నూరికట్టిన గాయమును మాన్పును.

దర్భనూరి క్రొత్తగాయములకు వేసికట్టుకట్టిన రక్తము పారుటకట్టును. గాయము మానును.

మాండూకబ్రహ్మిఆకు నూరివేసిన గాయములు చీముపట్టకమానును.

గాయములలో పురుగులుపడిన వాటిని చంపి గాయములు మాన్పుటకు—కుప్పింటాకుమూలచూర్ణము పైనజల్లిన పురుగులుపట్టినగాయములు నయమగును.

మాగవీతిగెఆకులరసము పురుగులనుచంపును.

గాయములలో గాడిదగడపాకురసము పోసినను, ఆకునూరికట్టినను వాటిలోనిపురుగులు చచ్చును.




## వరలక్ష్మీలాలి

శ్రీమతి బి. యల్. సావిత్రమ్మగారు

[శ్రావణమాసములలో ముఖ్యముగా వరలక్ష్మీవ్రతము ప్రధానము. శుక్రవారమునాడు పూజజరుగును, శనివారమునాడు పునఃపూజయును చేసి సాయంత్రం అమ్మవారిని తొట్టిమీద పెట్టి పిమ్మట పాడులాలిపాట.]

వరలక్ష్మీదేవి! లాలి, భక్తులకువరములిచ్చేటితల్లి!
పరమకల్యాణి! లాలి, వైకుంఠశ్రీమనోహారి! లాలి.
పచ్చలుస్థాపించినా బంగారుపట్టెమంచంపాన్పునా
హంసతూలికశయ్యపై హరితోడకూడి పవళించవమ్మా
చతురువేదములకొల్వు చతురుదిక్కులపట్టె గావించినా
దూదిపరుపువేసుకో శేషాద్రిశయనులై పవళించరమ్మా
పాలువెన్నల ముచ్చిలితో గూడి బడలినప్రాణేశుకు
అలసినాడమ్మ విభుకు బంగారుసురటితో విసరరమ్మ
పదహారువేలస్త్రీలతో గూడి రాసక్రీడలునాడినా
బడలికలుతీర నేడు బాగుగా క్షీరము లియ్యరమ్మా.

## నివాళి

శ్రీమతి యస్. పి. సరళాదేవిగారు

(నగుమోముగనలేని, అనుమట్టు)

శ్రీరాధికానాథ! నీరాజనము. శ్రీ.
నిగమాంతసంచార! నిత్యయశస్వీ! శ్రీ.
నీలమేఘశ్యామ! నిరుపమగాత్రా!
వరదా! మముబ్రోవగ నీకరుదా హే. శ్రీ.
శిఖిపింఛశ్రీధర! పాపవిదూరా!
కరుణాకర! పీతాంబరధారీ! శ్రీ.
విశ్వమోహనమూర్తీ! కృతవంశీపూర్తీ!
లలితాసమగోపాలక వేషధారీ! శ్రీ.
సరళాను ననుగావు సరళస్వభావా!
కరుణాంచిత! కమలామల దృగ్జాలక బాల! శ్రీ.

విద్యోదయా విద్యాలయము



సంగీతపు తరగతి

విద్యోదయా విద్యాలయము



పుష్పనృత్యము



పదభ్రష్టుడగు పోర్చుగల్ రాజు మరణము:—

"జూలై రెండవతారీఖున రెండవమాన్యులు (పదభ్రష్టుడై ఇంగ్లాండునందు ప్రవాసమునున్న పోర్చుగలు రాజు) దివంగతుడయ్యెను. పోర్చుగలు రాజవంశమున ఈతడే కడాపటివాడు. కంఠరోగమువలన మరణించెను. ఈతనివంశమువారు 1837 మొదలు 1910 వఱకు పోర్చుగల్ దేశమును పాలించిరి. పోర్చుగల్ దేశీయులకు 1908 లో తమరాజుపై కోపమువచ్చి అప్పటిరాజును, అతనిఅన్నను హత్యగావించిరి. అందుపై ఆరాజు కుమారుడగు ఈరెండవమాన్యులు రాజయ్యెను. అప్పటికి ఈతనివయస్సు 19 సంవత్సరములు. ఈతడు 1910 వఱకు ప్రభుత్వముచేసెను. ఆసంవత్సరము పోర్చుగల్ దేశమున ఒకగొప్ప రాజకీయపరివర్తనము కలిగెను. అందు ఈతడు పదభ్రష్టుడయ్యెను. ఇంగ్లండునందు తలదాచుకొనెను. 1913.లో వివాహమాడెను. కాని సంతానము కలుగలేదు. అగుట ఆరాజవంశమున ఈతడే కడాపటివాడు. ఈతడు గొప్పసారస్వతాభిమాని. ఈతని సొంతగ్రంథసముచ్చయమున ఎన్నియో అపూర్వగ్రంథములుగలవు. అపూర్వగ్రంథసంపాదనమే తుదిదినములలో ఈతనికాలక్షేపము. ఈతడు తనభాండాగారమునందలి అపూర్వగ్రంథములనుగూర్చిన వివరములుగల ఒకచక్కని సచిత్రమగు కేటలాగును 1927.లో వెలువరించెను. ఆగ్రంథసముదాయమున విశేషముగా పోర్చుగలు, ఆంగ్లభాషాగ్రంథములుండెను. ఈకేటలాగునకు ఈతడొకగొప్పపీఠిక వ్రాసెను. చనిపోవునరికి ఈతనికి 42 సంవత్సరములవయస్సు."

—*The Goa Messenger.*

నారింజపండు విషతుల్యము:—

"నారింజ చేదుతోగూడిన విషయుతమగు చమురుచర్మముగల యొకజాతిఫలము. జిల్లేడు, తిల్ల, తుమ్మ, బలుసు, మామిడి, కీడి, నేరేడు మున్నగు ఆకులనుతిను మేకలు; వంకాయలు, ములగాకు, బొబ్బాసి ఆకులు, చింతకాయలు మున్నగు పగరుచేదులు తినుమర్కటములుగూడ దీనిపండ్లంతగా తినవు. నాభి, నల్లమందు, ఉప్పు, గరళము, పాషాణముమున్నగు పలేక విషవస్తువులను మార్పుకేసి కృత్రిమముగా మ్రింగి, రక్తమాంసాదులను బాడుజేసికొని రోగులైపోవుటలో నారితేరిన పండితోత్తములగు మానవులద్దానిని భక్షించుటకు పీఠాధిపతులు. అయినను చాలకాలము కష్టించి జలాదిచికిత్సలాచరించి ప్రకృతిరీత్యా, దేహగతంబైన విషపదార్థములను వెలువరించివేసికొని కొంతవరకారోగ్యము నార్జించిన వారద్దానిని వాడుకొనుట కెంతమాత్రము పనికిరారు. సర్వమలినపదార్థములు వండి, విటమినులనుచంపి, తినుటచే రోగులై యింజెక్షనులనుజేయించుకొని చరిగానక, బ్రదుకుపై నాశతో తొట్టివైద్యము జేయుచుండెడివారి కారంభములో నాలుగైదు సంవత్సరములవరకది కొంతవర కౌషధప్రాయముగా నుపకరించును. తదుపరి క్రమముగా నది దేహ

గ్రమలు, వెన్నెముక, మెడనరములు, ప్రేవులు చల్లబడునట్లు చేయును. దేహములోని నరములు బిగలాగుటగూడ కొన్నితత్త్వములకు గలుగును. వాతతత్త్వముగలవారికి కది యమదూత; పైగా అజీర్ణము, పోటిలో పుండ్లు, కాళ్ళుతీత, నిద్రబట్టకపోవుట, అరుచి, పుల్లత్రేనుపులు, మలబద్ధము, దంతవిచ్ఛేదము మున్నగు వివిధ దుర్లక్షణములగూడ కలుగజేయును. బలవంతముగా కటికచావుచావలేక నేయింమకొనిన యింజెక్షను మందులయొక్క విషములు, ఉష్ణకారము, దుగ్ధము మున్నగువాని యుద్రేకలక్షణములు దేహమునం దున్నంతకాలము నారింజయేగాదు నిమ్మ, దబ్బ, బత్తాయి, పంపరపనస, కమలాఫలము, మాదీఫలము మున్నగువిషచర్మసంధాయకఫలవర్గములతోబాటు దానిమ్మ, ఉసిరి, విలంబి, రేగు, వెలగ, చింత, అనాస, ద్రాక్ష మున్నగు వగరు పులుపుకాయలుగూడ మిత్రతుల్యముగావు; ఉద్రేకలక్షణములు దేహమున లేనిచో నవియే ప్రబలశత్రువులుగాను గోచరించును. బాగుగ నాలోచించినచో నిందు చర్మతలమున చేదువిషచమురులులేని పులుపుపండ్లనేకరెట్లు మంచివైనట్లు చెప్పనొప్పును. వానిచర్మతలమున నారింజవర్గమునకున్న చర్మవిషము లేదు. కేవలము ప్రకృతిననుసరించి సాత్త్వికాహారులై జీవించువారికి పులుపుగలపండ్లేవియు పనికిరావట్లు అనుభవము చెప్పగలదుగాని, తొట్టిస్నానములు చేయువారు నారింజపండ్లను దేహతత్త్వోద్రేకము ననుసరించి, కొంతకాలమువఱకు సహజమగు మందుగా వాడుకోవచ్చును. ఈమాటలు తొట్టివైద్యముచేయువారికి ఋజువిసి చెప్పవలసివచ్చినదిగాని నిజముగా నవి మానవుల కెంతమాత్రము పనికిరావనియే మాయుద్దేశము. మేము వాని ననేకవిధములుగా నిప్పటికి 18 సంవత్సరములనుంచి వేలాది వాడుకజేసి చూచితిమి. నారింజకాయలలో విటమినులున్నమాట నిశ్చయమేగాని యవి స్వాభావికమానవుల కుపకరింపవు. నారింజకాయలు మహోపకారము చేయుచున్నవెంచుకొనువారు మాత్రము వానిని తమ కవసరమైనసమయమున మితముగా వాడుకొని తక్కిన సమయమున విడచిపెట్టవలయునని మరియొకసారి హెచ్చరించుచున్నాము. అవి తమదంతములను ముక్కలు ముక్కలుగా తినివేసి పాడుజేసినవని గుడివాడ సేవాశ్రమసంస్థాపకులగు బ్రహ్మశ్రీ గూడూరి రామచంద్రరావు పంతులు వారొకపుడు మాయోగాశ్రమమున కేతెంచి ప్రసంగవశాత్తు సెలవిచ్చిరి. అనుమానముగలవారికి అనుభవమే సాక్ష్యమొసగగలదు.” (ప్రకృతి)

పాత్తూరి రామరాజయోగీంద్రులు.

గౌతమి పుష్కరము: రాజమండ్రి స్వదేశీప్రదర్శనము:—

“ఈసారి పుష్కరవిశేషములలో మారాజమండ్రి నూతనోత్సవమందినది. స్వదేశవస్తుప్రదర్శనము, అందున ముఖ్యముగాచూడతగ్గది చలనప్రతిమాప్రదర్శనము. మూడణాలటికెటుతో, మూడుకోట్లకన్నుల చూపుచూశామని మురియుచున్నారు. ఆబొమ్మ లేమయినమతో చేస్తేనేమి స్వభావసిద్ధ మానవస్వరూపము చలనముతో తయారుచేసే బుద్ధివిశేషము కొనియాడతగినదే. యశోదాదేవి, తనముద్దులకృష్ణుతో పందిరిమంచముపైగాఢనిద్రాపరవశయైయుండు ప్రదర్శనము స్వభావసిద్ధముగానున్నది. దానిప్రక్కనే యశోదరొమ్ముడిలో బాలకృష్ణుని పరుండపెట్టుకొని, ఊయలరొుకచేతితో ఊపుకొనుచున్నట్లు ఎలక్ట్రిసిటీవలనచే తయారుచేసిరి. లోకమాన్యబాలగంగాధరతిలక్ మహాశయుడు, కుర్చిలోకూర్చుని, డ్రాయరుపైనున్న హరికేనులాంతరురొదుట పేపరుచూచుచున్నట్లు కనులిటునటు పంక్తులయందు త్రిప్పుచున్నట్లమర్చియుండిరి. ఆప్రతిమ తిలక్ మహాశయుని దర్శనభాగ్యమబ్బినటులున్నది. మరియొకచో, గాంధిగారికడుపులోని రణము నాపరేషను చేయుసీను. బల్లపైపరుండపెట్టబడి గాంధీజీయు, మత్తునిచ్చి నాడీపరీక్షచేయు డాక్టరును. ఇరుగడల కత్తెరలదాల్చి నర్సులును, ఎక్కడనోజరిగినదృశ్య మీప్రదర్శనమున లక్ష్యమైనది. తెరవేయుట, తీయుట, తీసినపుడొకనర్సు ఆపరేషనుసామానుల నొకదానిలోపెట్టుకొని లోనినుండి వచ్చుచున్నటులమర్చిరి. గాంధిగారిపొట్ట ఊపిరివిడచుచున్నది. వింతదృశ్యమిది. ఒకచో విశ్వామిత్రతపస్సు, మేనకవచ్చుట, విశ్వామిత్రుడిటునటు కనులు

త్రిప్పిచూచుచున్నటులున్నది. ఇట్లనే విఘ్నగుడి, భక్తుల హరిసంకీర్తన. బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి విశ్వామిత్రుడు చేసెనని వినుటయేకాని, ఇట్టిదృశ్యములచే ఇదియేయని అనుభవమగుచున్నది. ఇంకను చిత్రలేఖనాది సమస్త దేశీయవస్తువులచేతను, ప్రదర్శనము నయనానందకరముగా నున్నది. అందును ఆప్రదర్శనము, దేశీయ వృత్తికాధారమగు పేపరుమిల్లునందమర్పబడినది."

—ఆచంట సత్యవతమ్మ.

**మైసూరు సంస్థానమున విద్య:—**

"మైసూరు సంస్థానమువారి 1931-వ సంవత్సరపు వ్యయము రు. 69,09,448 లు. అందు ప్రాథమిక విద్యకొఱకు రు. 20,68,173 లు; ఉన్నతపాఠశాల విద్యకొఱకు రు. 10,11,832లు; విశ్వవిద్యాలయముకొఱకు రు. 9,43,676 లు; ప్రాచ్యవిద్యాలయముకొఱకు రు. 49,317 లు. ఇట్లు విద్యకొఱకు ఇంతటిమొత్తమును వ్యయపఱచుచున్న సంస్థానమువారు సాంకేతికవిద్యకొఱకు రు 3,28,074లు మాత్రమే వ్యయపఱచియున్నారు, పాఠశాలవిద్యవలన ఈదినములలో విశేషప్రయోజనములేదు. సాంకేతికవిద్య కావలయును. దానికొఱకు ఈ సంస్థానమువారు వెచ్చించుమొత్తము మిక్కిలితక్కువగా నుండుటమాత్రము నిరసింపవలసిన విషయము."

—*The Daily Post.*

**బంగారమా? బ్యాంకా:—**

"జూలై నెల 'గృహలక్ష్మిలో' "హైందవస్త్రీలు: ఆభరణములు" అనుశీర్షికలో వెలువడిన తొలిప్రస్తుమును గాంచితిని. ఆభరణములు సౌందర్యమున కాలవాలముకావనియు, ఆభరణములు లేనంతమాత్రమున అందమునకేకొఱంతయు గలుగదనియు, ఆడువారలకు ప్రత్యేకనిధులు యేర్పాటుచేయుటకై యాభరణములను తండ్రులిచ్చుచుండెడివారనియు, అప్పుడు Bank లుండిన వారీపద్ధతి నవలంబించియుండరనియు, నవనాగరీకులు కండ్లుతెరచియు ప్రాచీనాచారములకు లోబడుచున్నారనియు సూచింపబడెను. వ్యాసమునుబట్టి యంత విస్పష్టముగాకపోయినను ధ్వనినిబట్టి, ఆడువారలకిచ్చి యిప్పించెడి యలంకారములను మాన్పించి వానికిమారుగా వానివిలువకు సరిపోవుధనమును వారిపేర బ్యాంకులోవేసి వేయించవలయునని యుద్దేశమైనట్లు దోచుచున్నది. ఇచ్చి యిప్పించుట, వేసి వేయించుట అనగా ఈరెండింటికినికర్త జనకుడు. ఆభరణములను తానిచ్చి మామగారిచేత యిప్పించవలయును. కుమార్తెను కని, పెంచి తగినవానికి ధారాదత్తము గావించుచున్న తండ్రి కన్యాదానఫలముగై కొనుటకును 'దశపూర్వేషాం దశాపరేషాం' అను రీతిని తన 20 తరములవారిని తరింప జేసికొనుటకును "కన్యాం సాలంకృతాం సాధ్వీం" అను వాక్యమును 'సాలంకృతకన్యాదానమహాంకరిష్యే' అను సంకల్పమును సిద్ధింప జేసికొనుటకును కొన్నియాభరణములను యథాశక్తిని పిల్లకిచ్చుచున్నాడు. తాను తరించి తనవారిని తరింపజేయుట కనువైన ఈమార్గమునే తండ్రి విడచిపెట్టి కూతురిపేర ధనమును బ్యాంకులోవేయుట కిచ్చగించునా? పిల్లను తనకు కోడలిగాచేసుకొనుచున్న మామగారు శేషహోమానంతరమున తనకోడలిచే యాభరణపూజ చేయించుటకై కొన్నియాభరణముల నిచ్చును. ఈవైభవ మేమామగారు మానుకొనగలడు? ఇదిగాక పిల్లలు కాపురమేగినపిమ్మట తమభర్తల యాజ్ఞతో మరికొన్ని యాభరణములను చేయించుకొనుచున్నారు. ఇట్టిస్థితిలో నగలలంకారమునకు కావని నాలుగుపంక్తులు వ్రాసినంతమాత్రమున వారీమణులువప్పుదురా? ఆభరణములందమిచ్చును, లేదు అని యిందువ్రాతలువ్రాయుటకంటె సోదరీమణులారా! అవిమర్శ మీకేవిడచిపెట్టెదను. నిర్ధారణగల వారనసరములేదు. సంశయాస్పదులు వెంటనే మీకుగల యాభరణముల ధరించి నిలువుటద్దముకడ నిలచి మీమూర్తిని జూచుకొనుడు. పిదప యాభరణరహితలై యద్దమున మిమ్ము జూచుకొనుడు. ఏప్రతిబింబము మీకు సౌందర్యముగా గాన్పించునో యయ్యది కళానంతమో నిష్పక్షపాతబుద్ధితో పాశ్చాత్యనాగరికత నించుకమరపుగొని నిర్ధారణజేయుడు. ఇక ధనమునునిలువజేసి

కొనుటకు బ్యాంకులు, బంగారము తప్ప వేరు పద్ధతులు లేవా? కనుక నోతల్లులారా! ప్రాచీనుల యాచారములకిప్పటి నవనాగరికులచే కల్పింపబడు విపరీతార్థములను విశ్వసింపవలదు. పాశ్చాత్యనాగరికతయందు మునిగి తేలవలదు. ఆభరణములను నిరసించి యర్థము నాశించవలదు. మీ జనకుడు మీకు వేరుగా మూలధనమును గూర్చనవసరము లేదు. ఏనాడు మీ జనకుడు సాలోచనాపూర్వకముగా మీ మానప్రాణసర్వస్వములను ధారాపూర్వకముగా నింకొకని యధీనము గావించినాడో ఆనాడే మీ కిహపరసాధనమార్గము వాతడు నిరూపించినాడు. అదియే పతిసేవ. భర్తృసేవయే మానవతులకు పెన్నిధి. అద్దాని ననుసరించుచు మీరలు గృహలక్ష్మీ విధానమును గుర్తించుచు కులకాంతలై కీర్తిగాంచుచు పుట్టినింటికి మెట్టినింటికి వన్నె బెట్టుచు హిందూమాత నుద్ధరింపుడు."

—పప్పు సూర్యనారాయణ.

## హిందీభాష: స్త్రీలు:—

"భారతీయులు పలుభాషలు మాట్లాడువారగుటచే నొకరిభావము లొకరు గ్రహింపజాలకున్నారనియు, ఇట్లుండుట జాతీయైక్యతకును, దేశపురోభివృద్ధికిని గొప్ప ప్రతిబంధకమనియు భావించి దేశీయ నాయకులు సమస్తజనులకును సులభసాధ్యమైన భాష యేదియాయని విచారించి మన దేశమున అన్ని ప్రాంతములలోను హిందూస్తానీభాష వాడుకగా నుండుటచేతను, హిందీభాష దానికి సమీప్యసంబంధము గలిగియుండుటచేతను, సులభముగా నేర్వదగినదై యుండుటచేతను హిందీభాషనే రాష్ట్రభాషగ నిర్ణయించిరి. అప్పటినుండియు హిందీభాషాప్రచారము దినదినాభివృద్ధి నొందుచున్నది. ఇందువిషయమై పెక్కుసంఘములు స్థాపింపబడి ప్రచారకులను గ్రామములకు సైతము పంపుచు తీవ్రముగా కృషిసల్పుటచే ప్రతివాని హృదయమునందును హిందీభాష నేర్వవలెనను కోరిక ఉద్భవించినది. అత్యుత్సాహముతో పెక్కురు యువకులు, యువతీమణులు హిందీభాష నేర్చుచున్నారు. ఉన్నతపాఠశాలలయందుగూడ ఈభాష ప్రవేశపెట్టబడినది. కాని ఈవిధముగా కృషిసల్పుటచే దేశీయులందరు హిందీభాషను నేర్వగలరా? యనునది విచారణీయాంశము. ఎల్లకాలమును సంఘములు ప్రచారకులను నియమించి పాటుపడుట దుస్సాధ్యము. యువతీమణులు పూనుకొనినగాని ఈపని సులభముగా నెరవేరజాలదు. తల్లులు హిందీభాష నేర్చియుండిన తమశిశువులకు ఉగ్గుపాలతో హిందీని నేర్పనారంభింపవచ్చును. ఎప్పటికైనను భారతీయులందరు హిందీభాష నేర్చియుండవలెనన్న ముందుగా స్త్రీలందరు ఆభాష నేర్వనిదే అది నెరవేరజాలదు. కాన ప్రచారకులుకూడ పురుషులకంటె స్త్రీలకు హిందీభాష నేర్పుటకై ఎక్కువ ప్రయత్నించవలసియున్నది. శిశువులే భావిపౌరులు. దేశమున ఎట్టిసంస్కరణ జరుగవలెనన్నను తల్లులసహాయము లేనిదే అది సర్వాంగసుందరముగా నెరవేరజాలదు. బాలికలే భావిమాతృదేవులు గాన బాలికాపాఠశాలలలో హిందీనికూడ నేర్పుటచేతను హిందీ నేర్చినయువకులందరు తమ సతీమణులకు శ్రద్ధవహించి హిందీభాషాజ్ఞాన మలవరచుటచేతను, స్త్రీలలో హిందీప్రచారము బాగుగా జరుగగలదు. కాన దేశాభివృద్ధినికోరు ప్రతివారును స్త్రీలకు హిందీభాషనుగరపువిషయమై శక్తివంచనలేక పాటుపడుదురుగాత!"

—ఏ. సీతారామదేవి.

## ఒక క్రొత్త రాష్ట్రము:—

ప్రత్యేక ఒరిస్సారాష్ట్రమునుగూర్చి విచారించి అందుకుగల ఆర్థికము మొదలగు విషయములను సమాలోచించి సరిహద్దులనిర్ణయించుటకు భారతప్రభుత్వమువారిచే నియమింపబడిన కమిటీవారు తమ నివేదికను ప్రకటించిరి. ఈనివేదికలో సంతోషింపదగిన ప్రథమవిషయము - ఏర్పడబోవు ఒరిస్సారాష్ట్రము విస్తీర్ణ మెచ్చుటకుగాను మిడ్నపూరు, బంకూరా అను వంగదేశపుమండలములనుండి కొంచము ప్రదేశము నైన గైకొనకుండు

టదే. బెంగాలును విడదీయతలచినచో ఈరాష్ట్రమున విశేషమైనఆందోళనకు కారణమగును. కావున కమిటీ వారు ఈవిషయమై కదుపకుండినది లెస్స. నూతనరాష్ట్రమున ఒరిస్సాభాగమును, అన్గుల్, రాయిపూర్ జిల్లా లోని కారియర్ జమీందారీ, గంజాంజిల్లాలోని విశేషభాగమును, విశాఖపట్టణముజిల్లాలోని ఏజెన్సీభాగము లును నుండగలవు. ఈక్రొత్తరాష్ట్రనిర్మాణమువలన విస్తీర్ణమునందును, జనాభాయందునుబీహారు, మద్రాసు రాష్ట్రములు నష్టపడును. కాని ఆర్థికముగ ఈరెండురాష్ట్రములును ఒరిస్సారాష్ట్రనిర్మాణమువలన బాగుపడ గలవు. క్రొత్తరాష్ట్రమునకు ప్రథమవత్సరమున 35.21 లక్షలు లోటురాగలదు. ఏర్పాటుఅయిన 15-వ సంవ త్సరమున ఈలోటు 40.93 లక్షలకు పెరుగగలదు. ఈలోటు క్రొత్తపన్నులవలన భర్తీయగునదికాదని కమిటీ వారిభయము. కాబట్టి క్రొత్తగ ఆదాయమువచ్చువిధానముచేగాని, కేంద్రప్రభుత్వమువారిచ్చు మొత్తముచే గాని, లేదా రెండుపద్ధతులచేగాని ఈలోటును భర్తీచేయవలసియుండును. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణము నకు మేము సుముఖులమేయైనను అర్థమునకు కేంద్రప్రభుత్వముపై ఆధారపడియుండు దివాలారాష్ట్రముల నిర్మాణమునుమాత్రము మే మెంతమాత్రమును అంగీకరింపజాలము. సరిహద్దురాష్ట్రమువిషయము వేఱు. సింధు దేశీయులను, ఉత్కళులను ప్రత్యేకముగనుండుటకై దివాలారాష్ట్రములనేర్పఱచి కేంద్రప్రభుత్వము వానిని పోషింపుచుండవలయుననుట మితిమీరినకోర్కెకోరుట. ఉత్కళులు ప్రత్యేకరాష్ట్రమును తీవ్రముగ కాంక్షించుచో దానిని ఆర్థికముగ పరసహాయములేకుండ తనకాళ్లమీద తాను నిలుబడగలుగుసాధనములు సమకూర్చు కొనుట వాంఛనీయము."

—*The Bengalee.*

సూత్రయజ్ఞము : బై ఇండియన్ లీగ్:—

"దేశమునపీడలు, కాటకములు, రోగములు, రాక్షసపీడనచే ప్రజలు బాధపడుచున్నప్పుడు ప్రాచీన ఆర్యఋషులుచే యజ్ఞములను వ్రతములను సాధనములుగ ఇవ్వబడిన అస్త్రములు. అట్లే కాంగ్రెసును మహాత్ముడును భారతవర్షమునుపట్టి పీడించుచున్న దరిద్రదేవతను రూపుమాపుటకు భారతీయులు స్వదేశ వ్రతముపూని సూత్రయజ్ఞమును ప్రతినిత్యము అరగంటకాలముచేయవలెనని మహాత్ముడు పదేపదే కోరు చున్నాడు. భారతజాతి స్వదేశవ్రతమును మహాత్ముడు చెప్పినట్లుగాక యొవరియిష్టానుసారమువారు స్వదేశికి అర్థములు వ్యాఖ్యానములు, సూత్రయజ్ఞమునకు యిచ్చి స్వదేశీదీక్షపూనుటచేతను, సూత్రయజ్ఞము చేయువారు నూటికి అయిదుమందైనను లేకపోవుటచేతను, కాంగ్రెసుచెప్పిన ఫలితమును చరఖాద్వారపొందలేక పాశ్చాత్య యంత్ర పిశాచములను మాత్రమేగాక, భారత నేతపరిశ్రమమారణ యంత్రమునను, ధనవంతుల ధనమును సం పూర్ణ విదేశవస్త్రబహిష్కారమునకు సాయముగ తీసికొనకపోయినచో స్వరాజ్యము కలలోనివార్తయగును. చరఖాపునరుద్ధారకుడును, కాంగ్రెసునాయకులును కారాగృహనిర్బంధితులైన యీక్లిష్టదినములందు Buy Indian League తమస్వజము నెత్తిపాహపించగల్గిరి. మదన్ మోహన మాలవ్యవంటి మితవాదికూడ గుడ్డకొను వారందరు ఖద్దరును, యితర వస్తుసముదాయమును భారతయుత్పత్తిని మాత్రమే కొనవలెనని, ప్రదర్శనములందు యుత్సవములందు యుపయోగించుట భారతీయుని ప్రస్తుతకర్తవ్యమని చాటుచుండ, Buy Indian League వారు మిల్లుగుడ్డలకు ప్రదర్శనములందు ప్రథమస్థానము యిచ్చుటయేగాక, కొన్ని భారతయంత్రముల యుత్పత్తిని కాంగ్రెసువారు Certify చేసినారను మిష పెట్టి, అట్టియంత్రయుత్పత్తివస్త్రములను నిరాఘాటముగ అమ్ము చున్నారు. కాంగ్రెసు స్థాయిసంఘమును, మహాత్ముడును శాసనోల్లంఘనోద్యమనియమములందు కాంగ్రెసు ప్రస్తుత దేశపరిస్థితులందు స్త్రీపురుషులను భారతయంత్రపు గుడ్డలనుకూడ త్యజించి ఖద్దరునుమాత్రమే కట్టుదురని ఆశించుచున్నదని తమఆశను వెలిపినపిదపకూడ మిల్లుగుడ్డ కాంగ్రెసు కొనమనినదని సాకుచెప్ప సాహసించు

వారి జీవితమును, వారి మేధాశక్తియు, దేశభక్తియు, మహాత్ముని చరఖాతత్వమునందు వారికున్న పాండిత్యము, శైలుకుపోయిన నిరర్థకత, నేను వ్రాయకుండగనే ఋజువు చేయుచున్నది. "Buy Indian League"అను సంఘము భారతవర్షమున పాశ్చాత్య "Buy British" "ఆంగ్లదేశ యుత్పత్తివస్తువులను కొనుడు"అను సంఘమును అనుసరించుచు 1932-వ సంవత్సరమున స్థాపించబడినది. ఈసంవత్సరప్రారంభము పట్టణములందు నగరములందుజరిగిన లాఠీప్రయోగములకు ధనికులైన విద్యావంతులు సత్యాగ్రహమున పనిచేయుటకు వెరచి యీసంఘమున చేరి దేశసేవచేయ నిశ్చయించిరి. గృహలక్ష్మిగా ఎన్నబడుచున్న రాట్నమును భారతజాతీయ పతాకమునందు, నిరుపేదల సేవాపరాయణత్వము సూచించుచిహ్నముగ నాయకులందరు ఏకగ్రీవముగ చిత్రించిరి గాని రాట్నగానమునందు గర్భితమైయున్న నవజీవితకాంతితత్వమును, నాయకాగ్రగణ్యులుకూడ సరిగ గ్రహింపజాలకపోయిరని, వారిసంభాషణలవల్లను Buy Indian League వారి "స్వదేశీ" నూతనోద్యమప్రచారమువల్లను, స్వదేశీప్రదర్శనములవల్లను గ్రహింపవీలగుచున్నది. రాట్నమునకు నాగేంద్రియను ఆమెను సృజించిన విశ్వకర్మ ప్రసాదించియున్నచో ప్రస్తుతకాలపు అర్థికతత్వవేత్తలచే ప్రారంభింపబడిన "Buy Indian League" "హైందవయుత్పత్తిని మాత్రమే కొనుము"అనిచెప్పు సంఘమువారుచేయు యంత్రప్రచారమును తీవ్రముగ ఖండించియుండెడిది. "Buy Khadi" ఖద్దరును కొనుము"అని చెప్పుటకుకూడ వెరచి యీ నూతన దేశభక్తిసేకలను కనిపెట్టిరి. దేశభక్తిగలపెద్దలు మిల్లుగుడ్డనుకొనుమని చెప్పుటయేగాక నిరుపేదల రక్తమును పీల్చుటకు సాధనములుగానున్న మిల్లుగుడ్డలకు గొప్పవేడుకలతో పూజలు, పురస్కారములుచేసి గొప్పగొప్ప ప్రదర్శనములను యేర్పాటుచేయుచున్నారు. ఈ ప్రదర్శనములచే పామరులు మోసపోయి ఖద్దరును కొనుటకంటె మిల్లుగుడ్డనుకొనుట సరసమనియు, దేశభక్తియనియు, గ్రామముల ఆర్థికసంపత్తిని కాపాడునని భ్రాంతిలోపడిపోవుచున్నారు. అందుచే యంత్రముల పెట్టుబడుదారులై, లాభములను స్వార్థమునకు వినియోగించు ధనికులకు లాభకరమేగాని, నిరుపేదయొక్క తీరికకాలమున (Leisure Hours) స్వల్పఆదాయమునుఇచ్చు రాట్నపరిశ్రమకును తద్వారఖద్దరునకు అపారమైన నష్టమును మాత్రమేగాక, ధర్మవినాశనమునకు దారిచూపుచున్నది. ఈసత్యము నెమ్మదిపై నిర్ధారణకాగలదు." —కొండిపర్తి పున్నయ్య.

ఓఢ్రులు : ఆంధ్రులు:—

"హిందూదేశమున ప్రత్యేకభాషల ప్రకారము రాష్ట్రముల నేర్పరచుటయం దనేకకష్టములున్నవి. గంజాము విశాఖపట్టణముజిల్లాలవారు బరంపురమున ఒకసభచేసి తమజిల్లాలలోని కొన్నిభాగములను క్రొత్తగా ఏర్పడబోవు ఒరియారాష్ట్రమున చేర్చుకొనువిషయమై తమ అసమ్మతిని కనుపరచుట ఈకష్టముల కునికికి ఒక సూచన. ప్రస్తుతము బెంగాలు, మదరాసు, మధ్యరాష్ట్రములలో ఓఢ్రులు తక్కువసంఖ్య గలిగినవారుగా నుండుచో వారికి ప్రత్యేకరాష్ట్రము నేర్పరచుటవల్ల అట్టిప్రత్యేకఓఢ్రరాష్ట్రమందుండుకొద్దిసంఖ్యాకులయి అసంతృప్తిగల ఆంధ్రసంఘము ఏర్పడును. ఒరిస్సాకమిటీవారు సిఫార్సుచేసిన ప్రకారము వారికి నూతనరాష్ట్రమేర్పడిన ఆరాష్ట్రము 33000 చదరపుమైళ్ళ విస్తీర్ణముగలిగియుండును. అందు 18000 చదరపుమైళ్ళ విస్తీర్ణము గలిగిన దేశము మదరాసునుండి ఓఢ్రరాష్ట్రమున చేరగలదు. ఇట్లుక్రొత్తగా ఏర్పడబోవురాష్ట్రమున 84 లక్షల జనసంఖ్యయుండును. ఇందు 23 లక్షలు మదరాసువారు. కమిటీవారి సిఫార్సుప్రకారము ఆరులక్షల ఆంధ్రులు ఈక్రొత్తరాష్ట్రమునకు పోవలసివచ్చును. కాని ఇట్టిమార్పు ఈ ఆరులక్షల ఆంధ్రులకును యిష్టము లేదు. ఏలనన నూత్నరాష్ట్రమున హైకోర్టుగాని, యూనివర్శిటీగాని లేకపోవుటవల్ల అచ్చటి ప్రభుత్వమువలని సౌకర్యములు మిక్కిలి తక్కువగానుండును. ఆంధ్రులు మదరాసునుండియు, తమ వారిమధ్యనుండియు ఊడిపోవుటకు తమ అయిష్టమును చూపుటన్యాయమే. అది ధర్మసమ్మతమే. కాని 84 లక్షలమంది ఓఢ్రదేశస్థులు

ఒకచోట తమసంఖ్యకొద్దియై బాధపడుటకన్న ఆరులక్షల ఆంధ్రులు అట్టిస్థితిలో నేయుండుట అంతకన్న ఎక్కువకాదు. ప్రత్యేకభాషల మాట్లాడువారికొక ప్రత్యేకరాష్ట్రము ప్రకారము విభజించుటవలన తెగినన్ని చిక్కులు మరల నేర్పడుచున్నవి. నిమ్నసంఖ్యాకులరయు ఎక్కువజనము వారియొక్క హక్కుల గమనించి వారిని తృప్తిపరచుటకై తప్పక వేరొకరాష్ట్రము మేర్పడుచున్నది. ఇట్టి ప్రత్యేకరాష్ట్రవిభజనలో మరల నిమ్నసంఖ్యాకులు ఏర్పడుచు అట్టికష్టముల నెక్కువచేయుచునే యుందురు. ఇప్పుడు తమలోకొందరిని నూత్న ఒఱ్ఱరాష్ట్రములో జేర్పకూడదని ఆందోళనము చేయు ఆంధ్రులే తమకొకప్రత్యేకరాష్ట్రమును కోరుచున్నారు. దీనివల్లకూడ ఆంధ్రరాష్ట్రహద్దులలోని తమిళులకు అసంతృప్తికలుగును. కొద్దికాలములోనే ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమువచ్చుట నిశ్చయము. తమదేశమున స్థావరముగానుండు అల్పసంఖ్యాకులకు కలుగబోవు కష్టముల గమనించి ఆంధ్రులు తమ అనంగీకారమును ఆందోళనగా చేయరని మా ఆశయము."

—(అనువాదకుడు) ఒంగోలు పద్మరాజు బి. ఏ.
*Calcutta Evening News.*

విమానచోదనమున ప్రవీణురాలు:—

"రెన్ ప్రూనగరనివాసిని వినిఫ్రెడ్ డ్రింక్ వాటరు కన్యకు వయస్సు 19 సంవత్సరములు. ఈచిన్నతనముననే ఆమె విమానచోదనవిద్యయందు ఆరితేరి బి. లైసెన్సుపొందెను. లింప్నియందలి కిన్కుపోర్టు విమానస్థానమున ఆమె తరిఫీయుతునొందెను. ఒకనాడు పదిగంటలన్నరకు ఆమె విమానముపై లింప్ని నుండి స్టాగ్ లేనుకువెళ్లెను. స్టాగ్ లేనునుండి బ్రిస్టలుకుపోయెను. అచ్చట ఆమె గాలిలో విమానముపై ఏడువేలఅడుగుల ఎత్తున ఒక్కగంటయుండెను. డ్రింక్ వాటరుకన్య పాఠశాలవదలుటతోడనే తన పదునేడవసంవత్సరమున స్కాటిష్ ఫ్లయింగుక్లబ్బులో చేరెను. తోడనే తానావిద్యయందు అందెవేయగలుగుట ఆమెకు తెలిసివచ్చెను. కావున ఆవిద్యతో పరిచయముకల్పించుకొనెను. పదునెనిమిదిఏండ్లు నిండినకాని లైసెన్సు ఈయరు. కావున ఆమె రెండుసంవత్సరములు వేచియుండి తన పందొమ్మిదవ జన్మదినోత్సవమున విమానయాత్రపరీక్షకుబోగెను. ఆపరీక్షలో కష్టతమకార్యము రాత్రిపూట క్రాయిడన్ నుండి లింప్నికి విమానముపైవెళ్లుట. ఇట్లువెళ్లుచుండగా ఫ్లడ్ లైట్సు (Flood Lights) ఆరిపోయెను. అయినను డ్రింకువాటరుకన్య నిర్ణీతస్థలము తప్పిపోకనిలచెను. యథాస్థానమున విమానమునుదింపెను."

—*Equal Rights.*

జర్మనీ పోలీసు శాఖ : స్త్రీ పోలీసులు:—

"ఫ్రాఈడ్ గోచిన్ అను జర్మనుస్త్రీ జర్మనీదేశపు రాజధానీనగరమగు బెర్లినుపందలి స్త్రీపోలీసు శాఖకు అధ్యక్షురాలు. ఆమె ఈనడుమ శలవులలో లండనునగరమునకు వచ్చినపుడు మాప్రతినిధితో ఆమె వెల్లడించిన విషయములు: బెర్లిను నగరమున పోలీసుశాఖలో ప్రస్తుతము 35 గురు స్త్రీలుగలరు. ప్రష్యా దేశమంతయినాడను 108 గురు గలరు. బెర్లినుస్త్రీపోలీసుశాఖలో మూడువిభాగములుగలవు. (1) దౌర్జన్యపు కేసులవిచారించు ఉపశాఖ (2) దొంగతనపుకేసులవిచారించు ఉపశాఖ (3) పెట్రోలు (గస్తీ) పనిచేయు ఉపశాఖ. ఈవివిధశాఖలలో పని బాగుగాపెరుగుచున్నది. ప్రత్యేకపుదుస్తులుగాక ఈ స్త్రీపోలీసులు మామూలుదుస్తులనే ధరించుచున్నారు. స్త్రీపోలీసుల సంఖ్య ఇంకను అభివృద్ధినొందుట వాంఛనీయము. బెర్లినునగరమున గస్తీ, పహారాకార్యములను చేయుటకున్న ఇపుడున్న పండ్రెండుగురు స్త్రీపోలీసులును, వారిఅధికారియు చాలియుండుటలేదు. కాని 1926–లో ప్రథమమున నలుగురు స్త్రీపోలీసుల నియమించినప్పటికంటె ఇప్పుడు మంచి అభివృద్ధిగలదు. ఇకముందును కాగలదు. శ్రీమతి ఫ్రాలిన్ వీకింగు స్త్రీపోలీసు బ్యూరోకు నాయకురాలై సమర్థతతో కార్యము నిర్వహించుచున్నది." —*The Police woman's Review.*



## పాములకు నడకలో వేగము లేదు:—

పాములు మంచివేగముగ నడుచునని ఈవఱకు నమ్మబడుచున్నది. ఈ విషయమై కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమున పెక్కురకముల పాములతో పరిశోధనలు సలుపగా అందు బాగుగా నడుచునని ప్రజలు నమ్మినది గంటకు రెండున్నర మైళ్లు మాత్రము పోయెను. మనుష్యుడు ఒకగంటకు నడుచుదూరముకంటెను ఇది తక్కువయేగదా!

## చెక్కులమీద సంతకము చేయుటకు యంత్రము:—

లండనులో చెక్కులమీద సంతకము చేయు యంత్రము ఒకటి కనుగొనబడి ప్రదర్శనశాలకు తీసుకొని రాబడినది. అది గంటకు 7,500 చెక్కులమీద సంతకము చేయగలదు. అంతియేగాక సంతకమునకువచ్చిన చెక్కులు నిజమైనవో దగావో కూడ అది నిర్ణయించి చెప్పగలదు.

## సీసమునుండి బంగారము చేయుట:—

సీసమును బంగారముగ చేయు ప్రయత్నములు చిరకాలముగ రసవాదులు ఒనర్చుచున్నారు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము కావెన్ డిష్ లాబరేటరీలో డాక్టరులు జె. డి. కాక్ రాఫ్టు, ఇ. టి. యస్. వాల్ టన్ గార్లు చేసినపరిశోధనవలన ఆప్రయత్నము లిపుడు నెఱవేఱునని నమ్మవచ్చును. వీరిపద్ధతిని ఒకలోహమును మఱియొకలోహముగ మార్చవచ్చునని తెలియవచ్చుచున్నది.

## మొసలికులమునకు ముసలమైనవాడు:—

అమెరికాలో ఫ్లారిడాప్రాంతమున హెన్రీకాపింగర్ అనుయువకుడు నిరాయుధుడై నదులలో దుమికి మొసలులతో యుద్ధము సేయుచున్నాడు. ఇప్పటికి 150 మొసళ్ళను దవడలుపట్టిచీల్చి హతమార్చియున్నాడు. ఆతనియొడలిపై యింతవఱకు ఒకగాయమైన లేదు.

## సముద్రముపై సైకిలు త్రొక్కుట:—

హైడ్రోసైకిలు (నీటిపైపోవుసైకిలు) పైనెక్కి ఒకడచ్చి దేశస్థుడు ఇంగ్లీషుఛానలు దాటి లండను చేరెను. ఇట్లు సముద్రముదాటుటకు ఆతనికి పదమూడుగంటలు పట్టెను. ప్రయాణమధ్యమున అతడొకసారి తుపానుకు గురియయ్యెను. ఈతనివయస్సు 51 సంవత్సరములు. ఈపదమూడుగంటలకాలమును ఈతడు సైకిలు త్రొక్కుచునేయుండెను. ఏమియుభుజింపలేదు.

**లండను పోలీసు కోర్టులలో భార్యలు:—**

వారమువారమును లండనులో పోలీసుకోర్టులకుపోయి భర్తలనుండి విడాకులు పొందినభార్యలు అయిదు వేలమందికిపైగా తమమనోవృత్తులను తెచ్చికొనుచుందురు.

**ప్రపంచములో కెల్ల బరువైన మనిషి:—**

ప్రపంచములో కెల్ల బరువైనమనిషి అమెరికాలోగలడు. ఆతనితూకము 93 గుండ్లపెత్తు. ఆతనితరువాత ఆంగ్లేయదేశమునందలి హాప్కిన్సుఅనువాడు బరువైనవాడు. ఈతనితూకము 85 గుండ్లపెత్తు.

**విచిత్రమైన వృక్షము:—**

ఆఫ్రికాఖండమందలి కాంగోనది సామీప్యమున నరమాంసభక్షకులగు నీగ్రోలుగలరు. వారలకొకవేళ ఆహారపదార్థములు లభింపకపోయిన వారిలో లావాటివానిని అగ్నిజ్వాలలోబడవైచి కాల్చి చిలగడదుంపవలె భుజింతురు. వీరలు క్యానిబాలనంబడుదురు. వృక్షములలో కొన్నియాకులకు పురుగులనాకర్షించి వాటి సారమును గ్రహింపశక్తిగలదు. ఇట్టిశక్తిగలవగుటచే యివిక్యానిబల్ చెట్లనబడుచున్నవి. ఆస్ట్రేలియాలో మిగుల యెత్తైనచెట్లుగలవు. వాటి ఆకులను మనుజుడుతాకిన అవి యొండొంటినిదాకి ఆమానవుని నాయువు గొనునని తెలియవచ్చుచున్నది.

—మరకాని పరాత్పరరావు.

**చంద్రగ్రహము:—**

చంద్రగ్రహముయొక్క మధ్యరేఖనిడివి 2,000 మైళ్ళు. భూమినుండి దాని సగటుదూరము 238,800 మైళ్ళు.

**ఏనుగునడక:—**

ఏనుగునడకయొక్క సగటువేగము గంటకు రెండుమైళ్ళుమాత్రమే.

**ఎద్దుపాలు ఇచ్చుట:—**

మేకపోతు పాలుఇచ్చుటనుగూర్చి గృహలక్ష్మిపాఠకులు వినియున్నారు. ఇపుడు ధర్మవరమున ఒక ఎద్దు పాలుఇచ్చుటనుగూర్చి తెలియవచ్చుచున్నది. ఆంధ్రపత్రికకు ధర్మవరము విలేఖరి ఇట్లు వ్రాయుచున్నాడు: "ఇచటికి ఒక మైలుదూరముననున్న చిన్నూరు అనుగ్రామమున గులగాని తిమ్మన్న యను రైతు గలడు. దాదాపు పదియేండ్లక్రింద నొక యెద్దునుగొనెను. అప్పటినుండియు దానిని శ్రద్ధతో పోషించుచు వ్యవసాయమున కుపయోగించుకొనుచుండెను. దాదాపుగ నైదేండ్లు గడచిన పిమ్మట నాయెద్దుకు నావుకువలె పొదుగేర్పడినది. దానిచే నధికబాధను బశువనుభవించునట్లు గన్పడెను. పొదుగులో బాలున్నవేమో యని సంశయించుచుండగనే పొదుగునుండి పాలు కొంచెముగ స్రవింపజొచ్చెను. అటుపిమ్మట ప్రాతస్సాయంకాలముల బాలుపిండ ప్రారంభింపగ నావు చేపునట్లు చేపుచు బాలిచ్చుచున్నది. ఇదియుగాక చూచుటకు వచ్చినవారు పాలుపిదుకగోరినపుడు పిదికినను కొంచెముగ బాలొసగును. మెడనుండి క్రిందిభాగమున నావున కుండునట్టి చిహ్నములే యున్నవి. కాని మూత్రవిసర్జనము పురుషాంగమునుండియే యొనర్చుచున్నది. ప్రజలు వింతనుజూడ తండోపతండములుగా దిరునాళ్ళకువలెవచ్చి చూచుచున్నారు."

**ప్రతిదినము పడుకొని లేచు చెట్టు:—**

రవీంద్రనాథ టాకూరుగారి విశ్వభారతివిశ్వవిద్యాలయమున్న బోలెపూరుకు నాలుగుమైళ్లసమీపమున ఉన్న ఒకకుగ్రామములో ఒకచెట్టు ఉదయమున నేలమీదపడుకొని సాయంత్రమగుసరికి మామూలుగా నిలువబడుచున్నది.

# పత్రికాపరిచయము

**దేశసేవ:—**

బెజవాడనుండి ప్రతిశనివారము ప్రచురింపబడు స్వతంత్రవార్తాపత్రిక. జూలై 9-వ తేదీని వెలువడిన రెండవసంపుటపు 27-వ సంచిక మాకార్యాలయమునకు విమర్శనార్థము పంపబడినది. ఆర్డినెన్సుల 'అమోఘ పరిపాలన' గల ఈదినములలో సయితము తెనుగువారికిగల వారపత్రికలలో దేశసేవయొకటి. సంపాదకులు శ్రీబోడపాటి రామలింగముగారు. పత్రికానిర్వహణవ్యాపారమున రామలింగముగారు స్థిరచిరప్రతిష్ఠగలవారు, 'The Indian Patriot' అను పత్రికను రాజమహేంద్రవరమునుండి ఆంగ్లమున జయప్రదముగ నిర్వహించిన విద్యాధికులు; రాజమహేంద్రవరపురపారిశుద్ధ్యసంఘసభ్యులుగా పలుసంవత్సరములనుండి ప్రజాసేవగావించిన మాన్యులు. ఇట్టివారి యాజమాన్యమున నిర్వహింపబడుచున్న 'దేశసేవ' చిరము వర్ధిల్లి తెలుగువారిని సేవింపగలదనుట నిశ్చయము. ఇట్టి విద్యాధికులు తెలుగు వార్తాపత్రికల నిర్వహణమునకు పూనుకొనువది దేశహితకర విషయము. పాపాయి డైరీ, వృత్తాంతవీథి, టి ఏ ప్యాసయినా?, సారస్వతముఅను ఇందలి కొన్నివ్యాస నామములను పేర్కొనుటవలన ఈపత్రిక పలువురరుచికి అందుబాటులోనుండగలదనువిషయము సులభముగ ఊహ్యమైయున్నది. క్రౌనునాలుగుపేజీలసైజున 12 పుటలు. సాలుచందా రు 3-0-0. విడిసంచిక రు 0-1-0. చిరునామా: 'దేశసేవ,' బెజవాడ.

**కుమారమిత్రము:—**

బాలబాలికల సచిత్రమాసపత్రిక. సంపాదకులు హరి సుబ్బారావుగారు. మొదటిసంపుటము 7-వ సంచిక ఏప్రియలుమాసపుది విమర్శనార్థము మాకడకు బంపబడినది. ఇందు వి. రంగస్వామిఅయ్యంగారి గురుశిష్యసంవాదమును; ధవళ వేంకటబలరామయ్యగారి సావిత్ర్యుపాఖ్యానమును; కర్ణపాలెం కుటుంబశాస్త్రిగారి జర్మనీలోని విద్యాలయములు; వేమూరి శ్రీరాములుగారి పరిసరములు, అనుపంసికము; అలూరు హనుమంతరావుగారి కిండర్ గార్టన్ విధానము అనునవి ప్రధానవ్యాసములు. గృహలక్ష్మియందలి కథలుకబుర్లనుండియు, లోకవార్తలనుండియు విశేషభాగముగ్రహించి ఈపత్రికయందు చేర్చుటచే ఈపత్రికాసంపాదకులకు గృహలక్ష్మి యందుగల అభిమానము తేటతెల్లమగుచున్నది. కుమారమిత్రము నిట్లు సమర్థతతో నిర్వహించుచున్న హరి సుబ్బారావుగారి నెంతయు గొనియాడుదుము. పత్రిక మంచిచిత్రములతో చక్కని గ్లేజుకాగితములపై సుందరముగ ముద్రింపబడుచున్నది. సాలుచందా రు 2-0-0. విడికాపీ రు 0-3-0. ప్రతిఆంగ్లమాసమున 15-వ తేదీని వెలువడును. చిరునామా: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, 35, చిన్నతంబివీథి, మద్రాసు.

## సమస్యాపూరణము

"రాటము వలదనుచు గాంధి రయమున బలికెన్."

ఈసమస్య శ్రీచిలుకూరి సూర్యనారాయణరావుగారు ఇచ్చినది. దీనిని పూరించి స్త్రీలు ఆగస్టు 10-వ తేదీలోపున మాకుపంపిన గృహలక్ష్మిలో ప్రచురింతుము. స్త్రీలలో కవితాజిజ్ఞాస పెంపొందించుట కిది ఉద్దేశింపబడినది. —సంపాదకుడు.

# డైరి

## జూను

19:—బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి సతీమణి శ్రీమతి కమలాదేవిగారు స్వగ్రామము అంగలూరు చేరిరి.

:—పర్లాకిమిడిరాజాగారితల్లి మరణించెను. ఈమెకు 58 సంవత్సరములు.

20:—మదరాసు. పలువురుస్త్రీలు రటనుబజారులో విదేశవస్త్రదుకాణములవద్ద పికెటింగుచేయుచుండగ అరెస్టుచేయబడిరి. వారిని కమీషనరుకార్యాలయమునకుగొంపోయి విడుదలచేసిరి.

21:—సంయుక్తరాష్ట్రములందు మునిసిపాలిటీలలో స్త్రీలకు హెచ్చు ప్రాతినిధ్యము కలుగజేయుటకుగాను సంయుక్తరాష్ట్రముల మునిసిపాలిటీలచట్టమును సవరించుటకు ఖైలాష్ శ్రీవత్సవసతిగారు ప్రతిపాదించిన బిల్లు శాసనసభలో ఆమోదింపబడెను.

:—సర్వెంట్సుఆఫ్ఇండియాసంఘసభ్యులు ఎరవాడచెరసాలకువెళ్ళి రాజకీయస్థితినిగూర్చి శ్రీమతి సరోజినీదేవిగారితో సంప్రతించిరి.

22:—మదరాసుసిటీడిక్టేటరు శ్రీమతి సరస్వతీబాయి పాండురంగంసతిగారికి క్రి. లా. అ. చ. 17 (2), 17 (1) ప్రకారము ఒకసంవత్సరము కఠినశిక్ష. బి. క్లాసు.

:—గుంటూరు ఆంధ్రరాష్ట్రసమావేశనిర్బంధితులలో స్త్రీలు:కొండా సత్యవతమ్మ 4 మాసములు విడిశైదు + 1 మాసము విడిశైదు. సి. క్లాసు. వేదాంతం కమలాదేవి 6 మాసముల విడిశైదు రూ. 200 జరిమానా లేక 1½ మాసము విడిశైదు. ఎ. క్లాసు. పైశిక్షలను (17) (1) క్రి. యల్. ఎ. క్రిందను, 188 ఐ. పి. సి. క్రిందను శిక్షలను వేయుచు రెండుశిక్షలు ఏకకాలమున జరుగునట్లు తీర్పుయిచ్చిరి.

23:—కాశీస్త్రీవలంటీర్లను పోలీసులుకొట్టినవిషయమై ఒకప్రకటన గావించినందులకు రు. 1000 ధరావతును "ఆజ్" పత్రికనుండి ప్రభుత్వమువారు కోరిరి. ఈ స్త్రీవలంటీర్లవిషయమై పురమున హరతాళము జరిగెను. మదనమోహనమాలవ్యాగారి అధ్యక్షత నొకసభజరిగి నిష్పాక్షికమైన విచారణకోరబడెను. మేజస్ట్రేటు విచారణచేసి, పోలీసులమీద నేరమున కాధారముగలదని తలచి 5 గురు కనిస్టేబులను సస్పెండుచేసెను. తరువాత జిల్లామేజస్ట్రేటు పూర్తివిచారణజరిపి పోలీసులు నిర్దోషులని నిర్ధారించెను.

:—విధవావివాహసహాయకసభ (లాహోరు) మదరాసు శాఖ యాజమాన్యమున త్యాగరాజనగరునందు కడప నివాసిని వైశ్యవితంతువు (18 ఏండ్లవయస్సు) శ్రీమతి శ్యామలగారికిని కే. వేంకటరంగయ్యగారికిని (30 ఏండ్లు) వితంతువివాహము జరిగెను.

24:—శ్రీమతి సుబ్బరాయనుసతిగారు ఉదకమండలమునుండి చెన్నపురికివచ్చిరి.

25:—భీమవరములోజరిగిన పశ్చిమగోదావరిమండలసమావేశసందర్భమున ఎరెస్టుఅయినస్త్రీలు: వారణాసి సీతమ్మ (బోండాడ), వసల అంజమ్మ (పడమటి విప్పర్రు) సుబ్బమ్మ, నిల్లా అచ్చమ్మ (శింగవరము) రుద్రరాజు మాణిక్యమ్మ (పాలమూరు), గుజ్జు నాగరత్నమ్మ (పాలమూరు), హద్దనూరి సీతారామమ్మ, (తాడేపల్లిగూడెము). ఇందు అంజమ్మ, మాణిక్యమ్మ, నాగరత్నమ్మ, సీతారామమ్మగార్లకు 10 వి మాసముల విడిశిక్ష.

26:—గుడివాడ. శ్రీమతులు పొట్లూరి పున్నమ్మ, వల్లభనేని యశోదమ్మ (జమీగొల్వేపల్లి), చెరుకూరి కృష్ణవేణమ్మ (తమిరిశ) గార్లకు ఒక్కొక్కరికి ఒక్కొక్క సంవత్సరము శిక్ష. రు. 100 పి. జరిమానా.

:—పత్తికొండ కోఆపరేటివ్ సొసైటీ ప్రెసిడెంటును, డిస్ట్రిక్టు లేడీహాస్పిటలు మెంబరుగాను ఉండి ఎక్కువగా విద్యాభివృద్ధికై కృషిసల్పుచున్న శ్రీమతి పెండేకంటి లక్ష్మమ్మగారు కోవెలకుంట్లసభలో ఉపన్యసించిరి.

27:—గుడివాడ. శ్రీమతులు మూరపనేని వేంకటసుబ్బమ్మ (పాములపాడు), పూనూరి సుందరమ్మ (నందివాడ), నూతక్కి సీతారామమ్మ (కొమరవోలు), జాగర్లమూడి కామేశ్వరమ్మ (వెంట్రప్రగడ) గార్లకు ఒక్కొక్క సంవత్సరము శిక్ష. రు. 100 పి. జరిమానా.

:—కె. నటరాజన్ గారి కుమార్తె సెల్లాంచెరసాలనుండి విడుదలచేయబడిరి.

28:—భీమవరములో శ్రీమతి దేవరభొట్ల పరమేశ్వరమ్మగారు (రేపల్లెచర్ల, నైజాముఇలాకా) వీరభారతి కరపత్రములు పంచిపెట్టినందులకు అరెస్టు చేయబడిరి.

:—అమరుచందుసథానీయును, శేరతన్ బహాటీయును మార్వాడీవర్తకులు. వీరు శారదా ఆక్టునకు వ్యతిరేకముగా చిన్నబాలికలను వివాహమాడిరి. అందులకై వీరికి 10 రోజులు ఖైదున్ను, రు. 500 లు జరిమానాయున్నూ విధింపబడెను. జరిమానా చెల్లింపనిచో ఒకనెల ఖైదు ఎక్కువ అనుభవించవలెను.

29:—తాడేపల్లిగూడెంలో శ్రీమతి జక్కుల చిట్టెమ్మగారిని క్రి. లా. అ. 17 సెక్షను క్రింద పెంటపాడు పోలీసువారు అరెస్టు చేసిరి.

30:—

జూలై

1:—మంతెనవారిపాలెముకాపురస్థురాండ్రు శ్రీమతులు మంతెన పెదఅచ్చమ్మ, మంతెన చినఅచ్చయ్యమ్మ, దంతులూరు సుబ్బమ్మగార్లు రాయవేలూరు చేరసాలనుండి విడుదలయైరి.

:—శ్రీమతి కోశేరు అనసూయగారు వేలూరు జైలునుండి విడుదలయి వారిస్వగ్రామమగు తేలప్రోలుచేరిరి.

2:—పూనాజిల్లా కాంగ్రెసు సభాసమావేశసందర్భమున శ్రీమతి ఆనందబాయిగారు అరెస్టుచేయబడిరి.

:—ఢిల్లి. కే. శే. స్వామి శ్రద్ధానందగారి కుమార్తెయగు శ్రీమతి వేదకుమారికి ఆరునెలల కఠినశిక్ష.

:—శ్రీమతులు బి. కృష్ణవేణమ్మ, భమిడిపాటి రంగనాయకమ్మగార్లు (కాకినాడ), మద్దూరి రమణమ్మగారు (మద్దూరి అన్నపూర్ణయ్యగారిభార్య), సుఖవాసి భ్రమరాంబగారు (గుంటూరు), తూము చూడామణి, చేబియ్యం సోదెమ్మగార్లు (పోలవరం) కన్ననూరుజెయిలునుండి విడుదలై మదరాసువచ్చిరి.

3:—కలకత్తా. రవీంద్రనాథ ఠాకూరుగారి సోదరియగు స్వర్ణకుమారదేవిగారు నిన్నటిరోజున కాలధర్మము నొందిరి. వీరివయస్సు 78 సంవత్సరములు. వీరు బాల్యగంగలో గతించిరి. అంత్యక్రియలు జరుపుటకై పలుపుర ప్రముఖులు విచ్చేసిరి. ఠాకూరువంశములోనివారును, మాయుర్భంజి, కూచిబీహారుల డొవేగరు మహారాణులును గూడ దహనసంస్కారమునకు వచ్చిరి. స్వర్ణకుమారదేవిగారు సుప్రసిద్ధ బెంగాలి నవలారచకులు. ఇంగ్లీషునుండి బెంగాలీకును, బెంగాలీనుండి యింగ్లీషుకును గ్రంథరచన గావించిన వారిలో వీరు ప్రథములు. వీరి కుమారుడు జె. ఘోసలుగారు బొంబాయి ప్రభుత్వకార్యనిర్వాహకసభ్యులుగ పనిచేసి 1930 సంవత్సరములో పింఛనుతీసికొనిరి. వీరికుమార్తె జ్యాలదేవిగారు గూడ సజీవులైయుండిరి.

4:—కన్ననూరు. శ్రీమతి ఏ. కె. ఆచారిసతి, మరికొందరు విద్యార్థులు చిరిక్కాల్ రాజాగారి ఉన్నత పాఠశాలను పికెట్టుచేసిరి. పాఠశాలకువెళ్ళనివిద్యార్థులు ఆచారిసతిగారి అధ్యక్షతను సభజరిపిరి.

5:—రాజమండ్రి. శ్రీమతి పెద్దాడ సుబ్బమ్మగారి అధ్యక్షతక్రింద అఖిలభారతస్వదేశిప్రదర్శనహాలులో శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు స్త్రీధర్మమునుగూర్చి ఉపన్యసించిరి.

:—కన్ననూరు జయిలునుండి గుంటూరుజిల్లా పిచ్చికలపాడు గ్రామవాస్తవ్యులు శ్రీమతి పంచాంగం రామానుజమ్మ, ఫులవరి గ్రామవాస్తవ్యులు తట్ట లక్ష్మీనరసమ్మ, గారికపూడి గ్రామవాస్తవ్యులు దేవిసేని రాజలక్ష్మమ్మగార్లు విడుదలచేయబడిరి.

6:—ఏలూరు వాస్తవ్యులగు శ్రీమతులు దాసరి లక్ష్మీబాయమ్మ, దాసరి కృష్ణవేణమ్మగార్లు వేలూరు జైలునుండి విడుదలచేయబడిరి.

:—కాకినాడ. జగన్నాథపురము శివాలయములో వెలరోజులుగా జరుగుచున్న రామాయణహరికథాసందర్భములో శ్రీరామముద్రికాప్రదానముక్రింద శ్రీమతి బొల్లాప్రగడ విజయలక్ష్మమ్మగారు చేతినున్న సువర్ణహస్తాంగుళ్యాభరణమొసంగిరి.

7:—క్రొత్తఆర్డినెన్సును మదరాసు భారతస్త్రీల సంఘమువారు సభచేసి తీవ్రముగ నిరసించిరి.

:—కడపజిల్లా బద్వేలితాలూకా గొల్లపల్లెకాపురస్థుడు రామయ్యగారికుమార్తె బాలవితంతువు 18 సంవత్సరముల వయస్సుగలది రామలక్ష్మమ్మకును వేంపల్లెకాపురస్థుడు తల్లం సుబ్బయ్యగారి కుమారుడు సుబ్బయ్యగారికిని మదరాసు త్యాగరాయనగరమున వివాహముజరిగెను. వధూవరులిద్దరు ఆర్యవైశ్య కులజులు.

:—బరంపురము. బ్రహ్మపురాంధ్రమహిళాసమాజముయొక్క 19-వ వార్షికోత్సవము మహిళామందిరమునందు జయప్రదముగ జరిగెను.

:—గుంటూరుమండలసభ జరిపినందులకు తెనాలియందు శిక్షింపబడినవారిలో స్త్రీలు: తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు అధ్యక్షురాలు, పశ్చిమగోదావరిజిల్లా, చేబ్రోలు, ఐడిక్లైదు, బి. క్లాసు. పాటిబండ్ల పార్వతమ్మగారు, చేబ్రోలు, గుంటూరుజిల్లా, కఠినశిక్ష, బిక్లాసు. అందరికిని ఆరేసినెలలు.

:—బొంబాయిలో సుప్రసిద్ధకార్మికనాయకురాలగు బొంబాయి మ్యునిసిపలుకార్పొరేషనుసభ్యురాలు అగు శ్రీమతి మణిబెనుకారాగారు రాజద్రోహకరమగు ఉపన్యాసమునకై అరెస్టుచేయబడిరి.

8:—వెల్లూరుస్త్రీలజయిలునుండి శ్రీమతి ముల్పూరు చుక్కమ్మగారు (డాక్టరు ముల్పూరి రంగయ్యగారి సతీమణి) విడుదల.

:—ఢిల్లీ. "ప్రభుత్వమునకు ప్రతికూలముగా వర్తించుటలో ప్రాముఖ్యముగన్న వంశమునకు చెందినవారు గాన వీరికి తక్కువశిక్షలువేసి ప్రయోజనములేదు" ఇట్లని అదనపు జిల్లామేజిస్ట్రీటు ఇసారుగారు స్వామి శ్రద్ధానందగారి మనుమరాలికిని, కొడుకు కోడలికిని, ఆరేసినెలలు కఠినఖైదు, రు 50 జరిమానా విధించిరి. శ్రద్ధానందగారి మనుమరాలిపేరు కౌసల్యాదేవి. ఈవిడభర్త చమన్‌లాల్‌గారు. వీరుహిందూస్థాన్ టైమ్సుపత్రిక ప్రధానవిలేఖరులు. రెండవఆవిడ సుమిత్రాదేవి. "అర్జున" పత్రిక సంపాదకుడుసత్యకామాగారి భార్య వీరిద్దరును ఖైదీలలోజువ ఊరేగింపు జరిపించిరి. కౌసల్యాదేవిగారికి మూడునెలల బిడ్డయు, సుమిత్రాదేవిగారికి ఏడాదిబిడ్డయు వెంటగలరు. శ్రీమతి దులారీదేవిగారికి అదే నేరమునకు మూడునెలల ఖైదుశిక్ష విధింపబడెను.

9:—లండనులో రాణీగారు కుమార్తెను వెంటబెట్టుకొని ఇండియాఆఫీసును సందర్శించిరి. వారికి భూపాలరు దంపతులు ఆహ్వానమిచ్చిరి.

:—మదరాసు. తిరువళిక్కేణి కల్లెటుహాలునందు మద్రాసుస్త్రీసంఘమువారు శ్రీమతి డా. ముత్తులక్ష్మి రెడ్డిగారి అధ్యక్షతను సమావేశమై లోధియనురిపోర్టును నిరసించిరి.

10:—బొంబాయి. ఇరువదినాలుగుగంటలలోగా బొంబాయినివదలి పోవలసినదని మీరాబెన్ గారికి క్రొత్త ఆర్డినెన్సుక్రింద నోటీసు జారీచేయబడెను.

11:—సగవానివాహకసంఘము మదరాసుశాఖయాజమాన్యమున యస్. వేంకటసుబ్బయ్యగారికిని, లీలావతి గారికిని వితంతువివాహముజరిగెను.

12:—మదరాసు. రటనుబజారురోడ్డులోని విదేశపువస్త్రపుఅంగళ్లను ఇద్దరుస్త్రీలు పికెటింగుచేయగా వారు పోలీసువారిచే ఎరస్టుచేయబడి కమీషనరు కార్యాలయమునకు గొంపోబడిన తరువాత వదలివేయబడిరి.

:—ఢిల్లీనుండి చమన్ లాల్ సతి మున్నగు స్త్రీఖైదీలను లాహోరుస్త్రీలఖైదునకు బదలాయించిరి.

13:—మదరాసు. శ్రీమతి సుబ్బరాయనుగారిసతి జబ్బుచే బొంబాయిసభకు వెడలజాలకపోయినవారు అచట రౌండుటేబిలుసభాప్రతినిధులుగావించిన తీర్మానముతో ఏకీభవించి సంతకము చేసిరి.

14:—కుమారి కుర్షైదు బేను గారు-దాదాభాయి నౌరోజిగారి మేనగోడలు, లాహోరుస్త్రీలజెయిలులో శిక్ష ననుభవించుచున్న వారు-అపెండిసిటీసు ఉన్నదని అనుమానముచే మాయోఆస్పత్రికి మార్చబడిరి.

:—జబ్బుగానున్న బాబురాజేంద్రప్రసాదుగారిని చూచుటకు శ్రీమతి మీరాబెను (స్లేడ్ కన్య) చాప్రాకు వచ్చెను. 12 గంటలలో శరణ్ జిల్లాను వదలి వెళ్లిపోవలెననియు, నెలవరకు జిల్లాలో అడుగుపెట్ట రాదనియు స్పెషల్ ఆర్డినెన్సుక్రింద శరణ్ మేజిస్ట్రేటుగారు మధ్యాహ్నము 1 గంటకు ఉత్తరవు జారీచేసెను.

15:—శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు నాగపురమునకు వెళ్లిరి.

:—తామ్లూకురాజకీయసభాసందర్భమున ఎరస్టుచేయబడిన శ్రీమతి కిరణమైత్రిగారికి 6 మాసములశిక్ష.

16:—శ్రీమతి మంజుఅమ్మాళ్ రాజపాల్యము, ఈమె ఘోషాస్త్రీ. వెుదటను బి. తరగతి 7 నెలలుశిక్ష వేసినారు. ఆమె సహజముగ ఉబ్బసమువలన బాధపడుచుండును. ఆమె నిపుడు బి. నుండి సి. కి మార్చినారు. మార్చుటకు కారణమేమైనను ఆమె శరీరస్థితివలన వెంటనే బి. తరగతికి మార్చుట ఆత్యవసరము అని వెల్లూరునుండి విడుదలయైన శ్రీమతి కమలాదేవిఆర్యాగారు తెలుపుచున్నారు.

17:—బాపట్ల: స్త్రీహితైషిణీమండలిప్రథమవార్షికోత్సవము సబ్ జడ్జిగారి సతీమణియగు ఎమ్. తుంగాబా యమ్మగారి అధ్యక్షతను జయప్రదముగాజరిగెను.

18:—బొంబాయి. మాండ్వీవార్డు కాంగ్రెసుకార్యాలయమునుపట్టుకొన ప్రయత్నముచేసిన కాంగ్రెసు వాలంటీరులందు అరెస్టుఅయినవారిలోగల ఇరువురుస్త్రీలకును నాలుగేసిమాసముల కఠినశిక్ష విధింప బడెను.

19:—బంకూరు. శ్రీమతి చారుబాలాదేవిగారిని కాంగ్రెసు ఉద్యమమునందు పాల్గొనినందుకు అరెస్టుచేసిరి. విచారణకై బిష్ణుపూరు ప్రత్యేక మేజిస్ట్రేటుగారియొద్దకు బంపిరి.

:—కాశీ. మీరాబెనుగారికి జ్వరము ఎక్కువగానచ్చుచున్నది. మలేరియాజ్వరమని తలంపబడుచున్నది. వీరిపుడు మదనమోహనమాళవ్యాగారియొద్దనున్నారు.

# గ్రంథపరిచయము

**శిథిలవైభవము.—**

గ్రంథకర్త శ్రీ దేవగుప్తాపు వేంకటరమణమూర్తి పంతులుగారు. చరిత్రాత్మకమగు ఖండకావ్యము. "ఈకావ్యమునందు హంపీసామ్రాజ్యపురాణవైభవము కీర్తింపఁబడినది. కావ్యకర్త హంపీక్షేత్రమును సందర్శించినట్లు కావ్యమునందలి విపులీకృతవిషయపుష్టి చెప్పకచెప్పుచున్నది. భావవిలసనమునకుఁదోడు పరిశీలనజ్ఞానమీకావ్యమునకు వన్నెఁగూర్చినది. భాషయుఁ శైలియుఁ బరిశుద్ధములై కావ్యమునకు ప్రయోజనమొనగూర్చుచున్నవి." అని శ్రీ కొల్లూరు ధర్మారాయకవి (బి.యే) గారి తొలిపలుకు. క్రౌను సైజు, మంచిగ్లేజు కాగితములు, 20 పుటలు. వెల రు 0-2-9. చిరునామా: డి. వి. రమణమూర్తిపంతులుగారు, మీరాశీదారు, వెంపడాం, రేగపోష్టు, (వయా) సెల్లిమర్ల, విశాఖపట్టణముజిల్లా.

**నక్షత్రమాల:—**

ఇది బ్రహ్మశ్రీ విద్యారత్నాకరం నృసింహాచార్యులుగారిచే విరచితము. సంస్కృతశ్లోకములు. బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు శ్లోకములకు తాత్పర్యము వ్రాసియున్నారు. శ్రీ వ్యాసాశ్రమమున మామూలుగా జరుగు శ్రీ శంకరజయంతిమహోత్సవపూజాపుణ్యదినమున భక్తులకుపయోగార్థము బ్రహ్మశ్రీ టంగుటూరి రామస్వామయ్యగారిచే ప్రకటింపబడినది. క్రౌను సైజు, 16 పుటలు. పోష్టేజికొఱకు 0-0-6 బిళ్ళపంపువారి కీగ్రంథము ఉచితముగా పంపబడును. చిరునామా: వేదవ్యాసముద్రాక్షరశాల, 3, వాషర్‌మానళ్ళవీధి, జార్జిటవున్, మద్రాసు.

**గడబిడపంచాంగము:—**

క్రొత్తసంవత్సరసిద్ధాంత గడబిడపంచాంగము. గ్రంథకర్త: పట్టిసపు శ్రీ రామమూర్తిగారు. చదువ మొదలిడినది మొదలు కడుపు చెక్కలగునట్లు నవ్వించువిషయములతో ఈగ్రంథము ఒప్పుచున్నది. లోకవిషయములనేకములు. చిన్నసైజున 16 పుటలు. వెల 0-0-6. గ్రంథకర్తపేర వరహాపురం, గవరవరంపోష్టు అని వ్రాయునది.

**ఆత్మార్పణము:—**

ఉభయభాషాప్రవీణ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారిచే వ్రాయబడిన చిన్న పద్యకావ్యము. 'లబ్ధకపోతోపాఖ్యానము' నందలి కథయే ఇందు ప్రస్తరింపబడినది. శరణాగతరక్షణప్రశంసాపరమైన ఈకబ్బము స్త్రీలును, బాలికలును చదువదగినంత సులభసుందరశైలిలో ఒప్పుచున్నది. పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారి ఆమోదమునందినది. అక్షరాస్యయగు ప్రతిఆంధ్రస్త్రీయు నీగ్రంథప్రతియొకటి తన సొంతగ్రంథసముచ్చయమునసుంచుకొనవలెను. క్రౌను సైజు-గ్లేజుకాగితములు. 48 పుటలు. వెల రు0-5-0 అణాలు. వలసినచో తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు, పండిట్, బోర్డుహైస్కూలు, బాపట్లఅను చిరునామాకు వ్రాయవలెను.

**ధనలక్ష్మి:—**

సాంఘికవిషయకమైన నవల. గ్రంథకర్త మారెళ్ల కామేశ్వరరావు, బరంపురము. ధనలక్ష్మికల్యాణమహోత్సవమే ఇందలి ప్రధానవిషయము. ప్రేమించినవానిని పెండ్లాడు ప్రయత్నములో ధనలక్ష్మికి తల్లికూడ వ్యతిరేకించినది. పెండ్లిఇల్లు తగులబడి ధనలక్ష్మిని ప్రేమమూర్తితో కూర్చినది. తిరుపతివేంకటస్వామిసన్నిధిని ధనలక్ష్మి తన్ను ప్రేమించిన వానిని వరించినది. కడముట్టచదువ కుతూహలము రేపు నవల. డెమ్మీసైజున 130 పుటలు.




పుష్కరమునకు రిటరన్ టికెట్లు ఏల లేవు?:—

ప్రయాగయందలి కుంభమేళమువలెను, కుంభకోణమునందలి మహామాఘమువలెను అతిప్రసిద్ధమైన గౌతమీపుష్కరములకు యమ్. యస్. యమ్ కంపెనీవారు రిటరన్ టికెట్లు ఏల ఈయలేదు? ఈ రైలుకంపెనీవారి సలహాసంఘమునందు ఆంధ్రప్రతినిధులగు శ్రీ వి. వియ్యన్న పంతులుగారు ఈవిషయమై ఏమైనప్రయత్నములు గావించినారా? ఇతరతావులయందు చిన్న చిన్న ఉత్సవములకుకూడ రిటరన్ టికెట్లు ఈయబడుచున్నవి. పండ్రెండేండ్లకొకసారివచ్చు బ్రహ్మాండమైన ఈఉత్సవమునకుమాత్ర మవిలేవు. తెలుగువాని పలుకుబడికి ఇదియొక నిదర్శనము. ఆంధ్రుడా! నీదేశమునడుచు రైళ్ళబాటలకు దక్షిణమహారాష్ట్రపుఇనుపదారి అనియు, బెంగాలు నాగపూరు ఇనుపదారిఅనియు పేళ్ళు. ఆపేళ్ళలో ఆంధ్రశబ్దమే పలుకదు. పేరులోనే లేని పలుకుబడి పరిపాలనలోమాత్ర మెటులుండును? ఆంధ్రదేశరైలుప్రయాణీకులసంఘమువారు అడావుడిమాత్రము చేయుచున్నారు. క్రియలో లాభము కించిత్తేని కలుగుచుండునట్లు వినము. ఈరైల్వేలపరిపాలనమున ఇకనైన నీవు వ్రేలుపెట్టనుద్యమించి సౌకర్యములను సంపాదించుకొందువు గాక!

లోథియను నివేదిక: స్త్రీల వోటుహక్కు: గజ్నవీ నిరసనము:—

భారతశాసనసభాసభ్యులును, సాంఘికప్రాతినిధ్యమునకై తీవ్రముగ వాదించువారును అగు ఎ. హెచ్. గజ్నవీగారు లోథియను నివేదికలోని స్త్రీలవోటుహక్కునుగూర్చి ఇట్లు అభిప్రాయమిచ్చుచున్నారు: "స్త్రీలవోటుహక్కువిషయమున ఈనివేదికను నేను తిరస్కరించుచున్నాను. ఇట్లు స్త్రీలకు వోటుహక్కునిచ్చుటచే పడుపువృత్తినవలంబించు స్త్రీజనము ఎన్నికలలో విజృంభింతురు. పౌరజీవనమున కిది మంచిదికాదు. పలుభార్యలుకల భర్త కుటుంబములో పెద్దభార్యకే వోటుహక్కునిచ్చుట సరిగాదు. ఆపెద్దభార్య ప్రాతకాలపు మూఢురాలుకావచ్చును. చిన్నభార్యలే చక్కగాచదువనేర్చిన నాగరికులుగావచ్చును." తుదివిషయములు కొంతవఱకు అంగీకరింపవలసినవే. కాని స్త్రీలకు ఓటింగుహక్కునిచ్చు

టచే పశుప్రవృత్తినవలంబించు స్త్రీజనము ఎన్నికలలో విజృంభింతురనుట మాత్రము నమ్మరానిది. ఈవాక్యములు గజ్నవీ అంతటి రాజకీయనాయకుని—సాంఘికప్రతినిధ్యతీవ్రవాదియేయగుగాక—నుండివినరానివి. మేమీవిషయమునుగూర్చి ఒకతూర్పునాటిమిత్రునితో ప్రస్తావింపగా నాతడు గజ్నవీని వెనుకవైచుకొని అనకాపల్లి మునిసిపలుసంఘవ్యవహారములు ఒకభోగకాంత ప్రవేశముచే నెట్లుకలుషితములైనవో వివరించెను. ఆమిత్రుని సత్యప్రియత్వమునుగూర్చి మాకు పూర్ణమైన నమ్మకముండుటచే మేమావిషయమును కాదనజాలము. అయినను ఏదోఒక్కతావున ఘటిల్లిన ఈసంఘటనము దేశమునఎల్లతావుల జరుగగలదనుట క్షంతవ్యముకానిది. ఇది సంధియుగము. కులస్త్రీలు ప్రతివిషయమునందును చొచ్చుకొనివచ్చుట కిపుడేప్రారంభము చేయుచున్నారు. ఈప్రారంభమున అనుకున్నంతమంది—వలసినంతమంది కులస్త్రీలు ఒక్కొక్కప్పుడు లభింపకపోవుట వింతగాదు. ఆస్థానమున సంకోచించుటఎఱుగని భోగకాంతలు ప్రవేశింపనువచ్చును, అందుచే వ్యవహారము కొంతకలుషితమును కావచ్చును. ఇట్లుండుట తప్పనిసరి. అయితే ఇంతమాత్రమున స్త్రీల వోటుహక్కును నిరసించుట వైదుష్యముకాదు.

ఇది కేవలము రాక్షసత్వము:—

కుటుంబకలహము. ఆలుమగలు పోట్లాడుచుండిరి. మగడు భార్యను కత్తితోపొడిచెను. అడ్డమువెళ్లిన వేరొకస్త్రీనిగూడపొడిచెను. ఇది లక్నోపట్టణమున అమినాబాదుకూరగాయలమార్కెటులో బహిరంగస్థలమునందుజరిగెను. ప్రతినిమిషమునకు భారతదేశమున పురుషుని దార్జన్యమునుసూచించు ఇట్టివిషయములు ఎన్నిజరుగుచున్నవో? భారతపురుషుని యందీదార్జన్యము పూర్తిగనశింపనిది ఆతడు ముందునకురాజాలడు. భార్యయగునది భారతదేశమున ఇకనెంతకాలమునకు సుఖింపగలుగునో?

స్వచ్ఛందమగు సహగమనము:—

సంయుక్తరాష్ట్రమునందలి ఇటవానగర సమీపమునగల మేథిపుర అనుగ్రామమున నొకవృద్ధుడు ఘాద్రి మధురప్రసాదు అనుపేరివాడు మరణించెను. అంతట ఆతనిభార్య సహగమనము చేయుటకు సంసిద్ధయయ్యెను. ఆమె నాప్రయత్నమునుండి విరమింపజేయ బంధువులు పన్నినపన్నాగములు పనిచేయలేదు. 'నాఆజ్ఞలేక నాభర్తశరీరము నిచటనుండి గొనిపోవరాదు'అని ఆమె శవముప్రక్కను పండుకొనెను. పాడె తయారయ్యెను. దానిపై శవమును పెట్టనుండిరి. ప్రక్కను ఆమె మరణించియుండెను. ఈస్వచ్ఛందసహగమనమునకు వారు పొందిన ఆశ్చర్యమునకు అంతులేదు. మగనిశవముతో ఆమెశవమునుకూడ కలిపికట్టుగొనిపోయిరి. పవిత్రహృదయముకలవారి తలంపులు అప్పటికప్పుడు ఫలమునిచ్చును. సహగమనములను నిషేధించు శాసనమా! నీకు నూరేండ్లునిండినవి. కాని నీవాడి ఇక్కడ మొరకుపోయినది.

బాలికకు ఉపనయనము:—

వేదమున పలుఋక్కులు స్త్రీరచితములుగా కనుపించుచున్నవి. కాని అనంతరకాలమున స్త్రీలకు వేదాధికారము విలుప్తమైపోయినది. అట్టిస్థితిలో కడపలో శ్రీయుత బండి అప్పారావుగారు తమకుమార్తెకు ఉపనయము గావించిరను వార్త భారతీయులకు వింతగనే కన్పట్టును. కాని శ్రీఅప్పారావుగారి ఈచేత ప్రతివిషయమునందును స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కుగలదనుటను లోకముగుర్తించినదనుటకు ఒకనిదర్శనముగానుండగలదు. స్త్రీయుద్యమాభిమానులెల్లరును శ్రీఅప్పారావుగారిని కొనియాడగలరు.

"హిందూసుందరి" ని నిలుపుడు.—

స్త్రీలకొఱకు ప్రత్యేకముగా జనానాపత్రిక, అనసూయ, ఆంధ్రలక్ష్మి, సావిత్రి, సతీహితబోధిని, హిందూసుందరి మొదలగు పత్రికలు తెలుగున వెలసినవి. హిందూసుందరి తప్ప మిగిలినవన్నియు కాలప్రవాహమున కొట్టుకొనిపోయినవి. ఇరువదియేడుసంవత్సరములుగ నిర్వహింపబడుచు శ్రీమతి మాడభూషి చూడమ్మ మొదలగు విఖ్యాతాంధ్రవిదుషీమణుల సేవనుపొంది ప్రఖ్యాతికెక్కిన హిందూసుందరికూడ నేడు కాలప్రవాహమున పడునేమోయనునట్లు ఏతత్పత్రికాసంపాదకులు 'ఇదేకడాపటి విన్నప'మని ఇట్లువ్రాయుచున్నారు. "పాఠకమహాశయులారా! మహారాజపోషక రాజపోషక సహాయబిరుదాంకితులై మాపత్రికాపీఠము నలంకరించి వెలయుచున్న ధనాఢ్యులారా! చందాదారులైన సోదరీసోదరులారా! మీకు మేముచేయు కడాపటి విన్నపము ఇదియే. కావున మాయందు దయయుంచి సాంతముగా మావిన్నపము చిత్తగించి కర్తవ్యము నిర్ణయించికొని మీచిత్తానుసారముగావింపుడు. ఎన్ని కష్టములు వచ్చినను ఎంతదండుగ వచ్చుచున్నను సహించి, వహించి మానుషమునకు నిలువంబడి, అభిమానమున మానలేక మాహిందూసుందరి నింతవరకు నడిపించికొని వచ్చినారము. అయినను నది యిక నిలుచు సుయోగము తప్పిపోవుచున్నది. ప్రత్యేకము లేఖలు వ్రాసినారము. ఎవ్వరు నొకతెల్లని రూపాయి పంపిన పుణ్యమును బొందలేదు. సరేకదా సమాధానమైన తెల్పలేదు. మహాశయులారా! మీరు దేశమున పెద్దపేరుమోసినవారని వేలానవేలు నిర్లక్ష్యముగా వెచ్చపెట్టుచున్నవారని విని మీకరుణాకటాక్షము మాపైనియేలేశమైన జూపకుందురా యని పేరాసతో మీబిరుదులు మాపత్రికలో కెక్కించితిమి. కాని తామేమియు మాకుతోడ్పడలేదు. మీరు వేయవలదని సెలవియ్యనులేదు. కావున తమ కడాపటి అనుగ్రహమును గోరుచున్నారము. అగునో కాదో సెలవీయుడు. పెక్కురు విద్యాధికులు కాంగ్రెసువాదులము దేశసేవకులము మేము మెంబర్లమైతే లోకము ఉద్ధరించివేసెదమని ప్రగల్భములుపల్కి వోట్లు సంపాదించి అహోదా చేతికిరాగానే అయిసరుబొజ్జ అని పూర్వపై ఖరియేలేక యెవరికి నొక్కయుపకారము చేయుదలంపక మితవాదులే మంచివారనిపించుకొనుచున్నారు. రాజమంద్రి తాలూకాబోర్డువారు సంవత్సరముపొడవున పాఠ

శాలకు పత్రికలు తెప్పించి కడాపట మొండిచెయ్యి చూపినారు. విజయనగరమువారు మాటయేయాడుటలేదు. ఇంకేమిదేశసేవ. నాయకులారా! సంవత్సరముపాడవున గైకొని చందాకూడా ఇవ్వక మౌనము వహించినారు. అక్కరలేనిచో గైకొన్న పత్రికలకు అయిన మట్టుకైనాపంపక మొగచేపుచున్నారు. ఉత్తరమునకు జబాబువ్రాయరు. వి. పి. పంపితే త్రిప్పివైచెదరు. మునుపటివలెకాదు వి. పి. కి రు 0—5—0 అగును. వారు త్రిప్పి వేయుచో ఇదియొక చేతిపట్టము తగులునని వెరచి యూరకుంటున్నాము. మధ్య మచ్చునకు పంపితే త్రిప్పి దండుగతగిలించుచున్నారు. ఏమి దేశదౌర్భాగ్యము! ఇంకేమిదేశసేవ? ఇంకేమియుద్యమములు? ఇంకేమి పత్రికాపోషణ? విరమింపవలసినదని సెలవిచ్చెదరా? లేక యేదోవిధిలైనంత తోడ్పడి పత్రిక నిలువబెట్టెదరా? లేనిచో దేశదౌర్భాగ్యమునకై గుందుచు మీసోదరీపత్రిక యిక మీయింటికిరాక ఉసురని మీపేరుచెప్పికొని ప్రాణత్యాగము చేయుచున్నది. ఇకమీరు దానింగాంచబోరు, అనితెల్పుచు మీయౌదార్యమునకై కొంతవరకు నిరీక్షించుచున్నారము." ఈవిన్నపమును చదువుటలోడనే పత్రికావ్యాపారవిషయమున తెలుగువారున్న శోచనీయస్థితి గోచరముకాగలదు. పత్రికావ్యాపారము తెలుగుదేశమున నున్నంతభ్రష్టముగా భారతమున మఱియేభాగమునలేదు. ఈదేశమున పుట్టిచచ్చిన పత్రికలకు లెక్కలేదు. ఆంధ్రభూమి పత్రికలశ్మశానభూమియన్న తీవ్రవాదియగు ఒకానొకమిత్రునితో మేమేకీభవింపజాలముకాని పుట్టువేళావిశేషముననో, పుట్టించినవానికి తపశ్శక్తిచాలకనో తెలుగుపత్రికలు బాలారిష్టములను తప్పించుకొని బయటపడుటలేదు. అభినవసరస్వతి, కృష్ణాపత్రిక, హిందూసుందరి, ధర్మసాధని ఇవితప్పిన ఇరువదియేండ్లునిండిన పత్రికలు తెలుగునకానము. ఈలెక్క నాలుగింటియందును హిందూసుందరి ఆయువు ఇపుడు చంచలముగా నున్నది. మఱియు నిది స్త్రీలపత్రిక. వారైన అభిమానముూని దీనిని నిలుపవలయునని మనఃపూర్వకముగ గోరెదము. రాజపోషకులును, తాలూకాబోర్డుప్రెసిడెంట్లును బాధ్యతను, భాషాభిమానమును వహించి 'హిందూసుందరి' ఉసురులు నిలివెదరుగాక!

ఆంధ్రా ఇన్సూరెన్సుకంపెనీ: బందరు:—

ఆంధ్రుని నిర్వహణసామర్థ్యమునకు నిదర్శనముగా చూపగల సంస్థలలో ఆంధ్రా ఇన్సూరెన్సుకంపెనీ ఒకటి. ఆసంస్థయొక్క 1930-వ సంవత్సరపు డైరక్టరులరిపోర్టు మా కార్యాలయమునకు పంపబడినది. దిఙ్మాత్రముగ దానిని తిలకించుటవలననే దానిక్రమాభివృద్ధి తెలియవచ్చుచున్నది. ఆదాయము హెచ్చుట-ఖర్చుతగ్గుట అను రెండు సుగుణములు కానవచ్చుచున్నవి. భూమితనఖాబ్యాంకులు, సహకారబ్యాంకులు ఇట్టి ప్రజోపయోగకర సంస్థలయందే ఈ కంపెనీవారు తమద్రవ్యములో విశేషభాగము నిలువపెట్టుచుండుట గమనింపదగినది. ఈకంపెనీ ఆంధ్రులసొమ్ము. దాని పునోభివృద్ధిని ఆశింపని ఆంధ్రు డెవడుండును.?

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| నెల్లూరు: | ఏ. రాఘవయ్య & సన్స్, సుబేదారుపేట. |
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, జోల్ రిప్రజం టేటివు ఆఫ్ న్యూస్ |
| మచిలీపట్టణము: | సి. వి. అవధాన్లు, ఇన్సూరెన్సుబీరో. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మిబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడు,(మన ప్రాంతపు 1 రూఉస్మానియా రూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| రాజమంద్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్స్, న్యూస్ ఏజంట్స్. |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియ శెట్టిగారు, గొల్లపల్లి. |
| | మారెళ్ల బ్రదర్స్. |
| గుంటూరు: | వెల్ కం అండు కంపెని. |
| ఏలూరు: | సనకా రాజారావుగారు, పవరుపేట. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| అనకాపల్లి: | గ్రంథి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | వెం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| ,, | ఎం. సూరిరాజు, ఆంధ్రన్యూస్ ఏజన్సీ. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు, బుక్ సెల్లర్సు. |
| జేమ్షెడ్ పూరు. | టి. వి. రమణయ్యగారు, 3 టిల్ జుగ రోడ్డు, న్యూ 'L' టౌను. |
| మదరాసు: | వై. టి. ఎస్. నారాయణశాస్త్రిగారు, టైపైరిటరు ఏజన్సీ, 364, ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| తణుకు: | నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రాఇన్ డస్ట్రియల్ స్టోర్సు. |
| అనంతపురము: | శ్రీగోపాలకృష్ణ అండ్ కంపెని, జనరల్ మర్చెంట్సు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.